శ్రీ ర స్తు.

శ్రీరామబ్రహ్మ గురవేనమః.

భాగవతుల కృష్ణదాసుల వారిచే

రచియింపఁబడిన,

# శ్రీ శుద్ధనిర్గుణతత్త్వ కందార్థములు.



197

ఇది,

అచలపరిపూర్ణులగు వారలకు మిక్కిలి యుపయోగార్థమై

సీతారామాఖ్యచే

తాత్పర్య విశేషార్థ సహితము వ్రాయఁబడినది.







చెన్నపట్టణము.

ప్రాతచాకలపేటయందుండు

## పమ్మి * త్యాగరాయసెట్టిగారి

శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

10—11—1922

ఈగ్రం,

[గ్రంథము నింటాపీరైట్.] [వెల అణాలు. ౧౨.

శిష్యుడు గురుపాదముఁ

గురుడు శిష్యునికి తెన్నగా బో

పాపవిమోచని. ౦-౨-౦

విగ్రహారాధనమీమాంస. ౦-౨-౦

సూక్ష్మమోక్షమార్గము. ౦-౫-౦

జీవన్ముక్తిదాయిని, పుత్రోత్సాహ ప్రదాయిని. ౦-౩-౦

హేమతారకవిద్య. ౦-౨-౦

మనోవ్యాధికి మందు అను గ్రంథము. ౦-౨-౦

బ్రహ్మజ్ఞాన ఉపదేశవాక్యంబులు, పరమహంసవిద్య. ౦-౩-౦

సామెతల బ్రహ్మజ్ఞాన రహస్యార్థ బోధిని. ౦-౫-౦

సహజాద్వైతానుభవప్రకాశిక. ౦-౨-౦

గగనవిద్య. బ్రహ్మజ్ఞాన గానామృతము. ౦-౩-౦

మృత్యుంజయ బోధిని. ౦-౨-౦

అనుభవానంద దీపిక. ౦-౬-౦

కాశీయాత్రప్రకాశిక. ౦-౬-౦

పరమార్థతత్త్వరహస్యబోధిని. ౦-౨-౦

మృతజీవబోధిని. ౦-౨-౦

మహాద్వైతబోధిని. ౦-౨-౦

అద్వైతామృతబోధిని. ౦-౨-౦

ఆశాపాశచ్ఛేదిని. ౦-౨-౦

లింగదేహభంగబోధిని. ౦-౨-౦

శ్రీవిదేహకైవల్యానందబోధిని. ౦-౩-౦

శ్రీసన్యాసోపన్యాసము. ౦-౩-౦

సంసారబంధవిముక్త్యోపాయబోధ. ౦-౨-౦

శ్రుతిమాలార్థానుభవబోధిని. ౦-౨-౦

వేదాంత కఠిన పదార్థమంజరి. ౦-౪-౦

గురుగీత పద్యములు. ౦-౨-౦

నారసింహదాసు పద్యములు. ౦-౪-౦

సచ్చిదానంద బోధామృతం రాజహంస పరమహంస సంవాదము. ౦-౧౪-౦

నిష్ప్రతియోగిక బ్రహ్మబోధిని. ౦-౨-౦

వాసుదేవమననము. ౦-౬-౦

బ్రహ్మోత్తరఖండం ౦-౬-౦

వేదాంత ప్రశ్నోత్తరముక్తావళి అనెడి గురుశిష్య సంవాదము. ౦-౬-౦

సద్యోముక్తిబోధిని. ౦-౫-౦

పునర్జన్మ సందేహ నివర్తిని. ౦-౪-౦

దేవాంగపురాణము. శ్లో. తా. ౦-౧౪-౦

పరమ పురుషార్థ పంచ ప్రశ్నోత్తర రత్నములు. ౦-౪-౦

శుష్క వేదాంతసిద్ధాంతుల గర్వాపహారి. ౦-౩-౦

పిండివాఁడు అను గ్రంథము. ౦-౨-౦

మారీచుహమ్మారీవిలాసము. ౦-౨-౦

మోక్షకాంతచిద్విలాసము. ౦-౪-౦

శ్రీమద్రామానుజ చరిత్రము. ౧-౦-౦

మణిత్రయి తాత్పర్యసహితము. ౦-౬-౦

పరమతత్త్వాతీతబోధిని. ౧-౨-౦

స్వధర్మ మర్మబోధిని. ౦-౨-౦

నిర్వాసనామానబోధిని. ౦-౨-౦

పురూరవచక్రవర్తిజనననాటకం ౦-౨-౦

రత్నమాలికాపరిణయంహరికథ ౦-౨-౦

శ్రీ వెంకటేశ్వర వేదాంతకీర్తనలు. ౦-౪-౦

చిత్రాంగినాటకము ౦-౬-౦

అద్వైతునకును, బ్రాహ్మ్యండునకును, సంవాదము. ౦-౨-౦

మహాతుర్యబోధిని. ౦-౨-౦

నరకోద్ధారిణి. ౦-౨-౦

పరతత్త్వప్రకాశిక ౦-౧౨-౦

ఆత్మతత్త్వ విచారణార్థ చంద్రిక గురుబోధామృతము. ౦-౩-౦

శ్రీరామనామామృత సత్స్వరూప సంకీర్తనలు శ్రీమద్వేదాంత పరిపూర్ణయాచల నిర్గుణ వచనములు. ౦-౪-౦

ముముక్షుజనకల్పకము. ౦-[illegible]

సందేహనివారణ ప్రకాశిక.

శ్రీ రాజయోగానంద…

యల్లాజీయ…

డి…



శ్రీరస్తు.

# విషయసూచిక.




| విషయములు. | కందార్థసంఖ్య. |
|---|---|
| * అవతారిక. ఈ గ్రంథము వినుడని లోకమును ప్రార్థించుట ఈ గ్రంథముయొక్క మహాత్మ్యమునున్ను, ఎవరికొఱకీ గ్రంథము చేయబడెననుటయును, లోకముయొక్క మిథ్యతయును దెల్పుట. | ౧,౨,౩,౭ |
| ఈగ్రంథముయొక్క వస్తునిర్దేశము అనగా యెందుకొఱకీ గ్రంథము జేసినదనుటయు, ఈగ్రంథము దేనిని దెలియజేయున దనుటయు దెల్పుట. | ౪,౬, ౨౧౧ |
| గురుపరంపర, వారిప్రార్థన. | ౫,౮ |
| పెద్దలను, ఇందుండుతప్పులను దిద్ది, ఒప్పులను గ్రహింపుడని ప్రార్థన. | ౧౦,౧౫,౧౭ |
| ఈగ్రంథమునందు వ్యాకరణసంబంధములైన తప్పులుండుననుట. | ౧౧ |
| ఛందశ్శాస్త్రము దెలియకయే గ్రంథమును రచియించి నందులకు కారణము. | ౧౨ |
| పునరుక్తిదోషమునకు సమాధానము. | ౧౩ |
| ఆంధ్రకవిత్వంబని దీనిని రోయకుడనుటకు కారణము. | ౧౪ |
| తప్పొప్పులు దెలియని దుష్టులదూషణ. | ౧౬ |
| సజ్జనులకును దుర్జనులకును భేదము. | ౧౮, ౨౪౮, ౨౬౯, ౨౭౨, ౨౭౫, ౨౭౬. |
| ఆగామికథను వెలుపుట. | ౧౯ |
| ఈగ్రంథము గురుశిష్యసంవాద రూపమనుట. | ౨౦ |
| గ్రంథము నింతపెద్దదిగా పెంచినందులకు కారణము. | ౨౧ |
| శిష్యుడు గురుపాదములను శరణుజొచ్చుట. | ౨౨ |
| గురుడుశిష్యునికి లెస్సగా బోధించెదనని ధైర్యముచెప్పుట. | ౨౩,౨౯ |

| విషయములు. | కందార్థసంఖ్య. |
| --- | --- |
| సాధన లేవియువలదనియు ఒక్క పరిపూర్ణబోధయే గొప్పదనియు, దానిని నీకు ఉపదేశము చేసెదననియు గురుడు చెప్పుట. | ౨౪ |
| శిష్యుడు గురుని పరిపూర్ణమెఱుకల నెఱిగింపుమని యడుగుట ఎఱుకను వదలుటకు మార్గమును దెల్పుమనియు నడుగుట. | ౨౫ |
| గురుడు శిష్యునికి మొదట పరిపూర్ణమును పిదప యెఱుకను దెలిపి యెఱుకను విడిపింప జేయుదునని జెప్పుట. | ౨౬ |
| శిష్యుడు గురుని పొగడుట, ప్రార్థించుట. | ౨౭, ౨౮ |
| పరిపూర్ణమెఱుకల గుఱించి చెప్పుట. | ౩౦ |
| శిష్యుడు మరల యుపదేశము చేయుడని ప్రార్థించుట. | ౩౧ |
| పరిపూర్ణముయొక్క వివరము. ౩౨, ౩౩, ౩౪, ౩౫, ౩౬, ౩౭, ౩౯, ౪౧, ౪౨, ౪౩, ౪౪, ౪౫, ౫౫, ౬౩, ౬౪, ౭౧, ౭౭, ౭౮, ౧౦౩, ౧౩౭, ౧౩౮, ౧౩౯, ౧౪౨, ౧౪౭, ౧౬౩, ౧౮౮, ౧౮౯ | |
| ఎఱుకయొక్క వివరము. ౩౮, ౪౦, ౪౬, ౪౭, ౪౮, ౪౯, ౫౦, ౫౧, ౫౨, ౫౫, ౫౬, ౫౭, ౬౨, ౬౩, ౬౫, ౭౧, ౭౪, ౭౫, ౭౬, ౭౭, ౧౦౪, ౧౦౫, ౧౦౬, ౧౧౩, ౧౩౨, ౧౪౦, ౧౪౩, ౧౪౮, ౧౪౯, ౧౫౧, ౧౫౨, ౧౫౩, ౧౫౪, ౧౫౬, ౧౫౯, ౧౬౧, ౧౬౨, ౧౬౩, ౧౬౪, ౧౬౯, ౧౭౦, ౧౭౨, ౧౭౭, ౧౮౧, ౧౮౭, ౧౮౯ | |
| నిర్గుణు డెవ్వడు. | ౪౫ |
| ఎఱుక పరిపూర్ణము నెఱుగ నలయుననుట. | ౫౨, ౫౮ |
| పరిపూర్ణమును గన్న వెంటనె యెఱుక తానె మాయమైపోవుననుట. ౫౩, ౫౪, ౫౮, ౬౦, ౬౯, ౭౦, ౭౨, ౭౩, ౭౪, ౯౨, ౯౩, ౯౬, ౯౭, ౧౦౧, ౧౦౫, ౧౨౬, ౧౩౫, ౧౪౫, ౧౬౭, ౧౭౩, ౧౭౪, ౧౮౨, ౨౦౦ | |
| ఎఱుకను (స్వప్నమునందు చూడుము) లేక నశింపజేయు మనుట. ౫౭, ౬౨, ౮౬, ౮౭, ౮౮, ౯౧, ౯౪, ౯౮, ౯౯, ౧౦౪, | |
| ఎఱుకనుత్యజించి పరిపూర్ణమును దెలియుట మేలిమార్గమనుట. | ౫౯ |
| ఎఱుక పోయినపిమ్మట నెఱుగునదేదియు లేదనుట. ౬౦, ౯౦, ౯౫, ౧౭౨, ౧౭౭ | |

| విషయములు. | కందార్థసంఖ్య. |
|---|---|
| గురుడే యెఱుకను పోగొట్టుటకు సమర్థుడు. | ౬౬,౧౦౧.౧౦౨, ౧౩౪,౧౪౧, ౧౫౯, ౧౬౩, ౧౬౪, ౧౬౮,౧౮౦,౧౯౧,౧౯౨, ౨౦౬,౨౦౭,౨౦౮,౨౦౯,౨౧౦,౨౧౭,౨౨౨ |
| మిథ్యయైనయెఱుక నిత్యమైన పరిపూర్ణమునం దేలాగు కలిగె ననుటకు సమాధానము. | ౬౭,౬౮ |
| లోకమునకు కారణమేదియనుట. | ౭౬ |
| ఆకాశముయొక్క వివరము. | ౮౨ |
| కొందరు, చంచలాత్ములు, ఒకప్పుడు ఎఱుకయున్నదనియు, మరియొకప్పుడు లేదనియు చెప్పుదురు. | ౮౩ |
| ఎఱుకయొక్క వివరము (లేదని తెలియ జేయుట). | ౭౯, ౮౪, ౮౭, ౮౮,౮౯,౯౨,౯౩,౯౪ |
| సంసారమబద్ధమనుట. | ౮౫, ౧౦౬, ౧౨౩, ౧౩౨, ౧౩౫, ౧౩౬, ౧౪౪,౧౭౬,౧౯౦,౧౯౧ |
| పరిపూర్ణ మెఱుకల సంబంధము. | ౮౬,౮౯,౯౮,౯౯,౧౨౮ |
| ఎఱుకచే పరిపూర్ణము నెఱుగుము. | ౯౫, ౧౫౦, ౧౫౪, ౧౫౫, ౧౫౬, ౧౬౦ |
| సంకల్ప స్వరూపము. | ౧౦౦ |
| ఇంకేమతమును నీకునవలదు పరిపూర్ణబోధయే యుత్తమ మయినది. | ౧౦౭,౧౦౮,౧౦౯,౧౧౦,౧౨౮,౨౦౨ |
| పరిపూర్ణమును గనుము. | ౧౧౧,౧౨౩, ౧౨౪,౧౩౧, ౧౩౬,౧౩౭, ౧౩౮, ౧౪౪,౧౪౫ |
| ఈబోధ నీ కిష్టమైనయెడల గ్రహింపుము. | ౧౧౨ |
| లోకులమాటలను వినకుము. | ౧౧౫,౧౧౬,౧౧౭,౧౧౮,౧౧౯,౧౨౦ ౧౨౩,౧౨౫,౧౨౬,౧౨౭,౨౧౩ |
| మాయయొక్క చిత్రము. | ౧౨౧ |
| పరిపూర్ణమునందు ప్రపంచాదులు లేవనుట. | ౧౨౩ |
| మూఢులు పరిపూర్ణముయొక్క సత్యతను తెలియజాలరు. | ౧౩౦ |
| నేననునది యేది. | ౧౩౧ |

| విషయములు. | కందార్థసంఖ్య. |
|---|---|
| గురుశుశ్రూషాఫలము. | ౧౩౩ |
| పరిపూర్ణ మెఱుకను తెలియజాలదు. | ౧౪౬ |
| నేను అనునది నిజముకాదనుట. | ౧౫౭ |
| ఎఱుకలోని సమాచారములు పరిపూర్ణము నెఱిగినపిమ్మట గానరావు. | ౧౬౭,౧౭౧,౧౮౩,౧౮౮, ౨౦౨ |
| ఎఱుకను త్యజింపనివారి సాంగత్యమువద్దనుట. | ౧౬౬ |
| పరిపూర్ణమును గన్న పిదప యెఱుకను గ్రహింపరు. | ౧౭౭,౧౮౫,౧౮౬ |
| ఎఱుకనుత్యజించిన పరిపూర్ణమును గ్రహింపుము. | ౧౮౩,౧౯౨,౧౯౮ |
| గురుబోధ. | ౧౮౪,౨౦౩,౧౫౩ |
| కుజనులకీబోధం దెల్పకుము. | ౧౯౯, ౨౪౧ |
| ఎఱుకను వదలిన యాతం డెట్లుండును. | ౧౯౩,౧౯౪,౧౯౫,౧౯౬, ౧౯౭, ౨౪౬ |
| బోధను మఱువకుము. | ౧౯౯ |
| మొదట వినదని చెప్పి పిదప పరిపూర్ణబోధ కావలయునను వారి విధము. | ౨౦౧ |
| పరిపూర్ణమును బోధించు గ్రంథములను వినుము చదువుము. | ౨౦౩, ౨౦౪, ౨౦౫ |
| దుష్టసంగతి వలదనుట. | ౨౧౪,౨౧౫,౨౧౯ |
| సద్గురులక్షణము. | ౨౧౮, ౨౨౬, ౨౭౦ |
| మంత్రములు, వాటిలక్షణము. | ౨౧౯, ౨౨౦, ౨౨౧ |
| గురుని కర్తవ్యమనుట. | ౨౨౩, ౨౨౪ |
| శిష్యుని దృష్టాంతము జూపుమనుట. | ౨౨౫ |
| ఎవరు గురువులుకారు. | ౨ ౬,౨౩౫ |
| గురుశుశ్రూషావిధము. | ౨౨౭,౨౨౮,౨౨౯,౨౩౦,౨౩౧,౨౩౨, ౨౩౭, ౨౩౮, ౨౩౯, ౨౪౦ |
| అహంకారులు సరియైన శిష్యులుకారనుట. | ౨౩౩, ౨౩౪, |
| గురునింద గూడదు. | ౨౩౬ |
| పరిపూర్ణబోధ యెక్కుడనుట. | ౨౪౨ |

| విషయములు. | కందార్థసంఖ్య. |
|---|---|

గురుశిష్యు లెట్లుండవలయుననుట. ౨౪౩, ౨౪౪, ౨౪౫, ౨౫౦, ౨౬౭
శిష్యుడు గురునకు దూరముగా నుండవలయుననుట. ౨౪౭, ౨౫౭
గురుశుశ్రూష జేయుము. ౨౪౯, ౨౫౮
పరిపూర్ణబోధయందు వింతలేవియు లేవనియుండువారి బ్రతుకు. ౨౫౦
తనవూరి సాధులపై భక్తి యుండనేరదు. ౨౫౨
పరిపూర్ణజ్ఞులకే ఈమర్మము దెలియును. ౨౫౪, ౨౫౫, ౨౬౮, ౨౭౧, ౩౦౧
నీవు నన్నాశ్రయించితివి గావున నేనీకీబోధ దెల్పితిని. ౨౫౦, ౨౬౬
౨౮౩, ౨౮౪
గురుశిష్యులు ఒకరినొకరు మరువకూడదు. ౨౫౯, ౨౬౨
ఇంకెవ్వరీబోధను నీకెఱిగింపరు. ౨౬౦
ఎటుక మార్గములు. ౨౬౧
పెద్దలను నిందజేయకుము. ౨౬౩
నీకు పెత్తనమువద్దు. ౨౬౪
గురుడు శిష్యుని కడుగకయే ఉపదేశము చేయును. ౨౬౭
దుర్జనునకు జ్ఞానము కలుగనేరదు. ౨౭౩
దుష్టులు నాగ్రంథమునందు తప్పులే వెదకుచుందురు. ౨౭౪
శిష్యుడు గురునితో యెటుక తొలగిపోయెనని జెప్పుట. ౨౭౬,
౨౭౮, ౨౭౯, ౨౯౫, ౨౯౬, ౨౯౭
మరల గురుడు బోధించుట. ౨౮౦, ౨౮౫, ౨౮౬, ౨౮౭, ౨౮౮, ౨౮౯
౨౯౦, ౨౯౧, ౨౯౨, ౨౯౩, ౨౯౪
నీవు నాకు సరియైనశిష్యుడు అని చెప్పుట. ౨౮౧
శిష్యుని ఎన్నెన్నో బాధలం బెట్టితినని గురుడుజెప్పుట. ౨౮౨
కృష్ణదాసులవారి నిశ్చయము. ౨౯౮
కృష్ణదాసుల వారి వంశవర్ణన. ౨౯౯
కృష్ణదాసులు దేశాటనము జేసితిననుట. ౩౦౦
ఫలశ్రుతి. ౩౦౨

విషయసూచిక సంపూర్ణము.



వేమనజ్ఞానమార్గ పద్యములు.—(3002) ఇందు నీతి, ఆచారము, ధర్మము, వేదాంతము, మొదలగు పలువిషయముల గురించి వేమనగారిచే రచియింపఁబడి మేలయిన దళసరికాగితముల యందు పెద్దఅక్షరములలోముద్రింపఁబడి సీమకాలికోగల మేలైనబైండు చేసియున్నది. ౨-౦-౦

వేమనయోగి విరచిత వేదాంత సిద్ధాంతము.— పద్యములును, తాత్పర్యమును కలది. ఇందు ౫౦౦ పద్యములు గలవు. వేదాంత తత్త్వమునంతయు విస్తరముగా దెలియఁజేయును. ౦-౧౪-౦

రాజయోగసారము వచనము. ౦-౨-౦

భగవద్గీత వచనము. ౦-౫-౦

తత్త్వార్థముక్తాకలాపంవచనము. ౦-౨-౦

దశవింశతితత్త్వకంఠార్థములు. ౦-౧-౦

అమృతబిందోపనిషత్తు.శ్లో.తా. ౦-౨-౦

వేదాంతపంచదశిటీకాతాత్పర్యం౫-౦-౦

దృగ్దృశ్యవివేకము. తా. ౦-౧౦-౦

ధృవచరిత్రము. ౦-౨-౦

కబీరుదాసు చరిత్రము. ౦-౪-౦

రామకృష్ణ పరమహంస దేవగారి దివ్యజీవిత వుపదేశ వాక్యములు.౦-౮-౦

సహజామనస్కానుభవబోధిని. ౦-౨-౦

సర్వాపదధ్వంసిని. ౦-౩-౦

వివేక సందర్భరత్నావళియును, జీవేశ్వర సంయోగ రహస్యము. ౧-౦-౦

కోడెల రామదాసుచరిత్రము. ౦-౪-౦

శ్రీపరిపూర్ణ బోధాచలకీర్తనలు - వచన కావ్యసహితము. ౦-౨-౦

శ్రీరామలింగేశ్వరశతకము. ౦-౨-౦

తారకామృతసారము. ౦-౪-౦

శ్రీజ్ఞానవాశిష్ఠము.వచనకావ్యం ౫-౦-౦

బ్రహ్మసూత్రములు, టీకా తా॥ ౨-౮-౦

అధ్యాత్మరామాయణమువచనం ౧-౮-౦

కాళిదాస కథామంజరి ద్వితీయభాగము ౦-౮-౦

ఆంధ్రనిఘంటుత్రయము ౦-౧౨-౦

కవిరాక్షసీయము. టీకా. తా. ౦-౮-౦

శ్రీమన్నారాయణధ్యానమంత్రం౦-౦-౬

సచ్చిదానందరామశతకము. ౦-౦-౬

కేరళప్రశ్న. ౦-౧-౬

మిక్కిలి ప్రియమైన వస్తువేదో వాటిని గూర్చి లెక్చరు. ౦-౨-౦

పాతంజలయోగశాస్త్రము:-- మూలసూత్రములు, తెనుఁగు తాత్పర్యవిశేషార్థములతో. ౧-౦-౦

శ్రీకాళికాంబికాస్తోత్రసంకీర్తనం.౦-౪-౦

కేదారేశ్వరనోముల వ్రత కథ. ౦-౦-౬

నాగభూషణ తత్త్వరహస్యములు ౦-౧-౦

కాళహస్తిమాహాత్మ్యం వచనం.౦-౪-౦

హఠయోగప్రదీపిక 128 యోగాసనపటములు గలవు. ౩-౮-౦

జీవతత్త్వప్రబోధకుసుమావళి.— తారక సాంఖ్య,అమనస్కభావములు ౩౬౪ పద్యములు. ౦-౩-౦

విశ్వకర్మప్రభావము. ౦-౨-౦

కాళీయమర్దనము, జంగంకథ. ౦-౨-౦

నారీశంకరోపాఖ్యానము. ౦-౨-౦

సిద్ధరామశతకము. ౦-౨-౦

ప్రజ్ఞాన బ్రహ్మబోధామృత తత్త్వ సంకీర్తనలు. ౦-౪-౦

పురాణోక్త కర్మప్రకాశిక ౧-౪-౦

పురాణోక్త అపరకర్మప్రకాశిక ౧-౪-౦

యాజుషశ్రౌత స్మార్తానుక్రమణిక నాలుగు భాగములుగలది. ౪-౦-౦

యాజుషాపరప్రయోగానుక్రమణిక సస్వరం ధర్మశాస్త్రసహితం.౨-౦-౦

నిర్ణయసింధువు ౨-౦-౦

మల్లమ్మదేవిచరిత్రముజంగంకథ.౦-౬-౦



శ్రీరస్తు.



# శ్రీ శుద్ధనిర్గుణతత్త్వ కందార్థములు.



## తాత్పర్య విశేషార్థము.

కందార్థం॥ జనులార జననమరణము । లనువొలఁగం ద్రో
యఁజాలు లక్షణయుతమై । వినువారికిఁ గనువారికిఁ । దనలా
వెలిఁగించు దీనిఁ దప్పకవింటే ♦ అప్పుడె వారలెప్పుడుగంటే ♦
గనుక వినబుద్ధయితే వినుఁడు చదివెదమీకె । కనుఁగొన మన
సైతే కనుఁడీపుస్తకమంత తప్పకవింటే ♦ అప్పుడె వారలెప్పు
డు గంటే । ౧॥

తా. ఓమనుష్యులారా; చావుపుట్టుకలనుండి విడిపించి, ఆత్మస్వరూపమును వెలిగించునదియు నైన, పై జెప్పబోయెడు నీగ్రంథాంశములను బాగుగా నెఱుఁగుడు. దీనిని చదువగలవారు చదువుడు. లేని యెడల నే జదివెదను. మీర లాలకింపుడు. దేనినైనను పూర్తిగా జేయుట మంచిదని తాత్పర్యము. ౧॥

కం॥ వినవలె కనవలె ననుచును । మనమందునఁ గోర్కె
గల్గు మనుజులె వినుఁడీ । వినఁజేసెద గనఁజేసెద । ఘనమగు
నీబోధ వినఁగఁగన రొల్లనట్టి ♦ వారు చనుఁడు తోఁచిన
త్రోవఁబట్టి ♦ తినుమంటె పులి వల్లదని లోకులన వింటి । గను
కనిది వినవలెనన నోరాడదు వినఁగ గన రొల్లనట్టి ♦ వారు
చనుఁడు తోఁచిన త్రోవబట్టి॥ ౨॥

తా. ఓమానవులారా; ఈ గ్రంథమును చదువ వలయునని కోరిక యున్నవారలే చదువుడు. వినవలయునన్న వాంఛ గలిగినవారే వినుడు. చదువను, వినను, యిష్టములేనివారు, యిష్టమువచ్చిన తెరు

వున నేగుదు. తినుమని యెంతవేడినను పులిభుజింపదను లోకోక్తి వినలేదా. ఇష్టము లేనివారి నెంతవేడినను వారికి యిష్టములేని పనిని చేయరు. కావున నేనట్టివారిని చదువుడని, వినుడని వేడను. ఇష్టమున్నయెడల వినవచ్చురు, చదువవచ్చును. లేనియెడల నూరక యుండవచ్చును. ౨॥

కం॥ నను మిము నే గని పుస్తక । మును జేసితి దీని మీరు
ముదమున వినుఁడీ । యనుటయు మిము నను మీరలు । గ
నుఁగొని వినుపించుమనుట కల యట్టిమాట ♦ బోధను మే
ల్కొఁగనలేదెచ్చోట ♦ ఘనులార యిటువంటి కలలో ముచ్చ
టలాడి । గనుగొని మీరుమేల్కొని మేల్కొల్పుఁడు నన్ను
కల యట్టిమాట ♦ బోధను మేల్కొఁగనలేదెచ్చోట॥ ౩॥

తా. ఓజనులారా; మిమ్ములను నేనుజూచి, నేనీ పుస్తకమును వ్రాసితిని; మీరు దానిని వినవలయునని వేడుటయు, మీరు నన్ను గాంచి మాకాపుస్తకమును వినిపింపుడనుటయు, నివన్నియు స్వప్నము. జాగ్రత్తతో జేరినవి కావు. జాగ్రతికు నీ ప్రపంచ జ్ఞానము లేదు. మనమీ స్వప్నములోనే అన్ని పనులు చేయుదుము. మీరు ఈ కల నుండి లేచి నన్నును లేపుడు. మనయింద్రియములకు గోచరమగు నీ వస్తుప్రపంచమంతయు మిథ్య అబద్ధము.

వి. అవస్థలు మూడువిధములు, సుషుప్తి, స్వప్నము జాగ్రత్త అని, ఇందు సుషుప్తి (నిద్ర) అవస్థయందు, బుద్ధియొక్క వ్యాపారమేమి యుండదు. స్వప్నావస్థయందు బుద్ధికి నబద్ధమునవి నిజముగా దోచును. (మిథ్యయైన ప్రపంచము నిత్యముగా తోచుచున్నది.) జాగ్రదావస్థయందు నిజము నిజముగా తెలియబడును. మిథ్యయైన ప్రపంచమును మనము సత్యమని దలచుచున్నాము గాన మనము స్వప్నమునందున్నాము. 3.

కం॥ ఒరులోరులు నేను నేనని । యొరులను దను నెన్న డెఱుఁ
గకున్న బయలులో । పరుదెంచి తన్నుఁ దాఁగని । పరులను గ
ని లెస్సయేను బరులని యనుచు ♦ నెఱిఁగెడు నెఱుక బయలుం
డఁ గనుచు ♦ నిరతము తానెందు నిలువ కుండుటకునె । విర

చించితి నెఱుక వినినదిల్లేదు నేను బరులని యనుము; నెఱిగెడు
నెఱుక బయలుండఁగనుచు॥ ౪॥

తా. తనకును నితరులకును భేదమునెంచని పరిపూర్ణమును, తనకును నితరులకును భేదముపాటించు నెఱుక తనకుగల వివేకముచేత నెఱింగి, తన యబద్ధతను తెలిసికొని వెఱుగె త్తిపోవునని తెలుపుటకొఱకై యీ గ్రంథమును జేసితినని భావము.

వి. ఎఱుకయనగా ప్రపంచసంబంధవివేకము. ఈ వివేకముచేతనే, పరిపూర్ణమును నెఱుగవలయును. పరిపూర్ణమనగా పరబ్రహ్మము. పరిపూర్ణమును దెలిసికొన్నపుడు, యెఱుకయొక్క యబద్ధము బైటపడును. ౪.

కం॥ శ్రీమించు నచలబోధను । నే మహాసియుంచు చేసి
యెగఁ జల్లెను సీ । భూమిన్ సుజనులకొఱకై । రాముండ
గు గురుని శివరామదీక్షితులన్ ; దలఁచి యప్పారావు గుణ
తతులన్ ; ప్రేమతో బాగడెదా భూమినిర్జర పరశు । రామ
సీతారామ స్వామికిమ్రొక్కి శివరామదీక్షితులన్ ; దలఁచి
యప్పారావు గుణతతులన్॥ ౫॥

తా. ఈలోకమునందు,సజ్జనులకొఱకై, యేమహాత్ముడు,యచల బోధను ప్రకటింపజేసెనో,అట్టిశివరామదీక్షితులను హృదయమునందు నర్చించి, అప్పారావులవారి సద్గుణములను బ్రస్తుతించి, పరశురామసీతారామస్వాములకు దండప్రణామంబు లాచరింతు నని భావము.౫.

కం॥ ఎఱుకినుగలలోపలనే । నరుదెంచితి మీరలటు లరు
దెంచితిరీ । యెఱుకనన నేనుమీరలు । నెఱుకతోఁడను వా
మనుచు నెఱుఁగెడికొఱకు ; గ్రంథముఁజేసితి నెఱిఁగియీవరకు;
గురుబోధంచు నుమీరు నరులారచేకొంటి । యెఱుకనుకలవోలి
నెఱిఁగినదిల్లేదం చెఱిఁగెడికొఱకు ; గ్రంథముఁజేసితి నెఱిఁగి
యీవరకు॥ ౬॥

తా. ఓజనులారా; ఎఱుకయనెడు స్వప్నమునందు మనమందరము జన్మించితిమి. ఈస్వప్నమునందే మృతిజెందువారము. పరిపూర్ణము యొక్కబోధ (జ్ఞానము) వలన యెఱుక యనెడు స్వప్నము నశిం

చును. దీనిని గురువుయొక్క నుపదేశముగా గ్రహింపుము. దానికే యీగ్రంథమును జేసితి నని భావము.

వి. ఎటుక ప్రపంచ సంబంధమై నవివేకము కావున యిది నిజముగాని జ్ఞానము నిజమైనదిగాదు. ౬.

కం॥ శ్రీమత్సీతారామ। స్వామి కృపంజెప్పనయ్యె సదస
ద్రహితం। బేమి పదార్థమొ దానిని। నీమహిం గందార్థములుగ
నిదివినరయ్యా ♦ యోజనులార యిటుగానరయ్యా ♦ వేమాటు
నేనిమ్ము వేడుటింతియు సుమ్మీ। నామీందకృపం జేసిననుజదువు
మని మీరలిదివినరయ్యా ♦ యోజనులార యిటుగానరయ్యా॥ ౭॥

తా. శ్రీమత్సీతారామస్వాములవారి కృపచే, సత్తును నసత్తునుగానిది యైన పరిపూర్ణముయొక్క బోధను, కందార్థములుగా వ్రాసితి. నాపై ప్రీతియుంచి నన్ను చదువుమని వినుడు. లేదా మీరలే చదువుకొనుడని తా.

వి. సత్తనగా నీశ్వరుడు. అసత్తనగా జీవుడు జీవేశ్వరుల రెంటికిని భిన్నమైనది పరిపూర్ణము. అదియే పరమాత్మ. ౭.

కం॥ శివరామదీక్షితులశి। ష్యవరుండప్పయ్యమంత్రి యతనిసిసువ్వుండే। భువిపరశురామవంశో। ద్భవు సీతారాము లతని
భక్తుండ సుమీ ♦ తదొప్పిధ్రయుక్తుండ సుమీ ♦ స్తవనీయులగుమీ రుత్సాహముతో సీక। థ వినుండు నేఁగందార్థములచే
వినుపింతు భక్తుడ సుమీ ♦ తదొప్పిధ్రయుక్తుండ సుమీ॥ ౮॥

తా. శివరామదీక్షితులవారిముఖ్యశిష్యుడుఅప్పయమంత్రి. అతనిశిష్యుడు పరశురామ వంశోద్భవుడునైన సీతారామస్వాములు. నేనువారిశిష్యుడను. అచలబోధను నెఱిగినవాడను. పూజ్యులగుమీరు నీకథను వినుడి. నేనుకందార్థరూపముగా నచలబోధను నెఱిగింతును.౮.

కం॥ మనసిచ్చి వినుడి యిటనొక। మనవిదినా పాలిగురుని
మదిలోపల నే। నునుచుకొని పద్దలాజ్ఞను। బనిబూనుక చేసితిటి
పరముల విన్నా ♦ దప్పొప్పు లేర్పండ దిద్దుడన్నా ♦ ఘనమతిమంతులు గనుక ప్రార్థించితి। నను మీకటాక్షేక్షణాల వీక్షింపు మంబదముల విన్నా ♦ దప్పొప్పు లేర్పడ దిద్దుండన్నా॥ ౯॥

తా. నాగురువును మనస్సున నెంచుకొని పెద్దలాజ్ఞచేతనేరచి యించిన నీకందార్థములయందలి తప్పొప్పుల నేర్పఱచి, తప్పులను దిద్దుదురని బుద్ధిమంతులను వేడుచున్నాను. నను శ్రీకేగంటిజాపుల జూచుచు నీ పద్యములను విను డని భావము. ౯.

కం॥ విని మీరిది దిద్దుండని। పనివడి ప్రార్థింపనేలపరుసము
నినుమే। ననుస్వర్ణముఁ జేయుచునునె। తనకై తానొను సన్నిధా
నమందుండే ♦ తెల్పుఁడీ యనుమానమిందుండే ♦ మనవిఁజే
యునేపాలిమ్మని వేఁగతల్లినిఁ। దనకై తానిచ్చును దయచేసి
తాసన్నిధానమందుండే ♦ తెల్పుఁడీ యనుమానమిందుండే॥౧౦॥

తా. మిమ్ములను నీగ్రంథమునందున్న తప్పులను దిద్దుడని నే వేడుట యనావశ్యకము. ఇనుముస్పర్శవేదికడకు బోయిన తరువాత తనుబంగారముగా మార్చుమని వేడవలయునా. స్పర్శవేదికిదగ్గరనున్న నే యినుముతనకుతానే బంగారమగుచున్నది. ఇందులోనేమైనను దోషమున్నయెడల తప్పక తెలియజేయుడు. గోవు తనదూడ తన్ను పాలిమ్మని యడగకయే, దగ్గరనున్నదూడకు పాలిచ్చుచున్నదిగదా. అట్లైనడుగకయే మీరలీ, గ్రంథమును చదువునప్పుడు తప్పులను దిద్దుదురని భావము. ౧౦.

కం॥ అప్పకవీయాద్యాంధ్రము। లొప్పగు మాఘాదు లే
నునోఁజదివి కృతిఁ। దప్పని కవులను సమముగఁ। దప్పులు
లేకుండఁజెప్పఁ దరమానెకృతిఁ ♦ ఊహానుజేసితి మఱినేనీకృ
తిఁ ♦ గొప్పపక్షులతోటి కొమునపక్షులు సాటి। యుప్పరవీ
ధినిఁగూటాడటుందుకుఁదరమా నెకృతిఁ ♦ ఊహానుజేసితిమఱి
నేనీకృతిఁ॥ ౧౧॥

తా. అప్పకవీయము మొదలగు నాంధ్రగ్రంథములను, మాఘము మొదలగు సంస్కృతికావ్యములను, బాగుగా చదివినకవులతో సరిగా కవిత్వముచెప్పుటకు నాకుశక్యమా, (కాదనిభావము.) ఈగ్రంథమును యూహాచేసి రచించితిని, ఆకాశమార్గమునందు నెగురుటకు, చిన్నపక్షులు పెద్దపక్షులతోసాటియగునా (కాదనిభావము) అట్లేనేను గొప్పకవులతో సాటికానని భావము. ౧౧.

కం॥ ఛందము తెలియఁగక పద్యము। లెందుకుఁ జేసెదవటంచు
నిలజనులన నే। సందేహింపక చేసితి । నిందునఁ దప్పున్న మీరర
విదిద్దెదరనుచు ♦ నేఁ జదివినఁ జెవియొగ్గివినుచు ♦ నందముగాఁ జి
త్తమందిట్లు తలపోసి । కందార్థములు మీముందర। బెట్టితి నివి
దిద్దెదరనుచు ♦ నేఁ జదివినఁ జెవియొగ్గివినుచు॥ ౧-౨॥

తా. నన్ను ఛంధశ్శాస్త్రమును చదువక నేల నీపద్య కావ్యమును రచియించెదవని యనేకులునా క్షేపించిరి. నేనును, దప్పులున్న యెడల మీరు దిద్దుదురనియు, చదివిన నాసక్తితో వింధురనియు, మనస్సున యెంచి, నీగ్రంధమును, భయము లేక రచించి మీముందఱనుంచితినని తా. ౧-౨.

కం॥ పునరుక్తిగలిగియుండిన । వినికోపము సేయవలదు వేఁ
డుకొనియెదఁ । వినువారలు దూరార్థముఁ । గనవలెదగ్గ ఱంటం
చుఁ గల్పించినాను ♦ తెలియక గాదీ గ్రంథములోను ♦ జననిజ
నకులు దాముతనయుల పునరుక్తి । వినగోరుదురుగ తెప్పించక నేన
ది తెలిసి కల్పించినాను ♦ తెలియకగాదీగ్రంథములోను॥ ౧౩॥

తా. ఈకందార్థములయందు, నొకమాఱు జెప్పినదే మరలమరల జెప్పియుండినయెడల, పునరుక్త (మరలజెప్పుట) దోషమనియెంచినా మీద కోపపడవలదు. తెలిసికొనుటకు కష్టమైన యంశములను. శీఘ్రముగా మీరు నెఱుగుటకొఱకె నట్లుజేసితిని. కావలయుననియే నట్లు జేసితిని గాని తెలియమిచేత గాదు. తమబిడ్డలు యనేకమార్లు చెప్పినదే చెప్పుచున్నను, తలిదండ్రులు సంతోషింతురుగాని కోపపడరు. అట్లె మీరును నామీద కోపపడవలదు. అని భావము. ౧౩.

కం॥ ఇదియాంధ్రకవిత్వంబని । మదికోయఁగఁదగదు దీని
మర్మమరయుఁడీ । పదియాఱువన్నె పసిఁడిని । ముదమునఁ
దోల్ పెట్టెనుంచముట్టకుందురురా ♦ లోకులు చేతఁ బట్టకుండు
దురా ♦ యిదిగాక కులహీనుఁడిచ్చిన ద్రవ్యము। విదితముగా నెం
తవేత్తలైనను దాసిముట్టకుండుదురా ♦ లోకులు చేతఁబట్టకుం
డుదురా॥ ౧౪॥

తా. ఇది తెనుగుగ్రంధమని దీనిని నగౌరవముగా జూడవలదు. ఇందలి సారమును బాగుగా గ్రహింపుము. మేలిబంగారమును దోలుపె

తా. గృహములయందు, కుక్క లుదూరి, కుండలనుబద్ద్రోసిన యెడల, కులభామినులు వాటిని జక్కపఱతురు. అట్లే సజ్జనులైనవారు, నామనస్సును బాగుగా నెఱిగి నాయందలితప్పులను దిద్దుదురని తా.

కం॥ తనగొప్పనెంచ రేమో। జనులనితలపోసిసాధు జనకృత కవితల్। విన రితరులువినం గోరిన। వినకన రా దనుచు మనసు విరుచుదుర్జనుండు♦వినిపించునుపేక్ష సజ్జనుండు♦ కనవచ్చు ముంజేతి కంకణాలకు నేక్ష। ఘనవిల్వటద్దముగావలెనా♦మనసు విరుచుదుర్జనుడు ♦ వినిపించునుపేక్ష సజ్జనుండు॥ ౧౮॥

తా. లోకులు తన్ను గొప్పవానిగా నెంచవలయునని, సాధువులురచియించిన గ్రంథములను చదువవలదని, దుర్జనుడైనవాడు బోధించును. సజ్జనుడు వినుడని వినిపించును. చేతనున్న కంకణములను చూచుకొనుటకు గొప్పనద్దము గావలయునా, అట్లే స్పష్టములయిన విషయములను దెలిసికొనుటకు గ్రంథములు కావలయునా యనిదుర్జనుడు జెప్పి యందఱను జెఱచును. సజ్జనుడు మంచి గ్రంథములను వినిపించునని భావము. ౧౮.

కం॥ ఆగామికథనునిట్లని। బాగుగవినిపింతుఁజెవులపండువుగాఁగ। న్నాగమనిగమోపనిష। త్సాగరమథితార్థమెల్ల సాంగోపాంగముగ♦ దయతోవినుఁడీ సాంగోపాంగముగ ♦ ప్రాగర్థచరమార్థ యోగములకుసం। యోగముగావించి నేనెఱిగినంత సాంగోపాంగముగ ♦ దయతోవినుఁడీ సాంగోపాంగముగ॥ ౧౯॥

తా. ఇక నీ గ్రంథమున చెప్పబోవు విషయమును ముందుగా నే మీకు దెలిపెదను. వేదములందుండు నుపనిషత్తులను మహాసముద్రము ను బాగుగాచిలుకుటచే (చదువుటచే) కలిగిన సారము [యనగా నాయనుభవమును] మీకు బాగుగా వినిపించెదను. జీవాత్మ పరమాత్మ రెండును గొక్కటేయను నిజమైన విషయమును నే నెఱిగినంతవఱకు మీకు జెప్పెదను. మీరు పెద్దబుద్ధితోసి వినుడని భావము. ౧౯.

కం॥ మోదముసఁ బ్రొద్దుపోకను। వాది ప్రతివాదులగుచు వరగురుబిష్యుల్। వాదించిరనుచునొకసం। వాదముఁ బన్నితి

డెను. ఓ శిష్యా నే జెప్పబోవు దానిని శ్రద్ధతో వినుము. నీ కింకమీఁదట ప్రపంచము మొదలగువాటిని గుఱించి, సందేహము లేమియు యుండవు సత్యమైనటువంటి పరిపూర్ణమనియు, అసత్యమైనట్టి యెఱుకయనియు రెండుగలవు. నీవు రెంటిని బాగుగా దెలిసికొని నబద్ధమైన యెఱుకను వదలి పెట్టుము. అవదలి పెట్టుట తోడనే, యెఱుకతో సంబంధించిన నీప్రపంచమును గుఱించిన దుఃఖములు నశించును ప్రపంచము మొదలగునవి నబద్ధమని నెఱుంగుదువు.

వి. దుఃఖములు మూడువిధములు, అవి యెట్లనఁగ అధ్యాత్మికము, అధిభౌతికము, అధిదైవికము, వీనిని తాపత్రయ మనియు నందురు; ఆత్మను ఆశ్రయించి యున్నట్టి స్థూల సూక్ష్మ శరీరాదికము వలన పుట్టిన దుఃఖము, అధ్యాత్మికము; ఉ॥ రోగము, క్షుధ, దప్పి మొ॥ జ్ఞానేంద్రియములకు విషయమైనవాటివల్లగలిగిన దుఃఖము. అధిభౌతికము. ఉ॥ చోరులు సర్పములు మొదలగు వాటివలన గలుగు దుఃఖము. జ్ఞానేంద్రియములకు విషయములుకాని వాటివలన గలిగిన దుఃఖము. అధిదైవికము. ఉ॥ పిశాచములు గ్రహములు మొదలగు వాటివలన గలుగుదుఃఖము. ౨౩॥

కం॥ ఏ సాధన సేయుటకును జేసిన నంటకదు వినుమా
యయ్యా। నే సాధులచే విన్నది। యేసాధన లేని బోధ నెఱిఁ
గి నిత్యు, బోకు ♦ సాధన లందు మఱిగితే రాదు♦ఏసాధనల జోలి
యే వద్దనినిల్చి బాగుచేసితి నేనుపరిపూర్ణభోధనే నెఱిఁగిం
చు బోకు ♦ సాధన లందు మఱిగితే రాదు॥ ౨౪॥

తా. ఓ శిష్యా; హఠయోగము మొదలగు అష్టాంగయోగాభ్యాసనలను వదలి పెట్టుము. వానివలన యుక్తయోగము లేదు నే సాధువులచే నుపదేశము పొందినవాఁడనై నీయుచితబోధను, నీకు నుపదేశించెదను. యోగాభ్యాసము చేయనని ప్రమాణము చేయుము.

వి. యమ నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనునవి. నష్టాంగ యోగములు. ఇవి శరీరదార్ఢ్యమునకు పనికివచ్చునేగాని బోధను తెలియ జేయదు. ౨౪.

కం॥ గురువరి పరిపూర్ణం బన। నెఱుకను నవి రెండు నెట్టు

లెఱు కుద్భవము౧ । దెఱుక చనుచోటు నెయ్యది । యెఱుకను
నేనెట్లు విడుతు నెఱిఁగింపు మనెను♦అంతనె గురుఁ డెఱిగింతు
ననెను♦చరణ ధూళిని రెండు కరములఁ గొని తన । శిరమున
ధరియించి శరణని యాశిష్యుఁ డెఱిగింపు మనెను♦ అంతనె
గురుఁడెఱిఁగింతు ననెను. ౨౫॥

తా. ఆశిష్యుఁడు గురుపాదములకు ప్రణమిల్లి యిట్లని యడిగెను. అయ్యా, పరిపూర్ణమనియు నెఱుక యనియు రెండు గలవనియు నందులో పరిపూర్ణము నిజమనియు ఎఱుక నబద్ధమనియు సెలవిచ్చితిరి. అట్టి లేని యెఱుకకు జన్మస్థాన మెద్ది. దానిని త్యజించు టెట్లు, దానిని తెలుపుడు. ౨౫.

కం॥ మొదలచలము నెఱిఁగించెద । విదితముగా లేనియె
ఱుక వివరింతుఁ బయిని । నదినెఱుకను విడిచె నదిన । మది
లో నామాట నమ్మి మఱి వింటివేని ♦ సంశయ బుద్ధి మానితి
వేని ♦ పదుగురు నినుఁజూచి బళిపెబాపురే యన । కెదురు
లేదను నట్లు నినుగో చేఁజేసెద మఱివింటివేని ♦ సంశయ
బుద్ధి మానితివేని॥ ౨౬॥

తా. శిష్యా ; నీకు మొదట నచలమైన [నిత్యమైన] పరిపూర్ణమును తెలియజేసెదను. పిమ్మట చలనమైన (అనిత్యమైన) లేని ఎఱుకను నెఱిగించెదను. కడపట నెఱుకయొక్క యబద్ధతను తెల్పెదను. నామాటను నమ్మి నడచుకొంటివేని, నిన్ను పదుగురు మెచ్చునట్లు జేసెద ననిభావము. ౨౬॥

కం॥ మీరెంత వారు గనుక నె । వ్వరితో మీపాద సేవ సిద్ధిం
చుటకై । లేరింప వారు జగమున । లేరని నామదికిఁ దోచెఁ
లెస్సగవినుఁడీ ♦ ఆజ్ఞను మీరు లేదు గనుఁగొనుఁడీ ♦ యేరీతి
వినుమంటె నారీతి వినియెద । మీరానతీ యుఁడు నామదిక
దోచెలెస్సగ వినుఁడీ ♦ ఆజ్ఞకు మీరలేదు గనుగొనుఁడీ॥ ౨౭॥

తా. అయ్యా ; మీరు మహాత్ములని తెలిసి గదా మీదగ్గరకు వచ్చితిని లోకములో మీకు సమానులు లేరని నేను నమ్మెదను. మీరా జ్ఞానతిచ్చిన నట్లు నడచెదను. నా కుపదేశము జేయుడు. ౨౭.

యబద్ధమైన తరువాత యెఱిగేవాడైన నీవు నిజమా. ఉండేదిన్ని యెఱిగేదిన్ని అబద్ధము. ౩౦.

కం॥ సురాజ్ఞ యిచ్చి యుంటిరి। నేరుపుతో బయలు నెఱుక
నెఱింగించి సయిరా। పేరణతు నెఱుకసని। యెట్లారీతిని నెఱు
గవలెను మయ్యా క్రమ్మొక్కెదను♦ అనుమానము చేయకయ్యె
డను♦ సారెకు మీపాద జలజయుగ్మము నాహృ। త్సార స
ముస నిల్పి సలుపుచు పూజనో యయ్యా క్రమ్మొక్కెదను. అను
మానము చేయకయ్యెడను॥ ౩౧॥

తా. ఓ; స్వామి, మొదట పరిపూర్ణమును, పిమ్మట యెఱుకను విశదముగా జెప్పి తరువాత యెఱుకను నాశము చేయుమని జెప్పితిరి. మీరు చెప్పిన ప్రకారము చేయుదును. నేను మిమ్ము నెప్పుడును భజించుచుందునని నమస్కారముగావించెనని. తా. ౩౧.

కం॥ పుట్టుట గిట్టుట లేకయుం। బుట్టను గిట్టను నెఱుకను పోడి
మెఱుంగక। చట్టువలెం గనల కుండును। బట్టబయల్ ఇట్టి
దటంచు భావింపం దగును♦ నెఱుక చేత సేవింపం దగును♦
వట్టిమాశల చేతం బట్టుపడకను గిట్టు దేశికు గోట్టి గట్టిగం ద
లుసుక భావింపం దగును♦ నెఱుక చేత సేవింపదగును॥ ౩౨॥

తా. జననమరణములు లేని పరిపూర్ణము చలనమేమియు లేక చట్టువలె స్థిరముగా నుండును. జననమరణములతో గూడినది యెఱుక, అట్టి యెఱుకచేతనే పరిపూర్ణమును నెఱుగవచ్చును. లేనిపోని యాశలను వదలిపెట్టి, గురుముఖముగా నుపదేశము జెందిన యెడల, నాయెఱుక యొక్క సాహాయ్యమువలననే పరిపూర్ణమును నెఱుగవచ్చును. ౩౨.

కం॥ ఎఱుకైన రీతినుండును। నెఱుక నవశ్యంబలంచు నె
న్నిన యెఱుకగా। ఎఱుగుదు ననిసను నెఱుకే। యెఱుగుటదు
ర్లభ మనుసుమ్మీ యీయుక్తి బయలు♦ ఎఱుగు నె యెఱుక
నెఱుకని బయలు♦ పెరుగదు విరుగదు మరుగదు తరుగదు
అఱుగదు కరుగదు చిఱుగదు మొరుగదు ఈయుక్తి బయలు♦
ఎఱుగు నెయెఱుక నెఱుకని బయలు॥ ౩౩॥

తా. శిష్యా; యెఱుక దాను అన్ని విషయములను నెఱుగుదునని

శబ్ద రూపక్రియావృత్తులను మించినది దానిని ఇట్టిద నిచెప్పుటకు వలవి కాక యున్నది. అది ఒకటేను దానికి రెండవది లేదు.

వి. మనుష్యునకు శత్రు రూపమైనదిగా అరిషడ్వర్గము. మనుజుని నివి ఆరు విధములైన సంకెళ్ళ వలె బంధించి యున్నవి అవియెవ్వియన కామము. క్రోధము లోభము, మోహము, మదము, మాత్సర్యము. ౩౫.

కం॥ దానము ధర్మము సగుణ । ధ్యానము ప్రతిమార్చ
నంబు జప తప తీర్థ । స్నానములు ముక్తిదము లని। మానవుం
డొనరించు బయలు మాటాడ దేమి ♦ ఎఱుకే లేదు మాటాడ
దేమి ♦ ఔను కాదనక నీవనక నేనన కొక్క । మేనైన
తాగాక మిగిలి మించి యున్నది మాటాలు దేమి ♦ యెఱుకే
లేదు మాటాడ దేమి॥ ౩౬॥

తా. శిష్యా మనుష్యులు దానము. [ఈవి] ధర్మము [న్యాయమార్గమున నడచు కొనుట.] ప్రతిమార్చనము. [విగ్రహముల, నారాధించుట.] జపము [దేవోపాసన జేయుట.] తపము [ఒక దేవుని గుఱించి, ఆహారాది నియమములతో తపస్సు జేయుట.] తీర్థస్నానములు [గంగాదినదులయందు, స్నానము జేయుట.] మొదలగు కార్యములను మోక్షము కొఱకు జేయుదురు. పరిపూర్ణమునకు యెఱుక [అనగా ప్రపంచ సంబంధమైన వివేకము] లేదుగావున, దానికి నేను నీవు అను, భేదబుద్ధి లేదు అదిసర్వత్ర వ్యాపించి యున్నది. దానికి స్థూల శరీరము మొదలగు శరీరములు లేవు. ౩౭.

కం॥ ఎంతెంతని యనరాదది యింతింతని చేయనిది యెన్నివిధ
ములగనిక । చింత తెలియగని దిబయ । ఎంతని నేవిన్న
వింతువింకబూడ వృథగాం ♦ తెలుపుట వినుట కవి పద్దకథగా ♦
సంతతి మొకరీతి సకల దేశముల యం । దంతట నిండి యున్న
దగా పరిపూర్ణము. ఇంకవిూద వృథగా ♦ తెలుపుట వినుటకది
పద్దకథగా॥ ౩౮॥

తా. పరిపూర్ణము ఈనాటి యని చెప్పుటకు వీలుకాదు. అది యెవరింతయుని నెఱుగదు. దానికి యేవిధమైన విచారమును లేదు. యెల్ల

చోట్లయందును నెల్ల కాలముల యందును నొకటే వి పరిపూర్ణమును వ్యాపించి యుండునట్టి పరిపూర్ణమును, నీ కెట్లు నొకటకు తనయాత్మ నని. తాత్పర్యము.

కం॥ ఆకాశాదిక భూతా । నీకాత్మక మగుచు నేదీ యీజగమయ్యె । రాకడ పోకడ గల్గదె । ప్రాకటముగదీని లోను బట్టబయలిదెరా ♦ కాదని యన్న వట్టిపల్కు దిరా ♦ లోక త్రయము తనలో పల దిరుగగ। జోకతో మత దానిజో లెఱుగ దిది యే మొబట్టబయలిదిరా ♦ కాదనియన్న వట్టిపల్కు దిరా॥ ౩౮॥

తా. శిష్యా, ఎఱుకవలన నెఱుగబడుచున్నజగత్తు పంచభూతములయొక్క వికారముగాను, ఎ. అప్పు, [జలము] పృథివి, (మన్ను) ఆకాశము, అగ్ని, వాయువు యివి పంచభూతములు. ఎఱుక వుత్పత్తి నాశములతో గూడుకొన్నది. ఆయెఱుక దేశ తెలియబడుచున్న పరిపూర్ణ మును జూడుము. అదియే సత్యమైన పరిపూర్ణము. ఇదియే నబద్ధమైన యెఱుక. ఎఱుకవల్ల దెలియబడు నీజగత్తంతయు పరిపూర్ణమునందే గనబడుచున్నది. పరిపూర్ణమునకు తేనో నెఱుకయొక్క సమాచారమే మియు దెలియదు. ౩౮.

కం॥ తెంతోప గింతములుగా । దంపే ఝుషాదికము లన్ని తనలోపలను । ద్దండెత నుండేనం బోయిన । నింపునసముద్రం బునెఱుంగ కుండు నెప్పటికి ♦ బరిపూర్ణమిట్లుండు నెప్పటికి యెండమావుల రీతినుండెను బ్రహ్మాండ। ముండెనం బోయిన తెంపు గురెఱుంగక యుండు నెప్పటికి ♦ బరిపూర్ణమిట్లుండు నెప్పటికి॥ ౩౯॥

తా. శిష్యా, మహాసముద్రమునకు నెటులైతే తనయందుమత్స్యాదిజలజంతువులు పుడియుండేది లేనిది దెలియదో యట్లు నీపరిపూర్ణమును మహాసముద్రమును తనయందు యెండమావులవలె నెఱుకను బోచు, బ్రహ్మాండముయొక్క యుత్పత్తి నాశములను నెఱుగదు. ౩౯.

కం॥ యెఱుకతో వచ్చిన విశ్వం । బెఱుకతో జనుగాని న్వౌవి బయలైతే । యెఱుకతో రావెఱుకతో బో । వెఱుకతో సందేహ లేదు, ఇది నిశ్చయముగా।ఉంచుండి యీయె

యలంచనరాని దెలుఁగు ♦ వెలుఁగ కాకాశమె పరిపూర్ణమును
చుకొం । దలు బల్కరిదివిని గుఱిదప్పి యుండేవు తనయా గు
రై లుఁగు ♦ గగనము బయలంచన రాని దెలుఁగు॥ ౪౨॥

తా. శిష్యా; ఆవులుకకు పృథవ్యాదిపంచభూతములే నాధారము. అదివాటితోనే జేయబడియున్నది. దాని గాలుసేతులు పృధివి వలన గలిగినది. దానినడుము అప్పువల్ల గలిగెను. హృదయము (గుండెకాయ) తేజస్సుచేత గలిగినది. కంఠము వాయువు వలన గలిగెను. శిరము నాకాశము వల్లనున్న గలిగెను. దీనినినీవు తెస్సగా నెలుఁగుము. కొందఱు పరిపూర్ణము పంచభూతములలో నొక్కటైన నాకాశమే యని జెప్పెదరుగాని నది వట్టిమాట, నిజముగాదు. అంతయు వ్యాపించియుండు పరిపూర్ణమును నొక్క నాకాశమని జెప్పుట తప్పుగదా. ౪౨.

కం॥ విత్తే చెట్టయిపుట్టును । విత్తేవిత్తనము రీతి నెలయును
ధరపై । విత్తునుఁ జెట్టుకు వేఱే । విత్తే మొకటున్న దనిన విన
గూడదోయీ ♦ తనకుఁదాఁబుట్టును వినవోయీ ♦ విత్తుచెట్టు
లరెంటికి విధమీ భూమెలుఁగ వి ట్టు తెబయలెఱుఁగదు సత్తుచి
త్తును రెంటికి విన ♦ గూడదోయీ ♦ తనకుఁదాఁ బుట్టును
వినవోయీ॥ ౪౩॥

తా. శిష్యా; ఒకచిన్న విత్తునుండి నొకగొప్పవృక్షముపుట్టును మరల నావృక్షమునుండియే యనేక విత్తులు కాయును. విత్తును. వృక్షమున్ను నొకదానికొకటి పరస్పరము కారణములుగా నుంటున్నవిగాని యీ రెంటికిన్ని కారణమయిన వస్తువు వేరేయింకొకటి లేదు. విత్తునకును వృక్షమునకును గల సంబంధము భూమి యెఱుగదుగదా, అదేప్రకారముగా పరిపూర్ణము నుసత్తుచిత్తులసంగతి నేమియు దెలియదు. ౪౩.

వి. చిత్తు అనగా జ్ఞానము సత్తు అనగా నిత్యమైనది.

కం॥ చెట్టే మూలము విత్తునుఁ జెట్టుకు మూలంబు విత్తు
క్షితిపై నెంచుక । బుట్టెసఁ జచ్చిన రెంటిని । గట్టిగఁ దా నెలు
గకుండు గదరాయీ నేల ♦ సమితిఁ గనునొన వేల ♦ పుట్టు
చు గిట్టుచు వాలుపోంచు తను వెలుఁగి । ఇట్టి విచిత్రము లెన్నఁడె
ఱుఁగదు బయలు గదరా ఈనేల ♦ సవిరితిఁగనుఁగొన వేల॥ ౪౪॥

తా. శిష్యా; విత్తునకు కారణము వృక్షము. వృక్షమునకు కారణమువిత్తు, భూమికి నివి యుండేదిలేనిది యనే సమాచార మేమియు తెలియదు. అదేవిధముగా పరిపూర్ణము జననమరణములతో గూడి నటువంటి యెఱుకనుగాని నీ జగత్తును గాని నెఱుగదు. ४४.

కం॥ కనుమూసినఁ గను దెఱచిన । కనుమఱుగింతై న లేక
కానంబడుచుండు। గనుఁగొనశక్యముగాకను। ననిశము నొకరీతి
నుండు నతడే నిర్గుణుఁడు♦వినికని వెతల నతఁడొందఁ డెపుడు♦
వెన్నెల లోపల వెలగ కాయలరీతి । నున్నవిశ్వము నెఱుకనె
న్నడు నెఱుగనియతడే నిర్గుణుడు ♦ వినికని వెతల నతడొందఁ
డెపుడు. ४५॥

తా. కన్నుమూసికొని యుండినను. లేక తెఱచుకొని యుండినను పరిపూర్ణము, స్పష్టముగా కనబడుచుండును. అటుల గనబడుచుండినను దానిని ఇట్టిదని చెప్పుటకు నసాధ్యముగా నుండును. వాఙ్మనసముల రెంటికిని గోచరముగానిదిగా నుండును. అట్టివానినే పరిపూర్ణమందురు. వాడేనిర్గుణుడు. అతని నీప్రపంచమును గుఱించి గాని లేక యెఱుకను గుఱించిగాని నేమియు దెలియదు. వెన్నెలయందు వెలగ కాయలుగనబడురీతి, వానినియందును జగత్తు మొదలగునవి దోచుచుండును. ४६.

కం॥ ఎఱుకే దేహేంద్రియములు । నెఱుకే వర్ణాశ్రమ
మును నెఱుకే శ్రుతులుండు ఎఱుకేనీవును నేనును । నెఱుకేసతి
సోదరాదు లెఱుఁగుము వత్సా♦ నేఁదీర్చెదనిదిగో సీయిచ్ఛా♦
హరిహరబ్రహ్మాది సుర । నరగిరినరి । త్తరుమృగ చరాచరము
లెఱుకయనియెఱుగుమువత్సా♦నేఁదీర్చెదనిదిగోసీయిచ్ఛా॥४౭॥

తా. బిడ్డా; మన దేహము, కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు.బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులనెడుచతుర్వర్ణములు. బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాసాశ్రమములు, వేదములు,స్మృతులు,యివన్నియు యెఱుకనేగాని వేరుగాదు. నీవు, నేను అనుటయు నెఱుకయే. భార్య, సోదరులు మొదలగువారును లెఱుకే త్రిమూర్తులును, కొండలు మొదలగు నచేతనములును, దేవతలును, మనుష్యులును,మృగము

లును యెఱుకే. నేను నీయభీష్టమును దీర్చెదను. ౪౬.

వి. వాక్పాణి పాదపాయూపస్థలను నయిదును కర్మేంద్రియములుత్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణేంద్రియములను నయిదును జ్ఞానేంద్రియములు.

కం॥ ఎఱుకే విద్యావిద్య। నెఱుకే ప్రణవంబు నాదమెఱు
కే కళయు । న్నెఱు కే బిందువు చిత్సు । త్తెఱుకెయానందమని
యు నెఱుఁగు సమబుద్ధి ♦ నీనామాట లెఱుకేనిబుద్ధి ♦ యెఱు
కే నిర్గుణ సగుణమెఱుకే యెఱుగున నిట్లు । లెఱుకను నిదియెం
త యెఱుఁగ జేసితి నీవిల్లెఱుగు సమబుద్ధి ♦ నీనామాట లెఱుకే
నిబద్ధి॥ ౪౭॥

తా. శిష్యా; విద్య, అవిద్య, ఓంకారరూపమైన ప్రణవము, నాదము, కళ, బిందువు, చిత్తు, ఇవన్నియు యెఱుకనేగాని వేఱుగాదు. ఆనందము ఇప్పుడు నీవు నేనుమాట్లాడు మాటలున్ను, సగుణనిర్గుణబ్రహ్మములయందలి భేదమున్ను ఎఱుక. యేఎఱుక తన్ను దానిట్లు దెలిసికొనును వీటిని నేను నీకు జెప్పుచున్నాను. నీవున్ను సరియైనబుద్ధితో నెఱుగుమని. తా. ౪౭.

వి. పరివిచారము చేయుటకు ముందటు నిజముగా దోచును, విచారముజేసిన వెనుక నబద్ధముగా దెలియబడునో అదియే అవిద్య.

కం॥ ఎఱుకే యిహపర సౌఖ్యము । లెఱుకే జ్ఞానంబు
జ్ఞేయ మెఱు కే మోక్షం । బెఱుకే భక్తి విరక్తులు । నెఱుకే
సంకల్ప మనియు నెఱుఁగు సత్కీర్తి ♦ ఎక్కడికారి యెఱుకే
సంపూర్తి ♦ యెఱుకే జీవుఁడీశుఁడెఱుకే త దేకాంతి । మెఱుకే
సర్వమునే గుర్తెఱిఁగి చెప్పితి నీకెఱుఁగు సత్కీర్తి ♦ యెకఱ-
డికారి యెఱుక సంపూర్తి॥ ౪౮॥

తా. ఈలోకమునందును, పరలోకమునందును, గలుగుసౌఖ్యములున్ను, ఎఱుకయొక్క వికారమే. జ్ఞానమున్ను, జ్ఞానసాధనమున్ను. ఎఱుకయే, మోక్షమనునదియు ఎఱుకయే. భక్తి, వైరాగ్యములున్ను నెఱుకయే. తుదకు సంకల్పముకూడ యెఱుకయే. పరిపూర్ణము నెఱుగకముందటు, ఎఱుకకు సంపూర్తి కలుగనేరదు, జీవేశ్వరులు, ప్రత్యేకము

గా నైనను కలిసియైనను ఎఱుక యొక్క వికారము లేను. నేను సర్వమును దెలిసినవాడనుగాన నీకు జెప్పుచున్నాను, నీవు దీనిని బాగుగా దెలిసి కొని యశస్సును జెందుము. ౪౮.

కం॥ చింతలతోఁటననెఱుకే। వింతలపుట్టిల్లనంగ వెలసిన
దెఱుకే। తంతుల పేటననెఱుకే। పంతములకు జూడ మూలబ
లమన్న దెఱుకే♦ జగజ్జాలస్థలమన్న దెఱుకే♦ భ్రాంతుల కెల్ల
ను పట్టణమనఁజెల్లి। కాంతల పురుషులఁ గలిగించుటకు మూ
లబలమన్న దెఱుకే♦ జగజ్జాలస్థలమన్న దెఱుకే॥ ౪౯॥

తా. శిష్యా; ఎఱుక ఎల్లదుఃఖములకున్ను పుట్టినిల్లు సమస్త ఆశ్చర్యములకున్ను తిరుగుచోటు తంత్రములకు నెల్ల కాపురము ఎల్ల పంతములకున్ను ఆధారము. ప్రపంచ సంబంధమైన వింతల కన్నిటికి జన్మస్థానమైన ఈజగత్తంతయు ఎఱుకయె. సర్వవిధములైన భ్రాంతులకును నివాసస్థానము. ప్రజాసృష్టికిని మూలకారణమైనదియు నెఱుకే.

కం॥ అన్నియుఁ దానై తనకవి। పన్నుగ వేఱనుచు నోటఁ
బలుకుచు మఱితా। నన్నిటి నెఱిఁగెడి యెఱుకై। యున్నానని
యెఱుక కెఱుకే యూహింపుచుండు♦ తనలోఁ దానె మాహింపు
చుండు నెన్నో విచిత్రాలీ యెఱుక సేతలువింటె। యున్నది లేదు
లేకున్నది కలదని యూహింపుచుండు♦ తనలోఁ దానె మా
హింపుచుండు॥ ౫౦॥

తా. సర్వమును తానుగా యుండగా, అన్నిటిని తనకంటె భిన్నమైనవిగా జెప్పుచుండును. మఱియు తాను అన్నిటిని ఎఱుగుటకు సమర్థమనియు ఎఱుక తనలోతాను నూహించుచుండును. తనమీదనే మోహ వికారము జెందియుండును ఉన్నది లేనట్లును, లేనిది ఉన్నట్లును యుండు నీయెఱుకయొక్క కార్యములు చూడగా, ఆశ్చర్యమగుచున్నది. ౫౦.

కం॥ వినుమూర్ణనాభి తాబు। ట్టినమీదట సృజనసేయు
దసము హరించుక ఘనమగు పట్టణకోట్లను। దనలోపలి దార
మును దానట్టిదనును♦ అట్లనె యెఱుక తాఁ బుట్టినను♦
పసిబూని బ్రహ్మాండ సంతతులను। క్షణములోపలఁ ద్రుంచి

కనరాక వేవేగం దాఁగుచుండును ♦ అట్లనె యెలుక తాఁబుట్టి
కనును ॥ ౫౧॥

తా. శిష్యా ; పాలెపురుగు ఎట్లుతే తాను తన దేహమునుండి
యే దారమునుదీసి, పెద్దపెద్దగూడులను అల్లి కడపట తాను ఊరుపే
రు లేక మాయమైపోవునో. అట్లే ఈ ఎలుకయు. బ్రహ్మనాశిమునందు
పుట్టి అనేకకోట్ల జీవరాసులను సృష్టించి, తాను మాయమైపోవును.
తాను దీనికన్నిటికి సాక్షిగానుండును. బ్రహ్మాండమంతయు సృజించి,
దానిని మరల నశింపజేసి మాయమైపోవును. ౫౧.

కం॥ తలిదండ్రులు జీవేశులు । నిలవ్యోమము లేను మేలునె
లుక మగుపులుఁ । కలమేల్కలు రుక్త్రాసం । బులునీరన్నము
లు ప్రకృతిపురుషుండాల్ మగండు ♦ గానై యెలుక కెలుకన
బడదు ♦ తెలిసిబయలున్న దని తెలిసిన తెలివిచేతనె దీనిదీసి
వేయును ప్రకృతి పురుషుండాల్ మగడుఁ గానై యెలు కనె
లు కనబడదు॥ ౫౨॥

తా. శిష్యా ; తల్లియు, తండ్రియు సత్తైయున ఈశ్వరుడును, అ
సత్తైయున జీవుడును, పృథివ్యాకాశములును, దారిద్ర్యమును, భాగ్య
మును, జ్ఞాపకమును, మరుపును, స్వప్నజాగ్రదావస్థలు, వెంటనుండు
ఆకలియు, నీరును, అన్నమును, ప్రకృతియు, పురుషుడును, జాయయు
పతియు ఇవన్నియు ఎలుకవల్ల గలిగినవి. ఎలుకను నరుడైన జ్ఞానమని
జెప్పుదు. ఇన్నివిధములైన రూపములలోనుండు ఈ యెలుక సాహా
య్యమునసే పరిపూర్ణమును బాగుగా గుర్తెఱుగుము. ఆ పరిపూర్ణ
మును దెలిసికొని బ్రహ్మజ్ఞాని అయిన వెంటనే ఈ ఎలుకను నశింప
జేయుమని తా. ౫౨.

కం॥ ఒక దేహధారితనువున । నకలావస్థలు జనించి చనిన
విధమున । న్నకలంకమైన బయలునఁ బ్రకాశమైలేని యెలుక
బయలుండఁజూచి ♦ తనముచ్చట పరికించి లేచి ♦ యొకకొంత నే
పైన నుండులకును లేక నకలము తన వెంటఁ జనుదేరఁ దనబట్టు
బయలుండఁజూచి ♦ తనముచ్చట పరికించి లేచి॥ ౫౩॥

తా. ఒకానొకనాడు, తద్రోగ నివారణముయిన వెంటనె రోగ

ములుయెట్లైతే తనకుతానెమాయమైపోవునో, అట్లెపరిపూర్ణజ్ఞాన మగలిగిన వెంటనే యెఱుక, కొంతసేపైనను నిలువక తన పరివారముతో మాయమై పోవుననె. తా. ౫౭.

కం॥ మెలకువ సుషుప్తిలోపల। నేలాగునఁ దనకుదానెయే
తెంచెనొగు। త్రాటిల బయలులోపల। వాలాయము తనకుఁదానె
వచ్చునోయన్నా ♦ వచ్చిపోచ్చి చచ్చునో యన్నా ఈలోపలనే
బట్టబయలున్న దెఱిగిఁతే। నేలోకమునవిల్వఁజాల దెఱుఁగకుం
డె వచ్చునోయన్నా ♦ వచ్చిపోచ్చి చచ్చునోయన్నా॥ ౫౮॥

తా. ఎటులనయితే ప్రాణికి నిద్రయందుకూడ అప్పుడప్పుడు మెలకువ కలుగుచుండునో అట్లె పరిపూర్ణము నందుకూడా, అప్పుడప్పుడు ఎఱుకయొక్క వాసన కనబడుచుండును యెఱుక తనకుతానే పెఱుగును; మరల నాశమును జెందును; మరల జన్మించును. అట్లు జనన మరణావస్థలకు నెల్లపుడును, లోబడియుండును, అయితె మరణము జెందుటకు ముందే దానిని గూల్చి పాఱదోలిన యెడల మరల జననము జెందదు. ౫౮.

కం॥ ఆటాడి యాడకుండును। ఆటాడిన మేనిబొమ్మ యా
టాడకనే। యాటాడు నెఱుక యనియెడి। యాటాడిం చేటి
వాఁడు అతఁడేకర్త ♦ అంతరికినియవలను కర్తా ♦ చేటుపాటులు
రెండుచే వచ్చుఫలములు। మాటికనుభవించిమరణ జననము
బొందనతఁడేర కర్తా ♦ అంతటికి నీ యచలముకర్తా॥ ౫౯॥

తా. శిష్యా; ఎఱుకయనుసూత్రధారి శరీరములనెడుబొమ్మలను ఆడించుచుండును పరిపూర్ణమందు సమస్తవస్తువులునుడుండుటచేత, పరిపూర్ణము కర్తగాదు. కర్తయును భోక్తయును రెండుగానిది పరిపూర్ణము. వృద్ధిక్షీణములు, జనన మరణములు మొదలగు నవస్థలతో గూడినది ఎఱుక. అదియె కర్తయు భోక్తయుగానున్నది. ౫౯.

కం॥ దేహమును జూచుకన్నులు। దేహమునకు బేరులేని
తీరున నెఱుకే। కోహంకర్తృత్వపదా। సోహంసోహం బటం
చుఁజూచుచుండు నుడు ♦ తనకుఁదానె దోఁచుచుండునుసు ♦ దేహి
దేహములు నీ తెఱగుసఁ బ్రసరించి। దేహముగాని విదేహి

గేది ♦ యెఱుక పుట్టువుపూవుల మెఱుఁగనిదీ యెఱుకే । యెఱు
కే దాఁ బుట్టినఁ దెఱుఁగ బోతె లేదం దెఱుక నెఱిఁగేది ♦ ఇంకొక
టిలేదీ రెంటి నెఱిఁగేది॥ ౫౮॥

తా. పరిపూర్ణమునకంటె యితరమైనవస్తు ప్రపంచమంతయు నెఱుక యని మనస్సునందు బాగుగా దెలిసికొనుము. ఎఱుక. పరిపూర్ణము నెఱుగుటకు సాధనము. తన్ను తా నెఱుగునదియు నెఱుకే పరిపూర్ణమునున్న, యెఱుక నున్న, యింకనేదియు నెఱుగజాలదు. ఎఱుకకు తనజన్మస్థానము దెలియదు. మఱియు, యెఱుక తన జననమును దెలిసికొను నప్పుడు, తనయొక్క యబద్ధతనుగూడా దెలిసికొనును. ౫౮.

కం॥ పాపములు పుణ్యములు భువిఁ । బ్రాపించును యెఱు
కచేత భ్రమసినవారికి । బ్రాపించు నెఱుక నెఱిసినఁ । [illegible]
ను [illegible]త్తమందు దగఁ దెలిసి కొనుమిా ♦ ఆగామిబోధను తెప్ప
వినుమిా పాపలలో శుద్ధస్ఫటికసన్నిభమైన । ఆపోజ్యోతిని ప్ర
త్యగాత్మని మదిలోనఁ దగ దెలిసికొనుమిా ♦ ఆగామిబోధను
తెప్పవినుము॥ ౫౯॥

తా. ఎఱుక నిజమను భ్రాంతిజెందియుండు వారికి పుణ్యపాపములు పొందుచుండును. ఎఱుకనుండి విముక్తులైన తపోధనులను పాపపుణ్యము లేవియు నాశ్రయించవు. దీనిని బాగుగా దెలిసికొనుము. నా బోధ్ర జననమరణములనుగుఱించి పండితులవలన నెఱుగుము. కంటిపాపల నడుమ స్వచ్ఛమైన స్ఫటికమువలె ప్రకాశించుచుండునది యైన ఆపోజ్యోతిని జీవాత్మనుగా నెఱుగుము. ౫౯.

కం॥ ఎఱుకన్నను మఱుపన్నను । నెఱుకకు నెఱుకన్న
దేహియన మాయయనఁగ గుణతు గను సాక్షియనఁగ । స్ఫు
రణయనం ద్రష్ట యనఁగ నూహ మొక్కటిగా ♦ యిది లేకుం
డు మూడు మొక్కటిగా ♦ మఱి చరాచరములు మన్మ మొకటిఁగ
నెన్న । మొకటిఁగి [illegible], మొకటిఁగి పోయెడి దన్న మూడు
మొక్కటిగా ♦ యిది లేకుండు మూడు మొక్కటిగా॥ [illegible]॥

తా. ఎఱుక, యెఱుకయుమఱుపు, దేహి (దేహమునుధరించు

నది) మాయ, సాక్షి స్ఫురణ (స్ఫురించునది అనగా వస్తుశాస్త్రజ్ఞాన
ము,) ద్రష్ట (చూచువాడు, స్వయంజ్యోతి (తనంతటదానే ప్రకాశిం
చునది.) అను పేళ్లచే దెలియబడుచున్నది. ఇవియంతయు ఎఱుకకుపర్యా
య పదములుగా నెఱుకచేతనే దెలిసికొనుము. చలములయొక్క (అన
గా నిత్యముకాని వాటియొక్క (లేక యెఱుకయొక్క నబద్ధతను; అచ
లము యొక్క [అనగా నిత్యమైనదానియొక్క] లేకపరిపూర్ణముయొ
క్క సత్యతను, దెలిసికొన్న వెంటనే, ఎఱుక తాను మిథ్యయని దెలిసి
కొని మాయమైపోవును. కావున నా యెఱుకవలననే నివియంతయు దె
లియబడును. ఇంక దేనిచేతను దెలియబడవు. ౬౦.

కం॥ అనుమానము మదనుంచక। వినుముంకను నెఱుక పే
రు వివరించెద బుద్ధ్యనచిత్తంబను మానస। మనిన నహంకా
రమనిన నంతఃకరణంబ♦సంకల్పమంచని యిచ్ఛయనినన్♦తా
ను నితరులని తానుర్తించెడి దన్న। తనుగని యితరులదాను
తెలిసెడి దన్న నంతఃకరణనన్♦ సంకల్పమంచని యిచ్ఛయ
నినన్॥ ౬౧॥

తా. శిష్యా; ఇంక నీవు నెఱుకకా పేరులెన్నున్నవని గ్లానోవిన
నించెదను. దానియొక్క వ్యుత్పత్త్యర్థము జెప్పి నీసంశయముల బాపెద
ను. బుద్ధి, చిత్తము, మనస్సు అహంకారము, అంతఃకరణము, సంకల్ప
ము, యిచ్ఛ మొదలగు పేళ్లన్నియు నెఱుకకే పేర్లు. ఇతరులకంటె త
న్ను వేరుగా దెలిసికొనునదియే యెఱుకయనబడును.

వి॥ బుద్ధి, మనస్సు. చిత్తము, అహంకారమను నీనాల్గును జేరియం
తః కరణమగును. మనస్సు, విషయములను దెలిసికొనును. చిత్తము
దానియొక్క యుక్తాయుక్తతలను బరిశీలించును. బుద్ధి విషయముల
న్నిటిని నాబోవుకార్యముల కొఱకు. మంచి పోకుండునట్లుజేర్చిపెట్టు
ను. అహంకారము, ఈవిషయములను నేనుచేయుచున్నాను. వీటికినేనె
కర్తయని యహంభావమును వహించును. ఈనాల్గునుజేరి యంతఃకర
ణమగును. ఇచ్ఛయనగా నొకవస్తువుపై నాశించుట, ఆవస్తువున పొం
దవలయునని ప్రయత్నించుట సంకల్పము. ౬౧.

కం॥ విను మితరులు నెఱుకనుసా । క్షనిపలికెరి నేనుసాక్షి సహామనినీతో । వినునట్లు చెప్పియదివే । అనఁగూడదు రెండు నొకటే యని తెలుసుకోరా ? మాటలభేదమని కనుకోరా ♦ అనరాని వినరాని కనరాని బయలందు ♦ తనకై తా నరుదెంచి తనకై తాఁ జనునొకటేయని తెలుసుకోరా ♦ మాటలభేదమని కనుకోరా॥ ౬ ౨॥

తా. జనులందరు నెఱుకనుసాక్షియని జెప్పుచున్నారు. నేనునీతో సాక్షి అహమని చెప్పితిని. జనోక్తియు, నేజెప్పినదియు విరుద్ధార్థకములని యెంచకుము. అహమన్నను నెఱుకయన్నను నొక్కటే, అవిభిన్నములు గావు. వినుటకును, కనుటకును నలవిగానిదియు, వాఙ్మనస గోచరాతీతమయినదియునైన పరిపూర్ణమను మహాసముద్రమునందు యెఱుక జననమరణావస్థల నొందుచుండును. అహమునకును నెఱుకకును శబ్దభేదమొకటున్నదక్క నర్థభేదమేమియు లేదు. ౬ ౨.

కం॥ వర్ణయుతమైదొరకపోటను । బర్ణగ కలసినది హృదయ పద్మంబనుచు । న్నెన్నెదరుజనులెరుకనం । దున్న దనుచు శ్రుతులు పలుకుచున్నవి సుమ్మీ ♦ తెలియుట మోక్షమన్నవి సుమ్మీ ♦ వర్ణలన్నియు మీఁదయున్న వస్తుప్రజాడ । నెన్నదెలుంగక యన్నోరీతులఁ బలుకుచున్నవి సుమ్మీ ♦ తెలుసుట మోక్షమన్నవి సుమ్మీ॥ ౬౩॥

తా. హృదయపద్మము పంచవర్ణములచే నొప్పునట్లు జనులు చెప్పుదురు. శ్రుతులును నాహృదయపద్మమునే నెఱుకకు వాసస్థానముగా జెప్పుచున్నవి. ఆశ్రుతులే, హృదయపద్మమును దెలిసికొనుట మోక్షమనియు దెలుపుచున్నది. ఇట్టివర్ణములతో గూడినదియని జెప్పుటకు నలవికాని నిశ్చలమైనపరిపూర్ణమును దెలిసికొనక, శ్రుతులుపిచ్చిపిచ్చిగా చెప్పుచుండును. ౬ ౩.

కం॥ మెలకగమునక క్తి నొక్కటి । తెలియదపినునందియమును లుదీఱును దీనం । బలుకున గలిగిన యర్థము । పలుకును విడనాడి నిల్వఁబడుచోటెంకేది ♦ ఎంతును నొక్కపలుకేయైనది ♦ తెలియుమీలాగునఁ దెలివి దేహములయ్యె । తెలివే తనువును

బాసి తెలివేస్థిరముగ నిల్వఁబడు చోటెంకేది ♦ రెండును నొక్క
పలుకేయొకది॥ ౬౪॥

తా. శిష్యా, నీకు నేనిప్పుడు ముక్తినిపొందుటకు సత్యాంతసుల భమైన మార్గమును నుపదేశించెదను. శబ్దార్థము శబ్దమును విడిచి యెక్కడికి. పోవనగును. శబ్దార్థము శబ్దముతోగూడనేయుండును. శబ్దముయొక్క నాధారము లేక శబ్దార్థము నుండజాలదు. అట్లె తెలివియు దేహముయొక్క నాధారము లేక నుండజాలదు. ఎటులయితె శబ్దమును తదర్థమును జేరి నొక శబ్దమేయగుచున్నదో యట్లెదేహమున్ను తదాశ్రయంబు తెలివియు రెండును జేరి నొక్క శరీరమే యగును. ౬౪.

కం॥ ఎరుకై పంచభూతములనీ । వెఱుఁగుమాకసముగాడ్పువిం గలమునునీ। ల్లరుసై కనేలయునే । నెఱిఁగ పద్ధతిన నీకు నెఱిఁగిం చినను ♦ ముజ్జగములయ్యెను వీట్లోను ♦ పరిపూర్ణమందుఁ గప్పుకుతమకుఁదామే । మంకౌన రాసటి మార్గముగలవీటినెఱిఁ గించినాను ♦ ముజ్జగములయ్యెను వీట్లోను॥ ౬౫॥

తా. పంచభూత వికారమగు నెఱుకను బాగుగా తెలిసికొనుము. పృథివ్యాది భూతముల వలన నెఱుక కలిగినదని నీకుముందటనే జెప్పియున్నాను. ఈపంచభూతములవలననే ముల్లోకమును సంభవిల్లెను, పరిపూర్ణమునందు నప్పుడప్పుడు భవనాశముల జెందుచుండు నెఱుకయొక్క న్యాయములను నీకు తెలియ జెప్పితిని. ౬౫.

సీ॥ ఎఱుకన్న తిరిఁ దెలియుఁగ । పరసిజ గర్భాదులైన దేవా లనినెడపో । గుఁ జెలిసినాఁడువాఁడెని । యెఱుఁగుమనవట మాటలివిఁవింతిగాక ♦ తెన్నమువానికిఁక రాకపోక ♦ అరిమరి లేక సద్గురుమూర్తి చరణ పం । కరుహద్వయాశ్రిన నెఱుగ నిన రుమాట లివి వింతిగాక ♦ తిప్పుము వానికిఁక రాకపోక॥ ౬౬॥

తా. ఎఱుక యొక్క జన్మస్థాన మిదియని జెప్ప చతుర్ముఖునకే సలవిగాదన, సామాన్య మనుష్యకోటికి నశక్యమని జెప్పవలయునా, ఏమనుజుడే సను తనకు నెఱుకయొక్క పుట్టుకను గురించి తెలియునని జెప్పినయెడ నీవువానిని నబద్ధకునిగా నెఱిగి,నిరాకరింపుము. అట్టివాడు జననమరణావస్థలనుండి విముక్తుడుగానేరడు. మనుజమాత్రుడు నెఱుక

యొక్క వుత్పత్తి దెలియదుననుట, విశ్వాసానర్హమేగాక పరిహాసాస్పదముగకూడ నున్నది. గురు చరణారవిందములయందు నెల్లసంశయములను విడిచి, భక్తియు, నమ్మికయునుయుంచి, గురుముఖముగ నుపదేశముపొందిననేగాని చావుపుట్టుకలనుండి విడుదల జెందనేరడు. ౬౬.

కం॥ లేనెఱుకబయలపోపలఁ । దానెట్లుజనించెననినఁదగవి
నువంధ్యా । సూనునిగతి వియబ్జవి । ధానంబున యక్షరాజధా
నివిధమునన్ రజ్జువు సర్పమయిన విధమునన్ ♦ స్థాణువు పురుషు
నిచందాన మృగతృష్ణలో నీరువిధము స్వప్నానందముగ రాజ
ధానివిధమునన్ ♦ రజ్జువు సర్పమయిన విధమునన్॥ ౬౭॥

తా. శిష్యా. అసత్యమునుఅనిత్యమునునయిన ఎఱుక కేవలనిత్యస్వరూపమగు పరిపూర్ణమునందు నేలాగుగలుగునను సంశయము నీమనంబున బాడమవచ్చును. అయ్యాక్షేపంబునకు నేనును సమాధానంబు జెప్పెద నాలకింపుము. లేనివస్తువు యెట్లు జన్మించునని నీవు నడుగవచ్చును, వంధ్యాపుత్రుడనియు, ఆకాశకుసుమమనియు, యక్షరాజధానియనియు, వస్తువులులేకయే నాపేర్లు వాడబడుచుండుట లేదా! ఇంతేగాక త్రాడనిన సర్పమనియు స్థాణువును [కొయ్య] పురుషుడనియు, నీరు లేనిబట్టను కొలననియు భ్రాంతిపడుటయు లేదా? అదేవిధముగా నిజముగాని యెఱుక పరిపూర్ణమునందు భ్రాంతిచేతనో మెఱుచున్నది. ౬౭.

కం॥ లేనెఱుక యెఱుకయనియును । లే నెఱుకెట్లాయెననిన
తెల్పగవినుమా। లేనిమృగతృష్ణవంధ్యా । సూనులుగలిగుండి
వెదకి చూడలేనట్లు ♦ ఈలేనెఱుక యేడలేదట్లు ♦ స్థాణువు
పురుషుఁడు శశివిషాణము గగన । సూనము నరుని స్వప్నానం
దమిఁక వెదకిచూడ లేనట్లు ♦ ఈలేనెఱుక యేడలేదట్లు॥ ౬౮॥

తా. అబద్ధమయినవస్తువేలాగుజననమందెను లేనివస్తువుయొక్క ప్రచారమేలాగు గలిగెను అని యడిగితివేని నేజెప్పెదవినుము ఎటులనైతె గొడ్రాలికిబిడ్డలేనిదే గొడ్రాలిబిడ్డయనియు, ఉదకములేకయే మృగతృష్ణ మృగములదప్పిదీర్పుఁదియనియు, కొయ్యయందు పురుషుడు లేనిదే స్థాణుపురుషుడనియు, కుందేటికి కొమ్ములులేకయే కుందేటి కొమ్మనియు, వ్యోమమునందు పద్మములేకయే వ్యోమాబ్జమనియు పే

ర్లువచ్చి యుండ లేదా. ఇవియన్నియు నెట్లు నబద్ధములయ్యె పరిభాష యందు నున్నవో అట్లె ఎఱుక లేనిదయ్యెను. పరిపూర్ణము నందు దోచుచున్నది. స్వప్నము నందలి యానందము నేలాగునన్నై తేనిజము యినదిగాదో, అట్లె ఎఱుకయు నిజముగాదు. ౬౮.

క౦॥ ఎఱుక యునదియు మెట్లున్నను। పరిశించబగు నారికేళ స
లిలముభంగిన్ । ఎఱుకెట్లుపోవునన్నను । గరిబ్రమింగిన వెలగ
పండు కరణిగ నెఱుంగు ♦ తిరిగిరాని కరణియు నెఱుంగు ♦ పరిపూర్ణ
మున్నది యెఱుక తానెట్లెంగితే । ఎఱుకే బ్రమ్గను భస్మా
సురుని బ్రమ్గిన నారికేళ కరణిగ నెఱుగు ♦ తిరిగిరాని కరణియు
నెఱుగు॥ ౬౯॥

తా. ఎఱుకయొక్క జనన మేలాగునని యడిగెదవేని చెప్పెదను వినుము టెంకాయలో జలము యేలాగుపుట్టెనో, అలాగు పరిపూర్ణము నందె ఎఱుక పుట్టును. ఏలాగు టెంకాయలో జలముపుట్టు విధము దెలియనశక్యమో అట్లే యెఱుకయొక్క వుత్పత్తి నెఱుగుటసాధ్యము, ఎఱుక నశించువిధ మెట్టులనిన, గజముచే మ్రింగబడిన వెలగకాయలోని గుజ్జు జీర్ణమైపోవునట్లు నశించును. ఎటులయెఱుకకు మూల ఉత్పత్తిగలుగదని యడిగితివేని జెప్పెదవినుము. పరిపూర్ణముయొక్క యదార్థతను దెలిసికొన్న యెఱుక భస్మాసురుభంగి భస్మమైపోవును. మరలనా యెఱుకకు భవనాశములు గల్గవు. ౬౯.

క౦॥ సంతోషానందోషము లంతానెగనచ్చిపివసి నరుగనె
చూడకో। వింతలుయున్నన్ వాదివిసె। యింతేను మ్మెఱుకపుట్టు
విక తెలుసుకొని ♦ సంశయమేల యునది నమ్ముకొని ♦ యెంతని తె
లుపుదు నిదేనమార్గము । సంతోట బహుళ వన్నెలాగునడి యగు
పరిదిక తెలుసుకోని ♦ సంశయమేల యిది నమ్ముకొని॥ ౭౦॥

తా. సుఖదుఃఖములుగా, శోకములని యనుభవమునను వచ్చి మరలలో పోవుచున్నవి. అవిపోవు వోకపోయ్యెనో తెలియునా, ఇది యెఱుక యాశ్చర్యముగాదా, అట్లె ఎఱుక పుట్టునదియును దెలియుట కసాధ్యము, కావున సంశయమంతయున్నియు నిగాని వొక్క పరిపూర్ణమేనిజమని నమ్ముము. ఒకస్వప్నము వర్ణములన్నియు నగిపడుచు, మఱియుకవేళనేనియు

పూర్ణమందుఁ దా నెఱిగే దెట్లొక గుర్తుతను వనదగును ♦ అ
చలమును గని తానేననుచు. ౨౩.

తా. శిష్యా పరిపూర్ణమునందు, యెఱుక తనకుదానే కలుగు
ను. అట్లు నవరంధ్రములతోఁగూడిన దేహరూపమెత్తి సుఖదుఃఖముల
కు పాత్రమగుచుండును. పరిపూర్ణమును దెలిసికొన్న వెనుక తనకుదానే
నశించిపోవును, పరిపూర్ణము నెఱుగుటయే నెఱుకనశించుటకు గుర్తు.

కం॥ తొలుకరి మెఱుపుల కైవడి । పొలుపగు నీళ్ళందుఁ
దోఁచు బుగ్గలరీతి । న్నలసూర్యకిరణ మందునఁ । గలనీలము
వలెను నెఱుక గనుపించు నయ్యా ♦ అంతలో నెచటఁ గనుపిం
చదయ్యా ♦ కలకాలమొకరీతిఁ గలి గుండదీ యెఱుక । తిలకిం
పఁబగలు రాతిరి దిరుగు విధమున గనుపించు నయ్యా ♦ అం
తలో నెచట గనుపించదయ్యా॥ ౨౪॥

తా. శిష్యా : తొలకరి మెఱుపుదీగయు, నీటియందలి బుడగ
లును, సూర్యకిరణములయందు గాన్పించునీలచ్ఛాయయు, నివన్నియు
నెట్లుగలిగి, తత్క్షణమే నాశము నొందుచున్నవో, నట్లే యెఱుకయు జనన
మరణములు పొందుచుండును, ఎఱుక పరిపూర్ణమువలె నెల్లప్పుడును
నొకటేవిధముగా నుండదు, రాత్రిపగళ్ళవలె నొకప్పుడునుండియు మ
ఱియొకప్పుడు లేకయు నుండును. ౨౪.

కం॥ కట్టెయలోనిప్పులేకను । గట్టిగా నొక సమయమం
దుఁ గనుపడి బహుగా । మిట్టిపడు తుదను గనుపడ । దట్టి
దె సుమి యెఱుక పుట్టు వలనువిచార ♦ తనకుఁ దానే పుట్టిన
దౌర ♦ పుట్టు గిట్టుట లను నట్టేట నిలుచుండి । బట్ట బయలు
నాడి గట్టినఁ గనుపడ ♦ దమలవిచార ♦ తనకుఁదానే పుట్టిన
దౌర॥ ౨౫॥

తా. ఒసరమ్మల విచారా; కట్టెయందు నిప్పు లేదు. మఱలనొకట్టె
మఱియొక కట్టెతో నొరయుటచేత నగ్ని గలుగుచున్నది. ఆ యగ్ని
యు గొంతనడి నుండి చల్లారిపోవుచున్నది. అటులనే పరిపూర్ణమందు
నేమో ఎఱుక నిజముగా లేదు. ఎఱుక తనకు దానే నుద్భవించుచున్న
ది. మరల కొంతకాలముండి తనకుదానే నశించుచున్నది. ఎటులనైతే

నిజముగా నిప్పు కట్టెయందులేదో, అట్లె యెఱుకయు పరిపూర్ణము నందు లేదని తెలిసికొనుము. జననమరణాద్యవస్థలతో గూడిన యెఱుక యను మహాసముద్రమున నిలుచుండి పరిపూర్ణమును గనినచో, నా సముద్రము నింకిపోవునని భావము. ౭౫.

కం॥ తనమూలము తలిదండ్రులు। తన వలెనే వారివారి తలిదండ్రులకున్। దనవలెన గాని యన్యము। గన జనన స్థానమొకటి గల దనం దరమా॥ బ్రహ్మాదుల కది తెలియం దరమా॥ వినుమీ బ్రహ్మాండ జననము నీనాయం। దును నై దిదియుంగాదని యింకొకటి వేఱె గలదని తరమా॥ బ్రహ్మాదుల కది తెలియం దరమా॥ ౭౬॥

తా. శిష్యా; జన్మస్థానము నీ దలిదండ్రులు. వారికి వారి దలిదండ్రులు, అని ఈప్రకారముగా జెప్పుచుండవచ్చునుగాని, నందుకును నొకవేరే జన్మస్థానమున్నదని జెప్పుట తగునా, (తగదనుట) ఈ బ్రహ్మాండమునకు సృష్టికర్తలు మనమేగాని యింకేదియుగాదు. బ్రహ్మాదులైనను నీసుట్టును దెలియలేరు. ౭౬.

కం॥ కనరాని దానిశూన్యం। బనియనందగు గాని బయలు ననందగదు సుమీ। కనవచ్చుచున్నదిదిగో। గనుగొనలేడ య్యెనెఱుక కనుంగొనరాదా॥ యెఱుకను శూన్య మనియనరాదా కనవచ్చునా లేదా గనుంగొంటివేదాని। యనరాద భయమేమి యనుమానించకు మిదిగో గనుంగొన రాదా॥ యెఱుకను శూన్యమని యనరాదా॥ ౭౭॥

తా. దేనియొక్క పుట్టుకను దెలియుట యసాధ్యమో, యెది యెప్పుడుండియు, మఱియొకప్పుడు లేకయునుండునో అట్టి యెఱుకను అబద్ధమని జెప్పవచ్చునుగాని, యెల్లప్పుడును గనుపించుచుండు పరిపూర్ణము నట్లు జెప్పుటతగదు. పరిపూర్ణమును నీవు కనుగొంటివికదా, కాన సందేహములెల్ల సదలి, పరిపూర్ణమును నిత్యముగాను యెఱుకను శూన్యముగాను నెఱుగుము. ౭౭.

కం॥ ఎఱుక బయలందు మిని। నెఱుకను శూన్యం బటంచు నెఱింగించబడెన్। ఎఱుంగు మిద యూంకనమి। ఔ

తెలిసితె యెఱుక కాకసంబు లేక మాఁగదరా ♦ ఆకసము బ
యలు నేకమె ల్గొరా♦పరిపూర్ణ మిదిగో గన్పడు శూన్యమన
రాదు ♦ ఎఱుఁగుము మెది లింప నీకనా చెయి చూచేవు,
ఏకమాఁగదరా ♦ ఆకసము బయలు నేక మెల్గొరా॥ ౭౭॥

తా. పరిపూర్ణమునందు నెఱుక లేనందున, యెఱుక నిజముగా
దని చెప్పబడినది. ఎఱుకను నాకాశముగా దెలిసికొనుము, రెంటికిని
భేదము లేదు. ఎఱుకయు శూన్యముగా దెలిసికొనుము. స్పష్టముగా దె
లియ బడుచుండెడి పరిపూర్ణమును మిథ్యయనరాదు. కావున దానిని
నాకాశమనియు చెప్పరాదు. అట్లు చెప్పుట తప్పని యెఱుగుము.

వి. ఆకాశమనగా శబ్దము. ౭౭.

కం॥ కనఁబడెడు బయలులోపలఁ గనుఁగొన లేదయ్యె నె
ఱుక గావున శూన్యం । బనవలసె దీని నాకస । మనవలసెను
దీనివిశ్వ మాయెనో యప్పా ♦ యింతకువేఁ మాయలేదప్పా♦
కనుకనె యీవిశ్వ మొనని లేదని లెన్ప । వినఁజెప్ప నాయెను
కనఁబోకుండెనుచు నీమాయనో యప్పా♦యింతకు వేఁ మా
య లేదప్పా॥ ౭౯॥

తా. తెలియబడు పరిపూర్ణమునందు కనుపించని కతనమున నె
ఱుకను నబద్ధమంటిమి. ఈఎఱుకవలననే నీ జగత్తంతయు గలిగెను. దీని
కన్నను మాయయనునది వేరుగాదు, ఈజగత్తును నిజమని నమ్మకుడ
ని నేజెప్పితిని గదా. ఈమాయను నిజమనినమ్మకుము. ౭౯.

కం॥ అహ మనమగిదా యచలము । అహ మున్నదో లే
దోచూడు మది నిజమెగదా । అహమును బుట్టించుదు గద ।
అహము దయించు కొఱకై యదియున్నదిగా ♦ అహమే వి
శ్వమై నిలిచి నదిగా ♦ అహమె యీ ముచ్చట్లు నన్ని తెలుఁ
గును గద । అహమే తానేనని మెఱిఁగితె సరిగా దయది యు
న్నదిగా ♦ అహమే విశ్వమై నిలచినదిగా ॥ ౮౦॥

తా. శిష్యా పరిపూర్ణమునకు అహముయొక్క సంగతియేమియు
దెలియదు. ముందఱ అహమనునది నిజముగానున్నదో లేదోయను సం
గతి దెలిసికొనుము. అదినిజమగదా; పరిపూర్ణమేమో అహమును పు

టించలేదుగదా; అహమే యీ జగత్తాయెను. మన ముచ్చట లన్నియు నహమే అహమే పరిపూర్ణమును నెఱిగి, తన యబద్ధతను దెలిసి కొనుటయే సరియైనమార్గము. అదియేమోక్షము.

వి. అహమనగా నేను అని యర్థము. కావున అహంకారమని నర్థమగును. జీవాత్మ పరమాత్మయనియు నర్థమగును. ౮౦.

కం॥ ఆవరణము నాకసము ని । రావరణము నచల మను
చు ననిరిమహాత్ముల్ । ఆవరణము మితిగల్గిన । నిరావరణము
నమిత మని యిఁకఁ దెలుసు కోరా ♦ యీరెంటిని వేఱని క
నుకోరా ♦ ఆవరణమునవే నిరావరణమును జూచి । యా
వరణమేది నీ కావల మాట లేదని తెలుసు కోరా ♦ యీరెం
టిని వేఱని కనుకోరా॥ ౮౧॥

తా. శిష్యా; ఆవరణమును నాకాశమనియు నిరావరణమును పరిపూర్ణమనియు మహాత్ములు జెప్పుదరు. ఆవరణమునకు హద్దుమేరలుండును. వాఙ్మానసములకు గోచరముగా నుండును. నిరావరణ మునకు (ఆవరణము) మితి మేరలు లేవు. వాఙ్మానసములకు గోచరము కానిది. ఈ రెంటిని వేరని దెలిసి కొనుము. ఆవరణము చేత నిరావరణమును దెలిసికొని, ఆవరణమును పాఱదోలుము. ౮౧.

కం॥ ఆకాశము శూన్యం బని । లోకులు మొరపెట్టి దాని
లో పవనాదుల్ । ప్రాకటముగఁ బుట్టెనని । చీకాకుగఁ జెప్పి
నారు ఛీవినరాదు ♦ వంధ్యా సంతు క్షితిలోన లేదు ♦ కాకుం
డె వినఁజోద్యముగను గుందేటి కొమ్ము । త్రికాలమున మేమే
గంటి మనుమాట ఛీ వినరాదు ♦ వంధ్యా సంతు క్షితిలోన
లేదు॥ ౮౨॥

తా. శిష్యా; జనులు. ఆకాశంగగనంశూన్యమనియు, అట్టిఆకాశమునందు తక్కిన భూతములు గలిగినవనియు జెప్పుదురు, అట్టి మాటలను నమ్మకుము. ఎటులనైతే గొడ్డురాలికి బిడ్డ లేకయె గొడ్రాలిబిడ్డ యనియు, కుందేటిక శృంగములు లేకయే కుందేటి కొమ్మనియు మాట లున్నవో అట్లు ఆకాశమును శూన్యమని జెప్పుటయే గాని నిజముగాగాదు. ఆకాశముయొక్క గుణము శబ్దము. ౮౨.

కం॥ లేనియెఱుక బయలందున। లేనేలేదనక యితరు లేల బలికిరో । లేనిది కలదనిపిదపను । లేనేలేదనుచు సిగ్గులేక యీ లీలా ♦ ఛీవినకు చీకాకునీకేల ♦ మేఁదశుద్ధము తానందుకొని మళ్ళి । పూనికడిగిసరీతినౌను సిగ్గోకయింత । లేకయీలీలా ♦ ఛీ ♦ వినకు చీకాకు నీకేలా ॥ ౘ3॥

తా. శిష్యా, పామరులు కొందఱు యెఱుకలేనే లేదని సంశయము విడిచిచెప్పుటకు ధైర్యములేక, కొంతవఱకున్నదనియు, కొంత వఱకు లేదనియు, మొదట జెప్పుచుందురు. కొంతకాలముపిదప యెఱుకయొక్క సబద్ధతను ఒప్పుకొందురు. ఇది యెట్లులున్నదనిన మొదట నమేధ్యము నోడ లెల్లబూనుకొని పిదప కడిగివేయు నట్లున్నది. అట్టి మాటలను వినకుము. ౘ3.

కం॥ అన్నపు సూక్ష్మాంశముమన। సెన్నగ నీరంబు ప్రాణ మెఱుఁగుము ఈరెం । డెన్నడు గలయవౌనా డే। సున్నసుమీ యెఱుకమాట సుగుణసంపన్నా ♦ కలియుటె యెఱుకసుమి యింతకన్నా ♦ ఉన్నదెఱుక మూలమన్నదె వినలేవు । ఎన్నడు నీ భ్రాంతి నిన్నంటనియ్యకు సుగుణసంపన్నా ♦ కలియుటె యెఱుకసుమి యింతకన్నా ॥ ౘర॥

తా. మేలిగుణములకు గనియైనవాడా [శిష్యుని సంబోధనము] అన్నముయొక్క సూక్ష్మాంశమే మనస్సు, జలము సూక్ష్మాంశమే ప్రాణము ఈరెంటియొక్క సంగమమే [కూడికయే] ఎఱుక ఈరెండును నెన్నడు కూడకయుండునో, అన్నదే యెఱుకయొక్క యబద్ధత బైటపడును. ఎఱుకకు తనపుట్టుకయొక్క సమాచారమేమియు దెలియదు. ఎఱుక నిజమను భ్రాంతినెన్నడును జెందకుము. ౘర.

కం॥ పిల్లలుతాటాకులతోఁ। బిల్లలఁ గావించి పెండ్లి సేఁయం టంబుల్ । కొల్లలుగఁజేయువారల । తెల్లులుగని సత్యమనుచుఁ దలఁచేరమదిని ♦ నినుసీవిట్లు తలఁచునీమదిని ♦ కల్లసంసారము గనిమానవులు సంత। సిల్లఁగగురుమంత్రసిద్ధులు నిజమని తలఁ చేరమదిని నిను సీవిట్లు దలఁచునీమదిని॥ ౘ౫॥

తా. ఆడుకొను పసిబాలురు తాటాకులతో స్త్రీపురుష ప్రతి

మలనుజేసి, ఆప్రతిమలకే బెండ్లిండ్లుజేయుదురు. వాటిని వారిమాటలు నిజమని నమ్ముదురా [నమ్మరు.] అట్లే, నీ సంసారమంతయు నిజమని నమ్మ పామరులమనస్సులను, అచలగురులును, మంత్రసిద్ధుల జెందిన వారలును, నిజమని నమ్మరు. దీనిని బాగుగా నెఱుగుము. ౮౫.

కం॥ మేనెఱుకలనఁగ రెంటిలో। దానిని నిదిదీని నదియొందగ
సృజియించుక్। మేనెఱుక లివియు మూలము। లేనిదెస్పృజన
మ్యేనను చు లేనెలేదంటి ♦ అంటేతప్పా లేనేలేదంటి ♦ మేనెఱుక
లిప్పుడు దేనందున్నవో చూచి। లేనేమేనెఱుకల లేని వనుచు
నమ్మ లేనెలేదంటి ♦ అంటేతప్పా లేనే లేదంటి॥ ౮౬॥

తా. శరీరము, ఎఱుక యీ రెండును నొకదానినొకటి సృజించును. ఎల్లసృష్టికిని నివి రెండును మూలకారణములు. అయితే మును పు నివి రెండును లేవని జెప్పుట సరియాయని యడుగుదువేమో, దానికి సమాధానము జెప్పెదవినుము. ఇవి రెండును లేవనిజెప్పుట తప్పుగాదు అవిలేనిమాట నిజమేను, ఈ రెండును దేనియందున్నదో దానితెలిసికొని [అనగా పరిపూర్ణమును దెలిసికొని,] నీ రెపటిని, అబద్ధమని నెఱుగుము. ౮౬.

కం॥ ఎఱుకపనిసేయదనకుము। ఎఱుఁగుటమఱిమాటలురెం
డు నెవ్వరిపనులోఁ నెత్తిగింపుము నాప్రమోలను। వెఱువకుతెప్పి
తివిదెబ్బ వేసెదఁజూడు ♦ అట్లనకుండఁజేసెదఁ జూడు ♦ నెఱపించు
టే దెబ్బవేసై సనాతంత్రీ। యెత్తిగించు పై మర్మమెఱుగఱునేఁ
దీసివేసెదఁజూడు ♦ అట్లనకుండఁజేసెదజూడు॥ ౮౭॥

తా. శిష్యా? ఎఱుకపనేమియుజేయక నూరకున్నదని జెప్పకుము. అట్లెఱుక పనేమి జేయకయుండిన పక్షమున, తెల్విమఱపులు నెవ్వరికార్యములుచెప్పుము. ఏమియు భయ ముంచుకొనవలదు, తప్పుగా నుత్తర మొసంగితివేని, నిన్ను శిక్షింతును. మరల నాప్రకారము తప్పుగా జెప్పకుండునట్లు జేసెదను జూడుమని గురుడు జెప్పెను. అందులకా శిష్యుడు, గురుపరా, తమరు కొట్టుదురని భయము పెట్టుచున్నారేగాని,నొకదెబ్బయైనను నాదేహముపై బడలేదు. నన్ను బాగుగా ప్రహారించియైనను,నాకా యెఱుకయొక్క మర్మముబోధింపుమని ప్రార్థించెను. ౮౭.

కం॥ లేనికల గలిగినప్పుడు। దానికిదశదిశలయందుఁ దగ
మొదలుకొనఁగ। దానంటకున్న మేల్కను। లేని కలే చూచె
నేని లేకపోవుగదా ♦ కలలో మేల్కలేక పోదుగదా ♦ లే నెఱు
క బయలు నీలాగున నీకెపుడు। గానవచ్చితే బోధగానలెన వ
పుడు లేకపోదుగదా ♦ కలలో మేల్క లేకపోదుగదా॥ ౮౮॥

తా. శిష్యా, నిజముకాని స్వప్నమునందు నీకు గనబడు సర్వ
మును, మేల్కొన్న పిదప, నబద్ధములుగా దెలియబడును. స్వప్నము
లో కూడ మెలకువ యుండునట్లు తోచుచున్నది. అట్లు నెఱుకయు
ను, నిజముగానే తోచుచున్నది. పరిపూర్ణమను మేల్కను కనిన తో
డనే, స్వప్నమను నెఱుక యొందును నిలువక పాఱిపోవును. ౮౮.

కం॥ ఒంటుకు దాపలిబిందౌగ। టంటించిన కొలఁదిలెక్క
యధికంబగునా। యొంటుకు వలపల బిందౌక। టంటించిన
లెక్క యుక్కెక్కయొగఁ దోయి ♦ ఒంటుండి లేదా గాదన
వోయి ♦ వంటదీరు చూడు దానివలెనే యెఱుక। కంటెబయ
లునుదాఁకగలిగుండు తనకుక్కెక్కయొఁగదోయి ♦ ఒఁటుండి
లేదా గాదనవోయి॥ ౮౯॥

తా. శిష్యా, ఒకటియను సంఖ్యకు వెనుక బిందువును యుం
చిన వో పదియగును. ఆబిందువునే ఒకటికి ముందుంచినవో నాసంఖ్య
కు విలువయేమియు నుండదు. అట్లు పరిపూర్ణమును దెలియుటకు ము
నుపు, యెఱుక, నిజముగాదోచును దానిని యెఱిగిన పిదప నెఱుకయొ
క్క యబద్ధత బైటపడును. ౮౯.

కం॥ యెఱుకొక్కటుండె నేనియు। నెఱుకే యీవిశ్వరూ
పమేర్పడదాయెగ। యెఱుకొక్కటి లేకుండిన। నెఱుకైన ప్ర
పంచమున్న దెవ్వరికెఱుక ♦ లేదనన్నైన నెవరున్నారికను ♦ పరి
పూర్ణమొకటి బయలుండఁ గనిపట్టి గుఱుతు పోఁగొట్టితేనెవ రె
ఱిఁగేరికను ♦ లేదనన్నైన నెవరున్నారికను॥ ౯౦॥

తా. ఒక్క యెఱుక యుండు నంత నంతను నా యెఱుక ప్ర
పంచరూపమున నుండును. [అనగా ప్రపంచ ముండును.] ఆయెఱుక
లేనిపక్షమున, ప్రపంచముండునది లేనిది నెఱుగుటయెట్లు, ప్రపంచము నె

ఱుగుటకు నెఱుకకు తప్ప యింక దేనికిని సాధ్యముకాదు. పరిపూర్ణము యొక్క యదార్థతను గని యెఱుక నశించినపిదప, నెఱుగువారలును యుండరు. ౯౦.

కం॥ తెలుపు మృదుత్వము మధురము। గల వస్తువు చక్కెరను మ గనుగొన్నట్లా । తెలివి విశదముగ జగములఁ । గలవస్తువు బిందు వనుచుఁ గనుఁగొనరాదా ♦ నేఁ దెలిపిన విని నమ్మరాదా ♦ తెలివిచె బయలుండ తెలిసియీ తెలివినిఁ । దెలివి చేతను బట్టి తీసి వేసినఁ బోను గనుగొనరాదా ♦ నేఁ దెలిసినవిని నమ్మరాదా॥ ౯౧॥

తా. తెల్లగాను, నునుపుగాను, మధురముగాను నుండు వస్తువు చక్కెరయని యెట్లు తెలిసికొనుచున్నావో అట్లు, వస్తుప్రపంచమునంతయు, దెలియజేసెడు వివేకము నేది గలదో దానినే యెఱుక యందురు. అట్టివివేకము చేతనే పరిపూర్ణము నెఱింగి, మరల నెఱుగుటకు సాధనమైన వివేకము (ఎఱుక) నువదలివేయుము. దీనినిబాగుగా తెలిసికొనుము. ౯౧.

కం॥ లేనెఱుక బయలు లోపలఁ। దానై తనకేరుపడినతన మూలమునే । తానెఱుఁగఁదలఁచినప్పుడు। తానే లేకుండు దృష్టాంతము వినుమిచటఁ ♦ గలఁ దోఁచదే తనకై తానెచటఁ ♦ దానై తోఁచిన కల తన మేల్కఁగనఁ బోతే। తానే తనకు లేదు తాగియున్నది దృష్టాంతము వినుమిచటఁ ♦ గలఁదోఁచదే తనకయి తానెచట॥ ౯౨॥

తా. లేని యెఱుక తనకుతానే జన్మించును. మరల తన మూలమును దెలియగోరినశించును. ఇందులకు సరియైన నొక దృష్టాంతమును జెప్పెదను వినుము. స్వప్నమందు దోఁచినవి యెల్లను మేల్కాంచినపుడు నెట్లు లేనివిగా నేర్పడునో, అట్లు యెఱుకయు, మూలమును దెలియగోరునపుడు దానులేనిదిగా దెలిసికొనును. ౯౨.

కం॥ చచ్చుటపుట్టుట మెలఁకువ। వచ్చుటగాఢపు సుషుప్తి వచ్చుట నివినా। లచ్చుముగ సహజమఱుకకు। బొచ్చెము ఈయెఱుక నిల్వఁబోదు మాయప్పా ♦ అచలమునకిట్లు లేదుగ

దప్పా ♦ మచ్చికతో రెంటిమర్మగునీ కిప్పు । డెచ్చుగ దెలిపి
తి నెఱుఁగు మెఱుకనిల్వబోదు మాయప్పా ♦ అచలమునకిట్లు
లేదుగదప్పా॥ ౯-౩॥

తా. శిష్యా; జననమరణములు, సుషుప్తి నిద్ర, స్వప్నము, జాగ్రత్త [మెలకువ] మొదలగునవస్థలు ఎఱుకకు సహజముగా నుంటున్నవి. కావున యెఱుక యచలముగాను నిత్యముగాను నుండనోపదు. పరిపూర్ణమునకీ యవస్థలేవియు లేవు. కావున నది నిత్యము. నీకీ రెంటిమర్మములను జెప్పితిని. ౯-౩.

కం॥ ఎఱుకను గలలోఁ బురుషుని । కెఱుకే యీవిశ్వమగు
చు నేర్పుడుఁ గలగా । నెఱుక బయలుకని తానెం । దెఱిఁగిననె
ఱుకది మేల్కని యిది నమ్మలెస్స ♦ యెఱుకతోపోదు వదిలే
దేబిస్స ♦ యెఱుకనే కలసీకు నెప్పుడుదోఁచిన । నెఱుక లేదను
మేల్క నెఱుఁగు మెప్పుడు చాలు నిదినమ్మ లెస్స ♦ యెఱు
కతోపొందు వదిలేదేబిస్స॥ ౯-౪॥

శిష్యా, ఎఱుక యీవిశ్వ మంతయు దానగును. ఎఱుకయును స్వప్నమందగపడు పురుషుడును సమానములు, ఎట్లైతే మెలకువ గన్నతరువాత స్వప్నమం దగుపడిన పురుషుడులేని వాడగుచున్నాడో అట్లు పరిపూర్ణమను మేల్కగన్నతోడనె యెఱుకయు లేకపోవును. ఎఱుకనువదలుటయే సరియైన బాటయని నమ్మము. ౯-౫॥

కం॥ చిత్తరువు రంగుగోడల । నెత్తెఱఁగునఁ దెలిసినావో
నీవిప్పుడు నీ । చిత్తమున జగము నెఱుకను । నుత్తబయలట్లదె
లియ మూహతోడనను♦ దెలిసి విడువు మూహజగములను♦
అత్తెఱఁగునఁ జేసి యావలి మాటను । నిత్తెఱంగునఁ దెలియ
నెవరుండే రటుమీఁద నూహ తోడనను♦ దెలిసివిడువు మూ
హ జగములను॥ ౯-౫॥

తా. శిష్యా, చిత్రవర్ణములుగల గోడను నీవేసాధనముచేత దెలిసికొందువో, ఆసాధనము చేతనే, నెఱుక, జగత్తు, పరిపూర్ణమను నీ మూటిని నెఱుగుము. ఎఱుగుటకు సాధనమైన యెఱుకనున్ను జగత్తును

న్ను వదలినవెనుక నెఱిగి జెప్పుటకు నెవ్వరు లేరని బాగుగా దెలిసి కొనుము. ౯౫.

కం॥ పరిపూర్ణములో లేనిది। ఎఱుకొకటిటిలోఁచి తన్ను నెఱిఁగిన వృథగా। నెఱుకవిడుచునది యెట్లనఁ। గరములు తమపనులుతామె గడుపు నట్లుగను ♦ నిదిగాకుంటె కలదొకటి వినుము ♦ మఱికానిదీమాట మంచిదీమాటని। పరిపరివిధములఁ బల్కుపలుకులఁ బనిగడుపు నట్లుగను ♦ నిదిగాకుంటె కలదొకటి వినుము. ౯౬॥

తా. పరిపూర్ణమునందు, లేనట్టియెఱుక సంప్రాప్తించును. పరిపూర్ణము నెఱిగినపిదప, తనకల్లతనమును బైట వేసికొనును. దీనికి దృష్టాంతము జెప్పెదవినుము. చేతులు తమచేయుపనులు తీరిన తరువాత తామూరకయుండును. ఈమాట న్యాయము, ఇది యన్యాయము యని జెప్పుమాటలును, తరువాత శాశ్వతముగా నుండవు. ౯౬.

కం॥ తలమెత్తి చూడజాలున। యలచీకటి యెదుటనిలిచి యజ్ఞాపుకళం। గలవచ్చి మెలకు వందున। గలచేష్టలు ప్రోలనిలచి కనుగొనగలదా ♦ అట్లనె యెఱుకగను గొనవలదా ♦ యిలలోన గురుబోధ నెఱిఁగిన నరుని చే। ష్టలు గంటెనుశ్కొక్కి సద్గురు బోధౌట కనుగొనవలదా ♦ అట్లెనె యెఱుక గనుఁగొనవలదా ॥ ౯౭॥

తా. శిష్యా; చీకటి యెటులనైతే సూర్యకరణములనుచూడజాలదో [అనగా సూర్యునియెదుట చీకటియుండదో] నటువలె స్వప్నమునందలి యనుభవములను, జాగ్రత్తయందు చూచుట యసాధ్యము. మేలి గురూపదేశము జెందిన వానికి చేష్టలేవియు నుండవు. ౯౭.

కం॥ అంటము కలమెలఁకువ మే। ల్కాంటదు కలనెన్నటికిని వదినిశ్చయమిా। రెంటిక్రియగుఱుతుబయలుల। రెంటినిరెండంటకుండు రెండింటిలోను ♦ గలయెఱుకలీరెండు మిథ్యాను♦ దంట మెలఁకువ బయలుంట యెప్పటికెఱిఁగి। గొంటుముపై రెంటి కలయెఱుకల రెండింటి లోను ♦ గల యెఱుక లీ రెండుమిథ్యాను॥ ౯౮॥

తా. కల మెలకువలు రెండును నొకదానితో నొకటి జేరవు. వాటి రెంటికిని సంబధము లేదు. అదేవిధముగా పరిపూర్ణ మెఱుకలు రెండును నొకదానితో నొకటిజేరవు. ఓిపిలో కలయు, ఎఱుకయు, సబద్ధములుగా నెఱుగబడును. జాగ్రత్తయు, పరిపూర్ణమును నిజములన్నను, నిజములైన వాటిని నెఱిగి, కల్లయైన వాటిని వదలిపెట్టుము. ౯౮.

కం॥ ఎఱుఁగదు సుషుప్తిజాగ్రత, నిరవందకగల సుషుప్తి
నెఱుఁగదు మెలఁకువ। ట్టరయ నెఱుక మఱుపులబయ। లెఱు
గదు. ఎఱుకయీ రెంటి నెఱుఁగుచు నుండు ♦ గురుముఖమున
నెఱిఁగి యీరెండు ♦ తిరముగ నెఱుకను దీసివేసి తెచాలు।
పరులు నేననియెడి పలుకులేకుండు నిల్లెఱుఁగు మీరెండు ♦
గురుముఖమున నెఱిఁగియీరెండు॥ ౯౯॥

తా. శిష్యా; నిద్ర, మెలకువ నెఱుగదు. మెలకువను నిద్రయెఱుగదు. అట్లె యెఱుకయు పరిపూర్ణ మెఱుగదు. అయితే నీ రెంటినిన్ని [పరిపూర్ణమును, యెఱుకను] యెఱుకయే యెఱుగును. సద్గురుని దయవల్లనీ రెంటిని నెఱిగి, అహంభావమును జెందియుండు నెఱుకను పాఱదోలుము. ౯౯.

కం॥ సంకల్పములో లేనిది ని। స్సంకల్పములోఁ దోఁచక
ను వోఁచిచనుఁ । సంకల్పమె తప్పని। నిశ్శంకఁ మదిదెలిసె
నేని చనుదాలేనును ♦ నిస్సంకల్ప మునివదననుచు ♦ సంక
ల్పించుటకుంక సంకల్పమేది నిస్సంకల్ప మంమటల్ సంకల్పమె
ఱిఁగితె చనుదాలేనును ♦ నిస్సంకల్ప మునిచదననుచు॥ ౧౦౦॥

తా. శిష్యా, సంకల్పముచే నొక కార్యము సాధింపనలవి కాని యెడల, నిస్సంకల్పమునందు, సాధ్యమగునట్లు దోచుచుండును. సంకల్పము సరిగాదని మనస్సునకు నిస్సందేహముగా తెలిసినయెడల సంకల్పముతోనకుదానే లేకపోవును. నిస్సంకల్పమే సరియనిన యెడల, సంకల్పము జేయుట కింక నేమియునుండదు. కావున సంకల్ప, నిస్సంకల్పములు రెండున్ను నిత్యములుగావు. ౧౦౦.

కం॥ ఎఱుక తనకుఁదా విడిచిపో। దెఱుకను విడిపింపలేరు
ఎవ్వరుధాత్రిఁ । గురుఁడొకఁడు తప్పగురునకుఁ బరిచర్యయె

నర్చి బోధపద్ధతి వినినన ♦ దిరిగిరాని పద్ధతి గనినన ♦ బరిపూ
ర్ణ మెఱుక నేర్పఱచు నెఱుకయు లేక। హరిని గలలోఁగన్న క
రిట్రమ్మగ్గినట్లు యీపద్ధతి వినినన♦దిరిగిరానిపద్ధతిగనినన॥ ౧౦౧॥

తా. ఎఱుక స్వతహాగా నాశముపొందదు. దానిని మరియెవ్వ
రును గూల్పలేరు. దానిని నొక్కగురువు తప్ప యింకెవ్వరును విడిపిం
పలేరు. గురు శుశ్రూషలుజేసి జనన మరణములను పొందని సన్మార్గ
మును దెలిసి కొనినయెడల, పరిపూర్ణమెఱుకల రెంటిని నెరుగు
యెఱుక నశించును. ఏవిధమున యనిన స్వప్నమునందు, సింహమును
గనిన గజము మాడ్కి నశించును. ౧౦౧.

కం॥ అపరోక్షమాన మనుజుల। కు పరోక్షంబైన బయ
లు గురుకృపలేకన । అపరోక్షమాను మనుజుల। కుపరోక్షం
బైన బయలు గురుకృపగలుగన ♦ గీద్దెలిసినయెఱుక తాఁదో
లఁగన ♦ విపరీతబుద్ధిని విడిచినీవెప్పుడు।నుపచారములు చేయు
చుండుము గురునకు గురు కృపగలుగన ♦ గీద్దెలిసిన యెఱుక
తాఁ దొలఁగన । ౧౦౨॥

తా. సద్గురు కటాక్షము లేకయే, పరోక్షమైన నీపరిపూర్ణము,
అపరోక్షమేలాగగును, కాదనుట, గురుకటాక్షమున్న యెడల నపరోక్ష
మగును. నీవు విపరీత బుద్ధినేమియు నుంచుకొనక గురునకు శుశ్రూ
ష జేయుచుండుము ఈమర్మమును దెలిసికొంటివేని ఎఱుక వెంటనే నశిం
చును. ౧౦౨.

కం॥ నేనెవ్వండను జీవుండు । నేనేనేనను శివుండు నీరెం
డనకన దానుండు నచలమన్నిట। నేనరిగినం దానుపైదినేనెట్ల
నీనీ♦నేననకున్నఁదా నెట్లనీని ♦ నేనన్న దాననే నానీప్రసంగము।
తానన్నఁదాననే తలపోయవలెనట్లు నేనట్లనీసి♦నేననకున్నఁదా
నెట్లనీనీ॥ ౧౦౩॥

తా. జీవుడు నేను యెవ్వడను, అని సందేహము నొందుచుండు
ను, శివుడు నేనే నేనని జెప్పుచుండును. పరిపూర్ణమునీరెంటిని జెప్పదు నేను
నేను అను అహంభావమువహించి యున్న యెడల తానుపరిపూర్ణము
ను యేలాగు యెఱుగును. నేనునేనని జెప్పకుండిన యెడల తన్ను

దా నెల్లెఱుఁగును. ఈప్రసంగమంతయు నేను నేనని జెప్పుటవలన గలుగుచున్నది. నేనని జెప్పుట వలననే యింత యోచింప వలసి నట్లయినది. ౧౦౩.

కం॥ తొఱ్ఱలుతొమ్మిదిగలమేఁ।మఱ్ఱికినొకరెంటిలోన మ
ల్కులునాల్గుం।డెఱ్ఱది తెల్లది నల్లది।కఱ్ఱిది దానగ్రమందుఁగల
దొక్కతూటు॥అదియె యెఱుకనే పులుగుండుచోటు॥ కుఱ్ఱగురుబో
ధను గొడ్డలిచే బూని। మఱ్ఱిపులుగుల రెంటి మలచి కాకపోని
గలదొక్క తూటు॥అదియె యెఱుకనే పులుగుండు చోటు॥ ౧౦౪॥

తా. దేహమను మఱ్ఱిచెట్టుకు తొమ్మిదితొఱ్ఱలుగలవు.[అనగా నవరంధ్రములుగలవని యర్థము]ఆరంధ్రముల రెండిటికినాల్గు[మల్కులు] మూఁకుళ్లుగలవు. ఈమూఁకుళ్ళ నాల్గింటికిఁ నలోనొక నాళముండును. ఆనాళమునందు యెఱుకయను పక్షి వాసము జేయుచుండును. నీవు గురునిచేతనెఱుఁగబడ్డ పరిపూర్ణజ్ఞానమనుగొడ్డలిచేత మఱ్ఱిపులుగుల రెంటిని (దేహమును, యెఱుకను) నఱికివేయుము.

వి. నవరంధ్రములెవ్వియన, ఘ్రాణరంధ్రములు ౨. నేత్రరంధ్రములు ౨. కర్ణరంధ్రములు ౨. నోరు ౧. గుదరంధ్రము ౧. ఉపస్థ ౧. ఇక్కడ జెప్పబడియుండు రెండురంధ్రములును నేత్రరంధ్రములు. కంటికినాల్గుమూతలుగలవు. వాటిలో మొదటిది యెఱ్ఱది (అనగా కంటిరెప్పలురక్తనాళములు మొదలైనయెఱ్ఱమూతలు) రెండవది తెల్లది (అనగా కంటిపైనయుండు తెల్లపొర)మూడవది నల్లది [అనగానీలపుగ్రుడ్డు] నాలుగవది కఱ్ఱిది [అనగాయింకాలోపలనుండుపాప.] ఈనాల్గింటికి పైనుండు నాళమే బ్రహ్మనాళము, ఈబ్రహ్మనాళమునందు హంసయుండును. ఆహంసయే యెఱుక. ౧౦౪.

కం॥ తనువునఁ గలిగిన యెఱుకే। తనువును దనువనుచు ద
న్నుఁదానని యెఱుఁగుఁ। దనువును బాసినమీఁదటఁ। దనునాదే
హమును రెండు తా నెఱుఁగ దెపుడు॥ అద గనుకఁదా లేనే లే దెపు
డు ॥ అనుమాన రహితమైయుం దచలమున్నది గంటె। దినమా
ట తలపోయఁదినము సిద్ధ మున్నుఁదా నెఱుఁగ దెపుడు॥అదిగ
నుకఁదా లేనే లేదపుడు॥ ౧౦౫॥

తా. శిష్యా, దేహమువలనఁగలిగినయెఱుక, తన్నును, దేహమును, వేర్వేరుగా నెఱుఁగును. దేహమును బాసినవెనుక, తన్నుఁగాని దేహమునుగాని నెఱుఁగజాలను. తన్నునెపుడు నెఱుఁగదో, నెఱుకయే లేకపోవును. పరిపూర్ణముయొక్కయథార్థతను దెలిసినయెఱుక, తన్ను గుఱించియెంచుటకే సిగ్గుపడును, అనఁగా లేకయే పోవును. ౧౦౫.

కం॥ ఉప్పినిఁజెఱుఁగదరు వొక్కప్పుడు విత్తనము చచ్చునా
రెంటికినీ । త్రిప్పలు తప్పవుధరయే । త్రిప్పలుతా నెఱుఁగనట్లు
తెలిసికోవోయీ ♦ తనువెఱుకల బయలెట్లుఱుఁగోయీ ♦ గొ
ప్పయిన గురుబోధచొప్పున నెఱిఁగిపై । త్రిప్పలుగలదానిఁ ద
ప్పతీసి తెచ్చాలు తెలిసికోవోయీ ♦ తనునెఱుకల బయలెల్లె
ఱుఁగోయీ॥ ౧౦౬॥

తా. శిష్యా. మంచిగాలివానకు, వృక్షమునశించును. మఱి యొకప్పుడువిత్తనమును నశించును. ఈ రెంటికిని నాశము తప్పదు, ఈ రెంటియొక్క పాట్లు, భూమికేమియు దెలియదు. అటులే పరిపూర్ణమునకు శరీరముయొక్కయు, యెఱుకయొక్కయు త్రిప్ప బాట్లు దెలియవని దెలిసికొనుము, పరిపూర్ణమును నెఱిఁగి, చావుపుట్టుకలతో గూడిన శరీరమును, యెఱుకను త్యజించుము. ౧౦౬.

కం॥ మాతములవారలుతమ స । మ్మతమైనట్టి నట్టిశాస్త్ర
మర్యాదలచే । మితమేరు పఱచుకొనిబహు । గతులనుగలహిం
తురట్టి గతినీకేమిటికిఁ ♦ జపలతఁ జెందేస్థితినీకేమిటికిఁ । బ్రతిలే
ని యీబట్ట బయలుండఁజూచి సం । లతములే నెఱుక లేదనిన
మ్మమిక నాదిగతి నీకేమిటికిఁ ♦ జపలతఁ జెందేస్థితి నీకేమి
టికి॥ ౧౦౭॥

తా. శిష్యా, మతత్రయములవారు, వారివారి మతానుగుణ్యమయిన విధులచే కట్టువడినవారై, తామనుష్ఠించు నాచారములే సరియని యొకరితో నొకరు వాదించుచుందురు. నీవు సమాన రహితమైన పరిపూర్ణమును దర్శించి యెఱుకను కల్లయని దెలిసికొనుము. మతత్రయములవారు యేపాటుపడితే నీకేమి. నీమనస్సును చంచలము లేకనుంచుకొనుము.

వి. మతములు మూడువిధములు. ద్వైతము [జీవేశ్వరులు వేరనివాదించునది], అద్వైతము[జీవేశ్వరులయొక్కటియని వాదించునది], విశిష్టాద్వైతము [ఈశ్వరుడు వేరనివాదించునది] ఈమూటినిమతత్రయమనియందురు. మతములనారువిధములుగాను భాగింతురు. శైవము వైష్ణవము, శాక్తము, గాణపత్యము, సౌరము కాపాలము, వీటినిషణ్మతములనియందురు. ఇక్కడ జెప్పబడ్డది మతత్రయములు. ౧౦౭.

కం॥ ద్వైతాద్వైత విశిష్టులు। నైతురు వినసైపరెపుడు
సైపక పిదపక। సైతురు క్రమమున వేఱని। నాతత మదిజీ
వ శివులనవి వినఁబోకు ♦ నేబోధించి నవి వినువబోకు♦ పూత
మాబయలును బొడఁజూచి గురునిచే। ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతములను మూను మవివిఁబోకు♦ నేబోధించి నవివినువఁ
బోకు॥ ౧౦౮॥

తా. శిష్యా; ద్వైతులును, అద్వైతులును, విశిష్టాద్వైతులును జీవేశ్వరులు యేకత్వమునుగుఱించి వాదించుచుందురు. ద్వైతులు జీవేశ్వరులు వేఱనియు అద్వైతులు వేఱుకాదనియు జెప్పుచుందురు. వారి మాటలను వినకుము. గురునిచేత పరిపూర్ణజ్ఞానమును జెంది యీ మతత్రియములవారి వాదములను వినకుము. ౧౦౮.

కం॥ కొందఱు దశవిధనాదము। లందున సభ పంచకంబు నందుఁ దక్రా। లందున లక్ష్యధ్యానము। లందున హంసందు బుద్ధినాటింతు రోయీ♦ యోగములందు నటియింతురోయీ♦ అందుసిద్ధులచేత నానందింతురు గొంద। కొందరేమనిన నీబోధం దేయుంచుము నాటింతురోయీ ♦ యోగములందు నటియింతురోయీ॥ ౧౦౯॥

తా. శిష్యా. ఈప్రపంచమునందు కొందరు దశవిధ నాదముల యందును, మఱికొందఱు పంచవిధయోకాశములందును, మఱికొందఱు మహాధ్యానములయందును, మఱికొందఱు ఆరువిధములయినలక్ష్యముల యందునుమఱికొందఱు సగుణధ్యానమందును, మఱికొందరు హంస యందును బుద్ధిని నిల్పి ధారణజేయుదురు, వాటివలన అణిమాద్యష్ట

సిద్ధులనుజెంది యానందించుచుందురు. చతుర్విధ యోగముల నభ్య
సించువారి మాటలను వినకుము. ఈపరిపూర్ణ బోధను వదలకుము.

వి. చిణిచిణి, చిణి, ఘంట, శంఖ, వీణా, తాళ, వేణు, భేరి, మేఘ,
మృదంగములు. ఈపదింటిని ప్రణవనాదములందురు. ఘటాకాశము
చిదాకాశము, ధారాకాశము, మహాకాశము, హృదయాకాశము, ఈఐ
దును పంచాకాశము లనంబడును. మూలాధార స్వాధిష్ఠాన మణిపూ
రక అనాహత విశుద్ధ ఆజ్ఞేయములని ఆధారము లారువిధములు. స్థూ
లము సూక్ష్మము, కారణము మహాకారణము; సమరసము, వ్యక్తము
అనిలక్ష్యములు [శరీరము] ఆరువిధములు మంత్రయోగము లయయో
గము, హఠయోగము, రాజయోగము అనియోగములు నాల్గువిధములు.
అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము,
వశిత్వము అనునవి అష్టసిద్ధులు. హంస బ్రహ్మనాళమునం దుండును.

కం॥ కొందఱు ముద్రలు గనవలె । నందరుమఱి కొందర
ధికమందురు ద్రష్ట । కొందరుభజనే లెస్సని । యందురు ఇ
వియన్ని యెఱుకేయని తెలుసుకొనుమీ ♦ నీకివియేల పని లేదు
వినుమీ ♦ ముందుగ బరిపూర్ణమున్నది గని గుర్తు । నెందుండ
కుండ దానెగరంగొట్టినం జాలునని తెలుసుకొనుమీ ♦ నీ కివి
యేల పనిలేదువినుమీ॥ ౧౧౦॥

తా. కొందఱు పంచవిధముద్రల నెఱుగవలయునని యందురు.
కొందఱన్నిటిని జూచునదియైన సాక్షి నధికమందురు. కొందరీశ్వరధ్యా
నము మేలనియందురు. ఇవియన్నియు, నెఱుకేయని తెలిసికొనుము.
నీకీ తప్పశ్రోవలేవియు వలదు. పరిపూర్ణమును దర్శించి యెఱుకను
వదలుటయే సరియైనమార్గమని యెఱుగుము. (వి. ఖేచరి, భూచ
రి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి, యని ముద్ర లైదువిధములు.) ౧౧౦.

కం॥ దేవుని నీవునెఱుంగవు । నీవిప్పటి కెట్టివాడవో నేడెలి
పెదనీ । కావేట్టి బోధలెందుకు । కావున నద్దేవునిదగో గనుం
గొనవోయీ ♦ నామరూపకర్మలేవోయీ ♦ నీవా దేవునిలోన
నిమలెస్స వెదకిన । నావలముచ్చట నమగోయి దెల్పెద కనుం
గొనవోయీ ♦ నామరూపకర్మలేవోయీ ॥ ౧౧౧॥

తా. దేవుఁడెవ్వఁడో నీకు దెలియదు. నీవెట్టివాఁడవై నదినీకు దెలియదు. తెలిపెదను వినుము. వెఱ్ఱిమార్గములను వినకుము. దేవునిబాగుగా దెలిసికొనుము. అతను నామ (పేరు) రూపక్రియలచేత కట్టువడినవాఁడుకాఁడు. అట్టి దేవునియందు నీవుకూడ నుందువు. నిన్ను ఆ దేవునియందు జూఁడుము. పిదప నీకుజెప్పెదను. ౧౧౧.

కం॥ మానవుఁడు సేయఁబూనిన దానిని లోఁతెఱిఁగి చేయఁ దగునని మదిలో। నేనెఱిఁగి నీకుఁ జెప్పితి। పూనుము రుచిపుట్టదేని పోని నీమనసు ♦ రుచి పుట్టితే పూను నీమనసు ♦ నేనేమి యనఁబోతె నీకేమి తోఁచునో । లేని నిష్ఠురములు లేకుండునెు లెస్స పోని నీ మనసు రుచి పుట్టితే పూను నీ మనసు॥ ౧౧౨॥

తా. మనుష్యుఁడు దానుచేయుకార్యములనెల్లను విచారించి చేయవలయునను రహస్యమును తెలిసియే నీకీ యుపదేశము జేయుచున్నాను. నేనుజెప్పిన పద్ధతిని నడుచుకొనుటకు పూనుము. నినునేజెప్పు దానిలో నిష్ఠములేదేని వదలిపెట్టుము. నేజెప్పునది నీ కింపైనయెడల నడుచుకొనుము. కేనొకటి జెప్పినదానివి నీవు వేరుగాఁగ్రహించి నన్ను నిష్ఠురమునకు పాత్రునిగా జేయకుము. నేజెప్పుదానిని బాగుగా యాలోచించి చూడుము. ౧౧౨.

కం॥ పంచాక్షరములతోఁ డఁబ్ర। పంచము తానుద్భవించెఁ బ్రణవాక్షరముం। దంచు శ్రుతులెన్నఁదాన్నెఱు। కంచని విచారిఁగి యెఱుఁగు మచలము దీనఁ ♦ నిల్పరు మెఱుకనచలము లోనఁ ♦ చంచల మతిచేత జతురాక్ష రెక్కువం। చెంచెడి నెందుకు? ఇదినమ్మి యెఱుఁగు నిల్చచలము దీనఁ ♦ నిల్పరు మెఱుక నచలము లోనఁ॥ ౧౧౩॥

తా. శిష్యా:ప్రపంచముపంచాక్షరివలనఁ పుట్టినది. దానికి ముందరి ఓంకార స్వరూపమైన ప్రణవాక్షరి ముందుండు. దీనినంతయు నెఱుకగా దెలిసికొనుము. అట్లు దెలిసికొన్నవాఁడై, ఆ యెఱుకచేతనే పరిపూర్ణమును నెఱిఁగి, యెఱుకనుపరిపూర్ణమునందు నిలువనీయకి తిరుమ గొట్టుము. నీవు చంచలమైన మనస్సుగలవాఁడై పంచాక్షరీ మొదలగు

మంత్రము లెక్కువయని తలచుటతప్పు. అట్లు తలవకుము. ౧౧౩.

కం॥ ఎఱుకే చిజ్జడమీజగ । మరయఁగఁ బరిపూర్ణ మేమి
యనరా దదియా । యెఱుక జగము లస్థిర ములు । పరిపూర్ణ
ము శాశ్వత మది పాటించి కనరా ♦ కావా రెండీ పాటివి విన
రా ♦ గురుముఖమున వీటి నరుఁడు గుర్తెఱిఁగినఁ । దిరిగి పు
ట్టఁడు వాఁడిద్ధరపై మునుపటి వలె పాటించి కనరా ♦ కావా
రెండీ పాటిని వినరా॥ ౧౧౪॥

తా. ఎఱుకే చైతన్యస్వరూపమైనదిగాను జడస్వరూపమైనదిగా
నునున్నదిఆలోచించిచూడగానీప్రపంచమంతయుఎఱుకగానే యున్నది
పరిపూర్ణమిట్టిదని జెప్పుటకు వలవికాదు ఎఱుకయు జగమును నశాశ్వత
ములు. పరిపూర్ణమో శాశ్వతమైనది ఈరెంటి భేదమును బాగుగా
గురువు యొద్దనుండి దెలిసికొనుము దీనినిగుర్తెరిగిన వానికి పునరపి
జననము లేదు. ౧౧౪॥

కం॥ కొందఱు భూతము లయిదిటి । యందునఁ జిత్తంబు
నుంతు రధికము లనుచుఁ । గొందఱు దేమియు లేదని । యం
దురు కలు తెలుఁగు మిన్ని యపశబ్ద ములురా ♦ యివి య
న్ని నిలువ వని తెలియవలెరా ♦ యెంద రేమనిన నీ కెందుకు
బయలును । ముందుగఁ గనిగుఱు తెందుండని కిన్ని యపశబ్ద
ములు రా ♦ యివియన్ని నిలువ వని తెలియవలెరా॥ ౧౧౫॥

తా. కొందఱుపంచభూతములేయన్నిటికన్న నునెక్కువయటంచు
వాటియందు మనస్సునునిల్పుదురు మఱికొందరు లేమియులేదని వాద
ముజేయుచుందురు. నీవీమాటలన్నియు తప్పువార్తలుగా దెలిసికొనుము
ఇవన్నియు పరిపూర్ణము నెదుట నిలువనేరవు[ అటగా నబద్ధములై పోవు
ను]ఎందరేమిజెప్పినను నీవు పరిపూర్ణము నెఱిగి నెఱుకను వదలిపెట్టు
ము. అదియేముక్తి. ౧౧౫.

కం॥ కొందఱు కర్మము నేఖా । గాదుగు మఱి కొంద రె
క్కువందురు తనువుఁ । గొందఱు ప్రాణము లధికం । బం
దురు నీకిట్టి వట్టియాశ లేమిటికి ♦ వారితోఁ బొందు చేసి వే
మిటికి ♦ నెందఱేమాట లైనైన నీబోధ। క్రిందవేగాని పైకె

గిరేవిగా విట్టులాశ లేమిటికి ♦ వారితోఁ బొందు చేసే వే
మిటికి॥ ౧౧౬॥

తా. కొందరు యజ్ఞాదికర్మములననుష్ఠించుటయే యుత్తమంబని జెప్పుదురు. మఱికొందరు దేహమును లెస్సగా కాపాడుకొనుటయే సరియైన త్రోవయందురు. మఱికొందరు ప్రాణాయామాది యోగాభ్యాసములే సత్పథమందురు. నీకిటువంటి వృథాయాశలేమియు వలదు ఆలాగుజెప్పువారితోడి జెలిమియునీకువద్దు.ఎవరెన్ని జెప్పినను,అవన్నియు నీబోధకు తక్కువై సవిగా నెఱిగి వాటిని నిరాకరింపుము. ౧౧౬.

కం॥ తను వెఱుకలు రెండొక్కటి । యని యనరా దను
చుఁ గొంద ఱందురు భువిలోఁ । దను వెఱుకలు తుదినొక్క
టి । గను గన్పడ కుండు రెండు గనరా యోయన్నా ♦ రెండొ
క్కటి వినరా మాయన్నా ♦ అనుమాన మింక నేల యందఱి
మాటలు । వినఁబోక నేబోధించిన రీతి నిప్పుడు గనరా యో
యన్నా ♦ రెండొక్కటి వినరా మాయన్నా॥ ౧౧౭॥

తా. లోకులుకొందరు దేహమును యెఱుకయు నొకటేయని జెప్పరాదందురు, శరీరమును యెఱుకయు నొక్కటిగానే కనుపించుచు మరల వేరుగాను కనబడును. ఆరెంటిని బాగుగాదెలిసికొని, అవి రెండును ఒక్కటేయని దెలిసికొనుము. నీవెవ్వరి మాటలనువినక నామాటనునమ్ముము. ౧౧౭.

కం॥ కన్నుల ప్రక్కల ద్రేళ్ళిడి । తిన్నగ భ్రూమధ్యమందు
దృష్టి నిలిపియుం । దున్నది వెన్నెలలో బయ । లన్నా కనుమం
దు రెఱుక యదినిల్వదోయి ♦ తనువుతోఁ బోవు నని తెలియ
వోయి ♦ యెన్ని తనువులు వచ్చి యేగిన ఝుణకక । యున్న బ
యలును జూచి యుళ్ళక్కఱు కనువిడు మది నిల్వదోయి ♦ త
నువుతోఁ బోవునని తెలియవోయి॥ ౧౧౮॥

తా. రెండు నేత్రముల ప్రక్కను ద్రేళ్ళుంచి, కను బొమలప్రదేశమునుజూచి, యకఱడయుండు బయలును కనమందురు. అది యెఱుకయని దెలియుము. అది అనిత్యము, అది దేహముతోడ నశించును. అట్టిఅసత్యమైన యెఱుకన వదలిపెట్టుము. ఈ యెఱుకి యెన్ని శరీ

రము లెత్తినను పరిపూర్ణము మాత్రము చలనమేమియు లేక యుం
డునని దెలియుము. ౧౧౮.

కం॥ జనులాత్మానుభవంబై । ననుముక్తని పలికిరిట్లు న
మ్మకుమెఱుకే । కనరా దెచ్చట గురుకృప । ననుభవ మెవ్వరికి
నైన నామాట నిజమా ♦ అనుభవ ముళ్ళక్కా మాటె నిజ
మా ♦ వినఁజప్పు మీరెండు వివరించి పైమాట । వినినే ముం
దరిబోధ వినిపింతువేవేగ నామాట నిజమా ♦ అనుభవ ము
ళ్ళక్కామాటె నిజమా॥ ౧౧౯॥

తా. కొందరు ఆత్మయొక్క యనుభవ మనగా ఆత్మను దెలిసి
కొనుటయే మోక్షమని జెప్పుదురు. వారిని నమ్మకుము. అదియెఱుకత
ప్ప వేరెగాదు. అనుభవమునకు గురువుయొక్క ఉపదేశము లేదు.
గురు వాలాగు జెప్పదు. అవన్నియు నిజముగాదు. ఈరెంటిని నీకుబా
గావివరించి, నేను నీకు బోధను జేయుదును. ౧౧౯.

కం॥ తనుఁదాఁగనినను మోక్షం । బనిపలికిరి గాని జన
ము లదినమ్మకుమీ । తనుఁదాను బట్టబయిటను । గనఁబోయి
తె తనకుఁదానె కానరాదోయి ♦ విశ్వము తనకుం గానరా
దోయి ♦ తనవలన నైనది గనుకఁ దాను విశ్వము రెండు । గ
నుపించు టుళ్ళక్క గావునఁ దనకుఁదాఁ గానరాదోయి ♦ విశ్వ
ముతనకుఁ గానరాదోయి॥ ౧౨౦॥

తా. కొందరు తన్ను దాను దెలిసికొనుటయే మోక్షమని జెప్పి
రి. గాని నీవామాటలను నమ్మకుము. పరిపూర్ణము నందు తన్ను దాను
దెలిసికొనుటకు పోయినయెడల తనకుదానే లేకపోవును, ఈలోకము
తనకేమియు దెలియదు, ఈ విశ్వము తనవల్ల పుట్టినది. కావున నిజ
ము దెలిసికొన బోయినపుడు తానును నీ విశ్వమును రెండును లేక
బోవును. ౧౨౦.

కం॥ మాయగదా లేనియహం । బాయెగదా తనకుఁదానె
యచలము నొప్పం । దాయెగదా మాయనలే । దాయెఁ గ
దా మాయచిత్రమాయెఁగదోయి ♦ సంశయమంత పోయెఁ
గదోయి ♦ మాయన మూలముమాయ చూచుచుండ । మా

యమైపోయెను మాయకే యిదిచిత్రమాయెం గదోయి ♦ సం
శయ మంత పోయెంగ దోయి॥ ౧౨౧॥

తా. లేనిఅహమును మాయగా దెలిసికొనుము. పరిపూర్ణము నిత్యము పరిపూర్ణమునందు మాయలేదు, ఈ మాయచిత్రముగా నుండలేదా. నీ సందియము లెల్లను దీరెనుగదా, మాయయొక్క పుట్టుకను మాయతప్ప యింకేదియు నెఱుగజాలదు, తనమూలమును నెఱుగబోయినప్పుడు తానే మాయమై పోవును. ౧ ౨౧.

కం॥ లేనియహమున్న బయలును। లేని ప్రపంచమును
దన్న లెన్నంగ దనలోం। దాను విమర్శించిన నా। లేనిదిలేకుం
డు నవల లేదు ఏమాట ♦ ఇట్లనన్నైన లేదు ఏమాట ♦ లేని
యహమీబయట లేనే లేదని చూచి। లేనిదికలదని లేనిమా
టాడేవు లేదుఏమాట ♦ ఇట్లనన్నైన లేదు ఏమాట॥ ౧౨౨॥

తా. శిష్యా, నిజముకాని అహమును నిజమైన పరిపూర్ణమును, అనిత్యమైన నీప్రపంచమును నీమాటెని చక్కగా పరామశించి కనుగొనినయెడల, అహమును ప్రపంచమును అబద్ధములుగాను, పరిపూర్ణము నిజముగాను దెలియబడును. అట్లు అహము పరిపూర్ణమునందు లేదని దెలిసికొనిన తరువాత లేనిది యున్నదని జెప్పవు. ౧౨౨.

కం॥ పరిపూర్ణ మెఱుక లెట్టివో । గురుముఖ మున రెంటి
లెన్న గుఱు తెఱంగెఱుకనె। పరిపుచ్చు కున్న మృషయని । పరి
శుద్ధపు బోధ యిదియె పాటించి కనరా ♦ శివరాముల పద్ధతి
యిదిరా ♦ నరులు కొందఱు లిట్టె ఱుకను మ్రింగియా । ప
రిపూర్ణ మయ్యేనం చెఱుంగక చెడుటకై పాటించి కనరా ♦ శి
వరాముల పద్ధతి యిదిరా॥ ౧౨౩॥

తా. పరిపూర్ణమును, ఎఱుక, యీరెంటిను గురు ముఖముగా దెలిసికొని, ఎఱుకను వదల వలయును. ఇదియే పరిశుద్ధమైన పరిపూర్ణబోధ, దీనిని బాగుగా దెలిసికొనుము. ఇదియే శివరామ దీక్షితుల పద్ధతి. ఎఱుకను పరిపూర్ణము మ్రింగి యున్నదని లోకులు జెప్పుదురు, వారిమాటలంతయు కల్లయని నెఱుంగుము. ౧౨౩.

కం॥ బిందువు తనువునం బుట్టును । బిందువు తను వింద్రియ

ముల బృందం బిసువుల్ । అందముగాఁ గలుగు నిదే । నందు
నఁబుట్టినవో తెలియనజునికిఁ దరమా ♦ మూలము లేనిదని తె
లిసికొనుమా ♦ అందు కెబయలున్న దనసి మూలము లేని ।
బిందాద్వి కంబుల పేరు దెగ తెలియ నజునికిఁ దరమా ♦
మూలము లేనిదని తెలిసికొనుమా॥ ౧_౨౪॥

తా. దేహమునుండి బిందువుగలుగుచున్నది. ఆ బిందువు వలన నే దేహము. ఇంద్రియములతో గూడిన యందమైన బిడ్డగలుగు చున్నది. ఎదిదీనికన్నిటికిని మూలమో దానిని దెలిసికొనుటకు బ్రహ్మకైన దరముగాదు. వాటికి మూలము లేదని దెలిసికొనుము. బయలున్నదని దెలిసికొని. మూలములేని బిందువు మొదలగు వాటిని దెలియజెప్పుటకు బ్రహ్మకైనను దరముగాదని దెలిసికొనుము. ౧_౨౪.

కం॥ జనులనిరి దేవుఁడెవరికిఁ । గనరాఁడని నామ రూపక
ర్మకనన ముల్గన నతనికి లేవనియా । జన వాక్యము బయలుకె
వుమ సహజమా వినిరా ♦ అనుమానము చాలించికనరా ♦ క
నినామ రూపాది కములున్న యెఱుకను । వినఁబోక విడిచిపె
ట్టినఁబోవు సహజమా వినరా ♦ అనుమానము చాలించి
కనరా॥ ౧_౨౫॥

తా. వాఙ్మానసములకు గోచరముకాని వాడనియునామరూప క్రియారహితుడనియు, దేవునిగుఱించి లోకులు జెప్పుమాటలు పరిపూర్ణమునకు తగును. సంశయములనెల్ల వదలిపెట్టి నే జెప్పునది వినుము. నామరూప క్రియలతో గూడిన యెఱుకను వదలిపెట్టుము. ౧_౨౫.

కం॥ అంతటఁ గలదీ యెఱుకని । యెంతో వాదిం పుచుం
దురెఱుఁగని వారల్ । ఇంతట నంతట, గనుపడు । నంత టదే
కానియెఱుక యంతగఁ గలదా ♦ అదనిజమైతే నగుపడ వల
దా ♦ అంతట గలదొక్క యచల మెగా నెఱుక । యంతటగ
లదని యనరాదు వినరాదు. అంతటఁ గలదా ♦ అదినిజ మై
తే నగుపడవలదా॥ ౧_౨౬॥

తా. ఎఱుకయెల్ల చోట్లనిండియున్నదని, బుద్ధిహీనులువాదింతురు ఎఱుక యక్కడక్కడ నుండునట్లు కనుపించి మాయమై పోవునదే

గాని, స్థిరముగానుండునది గాదు. నిజముగానె నిండియుండిన యెడల కంటికి కనబడవలదా; కావున ఎఱుక యంతట నిండి యున్నదనుమాట నిజముగాదు. నిండి యుండునది యొక్క పరిపూర్ణమే యని నెఱుగుము. ౧౨౬.

కం॥ బయలాకస మని కొందఱు। భయపెట్టెద రందువలన భయపడకుసుమీ। బయలందు శబ్దమున్నను। బయలాకస మని నమ్మంబడును నీచేత♦శబ్దము లేదీ భ్రమ యందుచేత బయలాకసము గాదు పరిపూర్ణ మనినమ్మి। నయముగ నెఱుకను నమ్మక విడిచి పోఁబడును నీచేత ♦ శబ్దము లేదీ భ్రమ యెందుచేత॥ ౧౨౭॥

తా. కొందరుమనుష్యులు పరిపూర్ణమునాకాశమని జెప్పుదురు. దానినివిని నీవు భయపడవలదు. ఆకాశమే అయిన యెడల శబ్దముండవలదా పరిపూర్ణమునందు శబ్దమేమైన యున్నదా, లేదు. కావున పరిపూర్ణము ఆకాశము గాదు. ఆభ్రమను వదలిపెట్టుము. పరిపూర్ణమునే నిజమనినమ్మి ఎఱుకనువదలి పెట్టిన యెడల ఆభ్రమ తనకు దానే పాఱిపోవును. ౧౨౭.

కం॥ కలమేల్క లెఱుక బయలుల। కలసామ్యముచేసి చూచు నీభ్రమ తొలగున్। ఫలమేమి పెక్కుచదువుల। వలనను జపయోగ యోగ వ్రతములవలనన్ ♦ శమదమ మఖశతముల వలనన్ ♦ తలక్రిందుగాఁబడ్డతనువునఁ గానన్ను। కల మేల్కనిన తానెక్కడ నిల్వదట్టులే వ్రతముల వలనన్ ♦ శమదమ మఖశతములవలనన్॥ ౧౨౮॥

తా. ఎఱుకను, కలయును పరిపూర్ణమునకు మెలకువనున్న ఉపమానములుగా గ్రహించిన యెడల నీకు అంతయు విశదమగును. నీభ్రమలన్నియు నశించును. పెక్కుశాస్త్రముల చదువుట వల్లను, జపములు సల్పుటవలనను, అగ్నిష్టోమాదిక్రతువులు చేయుటవల్లను రాజయోగాది యోగాభ్యాసముల వలనను; అనేకమైన వ్రత నియమాదులవలనను, శమదమాదులవలనను (సకలేంద్రియ నిగ్రహము వలనను.) నేమియు ఫలము లేదని దెలిసికొనుము. నూరు యశ్వమేధయాగములు జేసినను

ఫలము లేదు. నీవు యెంత జేసినను దేహము నీవు గానేరవు. కలయందు కన్పించునవి మెలకువయందు కనబడక మాయమై పోవునో యట్టులే పరిపూర్ణమును దెలిసికొన్న తరువాత దేహము మొదలగునవి మాయమై పోవును. ౧౨౮.

కం॥ నీకలలో నిను నన్నును । లోకుల లోకములఁ జూచి లోపల భ్రమచే । నాకరుణ వడసి మెలకువ । చేకొని కలకల్లఁ జేసి చేరెద వెటకో ♦ సర్వమునీతోఁ జేరును నెటకో ♦ ప్రాకట ముగబట్ట బయలెఱుక లీరీతి । నీకుఁ దెలిపిన వెనుక నిలువక వే వేగఁ జేరే వెచ్చటికో ♦ సర్వము నీతోఁ జేరును నెటకో॥ ౧౨౯॥

తా. నిన్నును, నన్నును ఈలోకమును, లోకము నందలి జనులను జూచి మనస్సునందు కనబడునవంతయు నిజమని భ్రమజెందియున్నావు. ఇదంతయు కలలోని వాటివలె కలయని నెఱుగుము. నాదైన కటాక్షము వలన నీవు వీటిని కల్లగా నెఱుంగుదువు నీవు తరువాత యేమయ్యెదవు మాకు [అనగా జ్ఞాని అయ్యెదవు.] బయలెఱుకలను దెలిసికొన్న తరువాత నీ వెక్కడికి పోయెదవు చూడుము. ౧౨౯.

కం॥ హరి కరనఖ ముఖ విదళిత । కరిమస్తక గళిత మైనఘన మౌక్తికముల్ । దొఱికిన నెఱుకలు గురిబలె । ధరియింతురు రెంటి వెలలు తమ రెఱుఁగ లేక ♦ అట్లనే బోధ క్రమ మెఱుఁగ లేక ♦ పరిపూర్ణ బోధను నెఱిఁగింపు చుందీయా । యెఱుక కోం దెఱుమఱిఁగేది మర్మము తమ రెఱుఁగ లేక ♦ అట్లనే బోధక్రమ మెఱుఁగ లేక॥ ౧౩౦॥

తా. సింహముయొక్క కాలిగోళ్ళ చేత చంపబడిన యేనుగులయొక్క కుంభస్థలముల నుండి జాఱిన ముత్యములను ఎఱుకల వాండ్రు సాధారణపూసల మాదిరి ధరింతురు వారికి కుంభస్థలములోని ముత్యముల యొక్క విలువ దెలియదు. అలాగె పరిపూర్ణమునకును ఎఱుకకును గల భేదమును మందబుద్ధులెఱుగజాలరు. ముత్యములు యెటులయితే నిజముగా వెలగలిగిన దయ్యు, ఎఱుకలవారికి దాని నాణెము దెలియదో అట్లే పరిపూర్ణ బోధ నిజము యినదయ్యు బుద్ధిహీనులకు దాని యొక్క యథార్థత దెలియదు. ౧౩౦.

కం॥ తనువో బహిరింద్రియములో । మనసో ప్రాణములో వి
షయనుమతో నేనం । చనినీవనియదియిదియని। యనుమానిం
చెదవదేలయది త్రోవగాదు ♦ నీవెన్నడునిదివిన లేదు♦వినువిశాప
రిపూర్ణముగని లేనియామీఁది। తనువధికములేదని గురువుచేఁదె
లియుమిది త్రోవగాదు ♦ నీవెన్నడు నిదివిన లేదు॥ ౧౩౧॥

తా. నేను నేను అని యహం భావమును జెందియుండునది యే దియనిదలంచెదవు. అయ్యది, శరీరమా, లేక కర్మేంద్రియ పంచకంబా, లేకమనసేనా. లేకప్రాణములా, లేకవిషయములా, మనస్సునందు సంశయమునువిడిచి చెప్పుము నేజెప్పెదను వినుము, ఇప్పుడు జెప్పిన వాటిలో అదేదియుగాదు. పరిపూర్ణమును దెలిసికొని, యటు పిమ్మట నీదేహాదికములు యెక్కుడు కావని దెలిసికొనుము. ౧౩౧.

కం॥ నినువను బ్రపంచమును నిజ। మనియెఱిఁగెడు నెఱుక
చేత సచలమును గనుం। గొనినను జగమని యెఱిఁగెడి। యె
ఱుకను తక్షణమె మాను మిద్ధవివేక♦ చాలునీ క్రమమెఱుఁగు
దాక♦నినునన్ను పై రెండింటిన విశ్వము బయ। లనరాదు
న్నదని గుర్తు లేకుండు నిద్ధవివేక ♦ చాలునీ క్రమ మెఱుఁ
గుదాక॥ ౧౩౨॥

తా. పరిశుద్ధమైన నవివేకముచేనో వాడా (శిష్యునిసంబోధనము) నిన్నును, నన్నును, ఈలోకమును, నిత్యమైనవిగా నెంచు నెఱుకచేత పరిపూర్ణము నెఱుగుము. మనల నందరిని నిత్యములుగానెంచు నెఱుకను వదలిపెట్టుము మనలను, నీజగమును బయలనరాదు వాటిని నిత్యమని జెప్పుటకు గుఱుతు యేమియు లేదు. ౧౩౨.

కం॥ ప్రాతస్సన నిద్రనమేల్కని। సద్దికినే తెంచిగురుని వక్త్రి
జనితమౌ। సుద్దులు ప్రమోక్కవినుము ప। ప్రాక్తవి బలము
ద్రుసుమ్మి పుట్టిందులకు♦గురుచరణము పట్టి నందులకు ♦ నిద్ధ
మౌ భక్తిచే నివిట్లు చేసితె। దిద్దితిప్పి నబోధ తెఱఁగు చూపు
ను నీవు పుట్టినందులకు ♦ గురుచరణము పట్టినందులకు॥ ౧౩౩॥

తా. శిష్యా, సూర్యోదయంబునకు మునుపే లేచి సద్గురుని పాలికింబోయియతనికి నమస్కరించి, వారినోటినుండిజారు ప్రతివాక్యమును

న్ను శ్రద్ధాసక్తులతో నాలకింపుము. నీవీనరజన్మమెత్తి నందులకు, నే వేళనయితే నీవు గురు శుశ్రూష సేయుచుందువో ఆసమయమే మిగుల మేలైనదని దెలిసి కొనుము. నీవుగురుచరణార విందంబుల భక్తితో నాశ్రయించితివేని నీకాంతను మేలైన బోధను నుపదేశము జేసి నీజన్మమును సార్థకంబుగ జేయును. ౧౩౩.

కం॥ గురుఁడు పరిపూర్ణమునుజా। పెఱుకే లేదనుచుఁ దె
లిపి యిఁకదలపకుమిం। చెత్తిఁగించకవిడిపోవునె। యెఱుక స
రుల్ సాధనముల నెన్ని చేసినను ♦ లక్ష్యముముద్రలెన్ని చూచి
నను ♦ హరి హర బ్రహ్మసురాసుర ముఖులైన। ధరణీసురాద్య
ష్టాదశ జాత్యు ద్భవులైన నెన్ని చేసినను ♦ లక్ష్యము ముద్రలె
న్ని చూచినను॥ ౧౩౪॥

తా. పరిపూర్ణమే నిత్యమైనదనియు, ఎఱుక కలదనియు నీవు గురుముఖముగా నుపదేశము జెందని యెడల నీవా యెఱుకనువదలి పెట్టనేరవు ఎందుకును గురు వుండుట కర్తవ్యము బహువిధ సాధనములు చేసినను లక్ష్యముద్రలన్నిటిని గనినప్పటికిని, శివుడు విష్ణువు, బ్రహ్మదేవతలు రాక్షసులు మొదలగు వారలు, బ్రాహ్మణులు మొదలగు పదునెనిమిదివర్ణముల వారు వీరిలో నెవ్వరైనను, గురువుయొక్క యుపదేశములేక యెఱుకను విడువ జాలరు. ఎటువంటి వారైనను, ఎన్నెన్ని సాధనములు జేసినను, గురువులేక యెఱుకనువిడుచుటనసాధ్యము. ౧౩౪.

కం॥ బలధన విద్యా ధైర్యం। బులుచక్కదనంబు సత్త్వ
బుద్ధ్యాదులిలం। గలలోనివిలేనిమను। ష్యులజగమును దినను
దానుజూచి మానవుఁడు ♦ మేల్కనెనేని చూడలేఁ డొకఁడు ♦
కలమేల్కలెఱుక బయలుల కట్లజతెగూర్చి। కలయెఱుకల దేశి
కులచే వీడితెచాలు చూచి మానవుఁడు ♦ మేల్కనెనేని చూ
డలేఁడొకఁడు॥ ౧౩౫॥

తా. శిష్యా, శరీర సంపత్తియు, ధనము, విద్య ధైర్యము. రూపసంపత్తి, సత్యగుణము మేలైనబుద్ధ యివి యంతయు కలయందు కనబడువారివలె నిజమైనవి కావని యెఱుంగుము. పరిపూర్ణజ్ఞానమును గని జాగ్రత్త యందుండువానికి నివన్ని గనబడవు. కల మెలకువల కేలాటి

సంబంధము గలదో ఆలాటి సంబంధమే యెఱుకకును బయలునకును అనియెఱుఁగుము వీటిలో స్వాప్నోపమంబైన యెఱుకను గురువనుగ్రహమున వదలి పెట్టుటయే మంచి మార్గమని యెఱుంగుము. ౧౩౫.

కం॥ ఈపటిబట్టబయలును।నీవిప్పుడు నుండఁజూచి నిజము
గనెఱుక। న్నీవనినేఁనిజగమని । భావింపుము విడవదీనిబాయు
మనిశముఁ ♦ ఏవఁటికుమీనీవహర్నిశముఁ ♦ శ్రీవనితాశార
ద జీవసంభవభవ । దేవేంద్రాదులనింక సేవించతలఁపేలబా
యుమనిశముఁ ♦ ఏమఁటికుమీనీవహర్నిశముఁ॥ ౧౩౬॥

తా. ఈనిర్మలమైన బరిపూర్ణమును నీవిప్పుడు నిజమని కనుగొంటివిగదా, నిన్నును నన్నును, ఈజగమును యెఱుకయని దెలిసికొనివాటినివదలి పెట్టుము. బ్రహ్మలు విష్ణుమహేశ్వరులనుగాని, గౌరీలక్ష్మీసరస్వతులను గానియు పూజింప వలయుననుఁనభిలాషను నింక నుంచుకొనకుము అనగా సగుణ ధ్యానము గూడదని భావము. ౧౩౬.

కం॥ లేదనకుమున్నదిదిగో। నేఁదెలిసితినవకు దీనిఁ వెతిఁగె
దవా । కాదది నీచేదెలియను। ఏదిర సన్మాత్రసమితి యీబట్ట
బైట ♦ దీనికిసాటి యేదియెఁచ్చోటా♦ వాదేలనికి యెఱుకతో
దీని కనిపెట్టి । పోదోలు మెఱుకని కేవిబట్టదుచాలుయీబట్టబై
ట ♦ దీనికిసాటి యేదియెఁచ్చోట॥ ౧౩౭

తా. పరిపూర్ణమును లేదనిచెప్పకుము ఇదిగో నేను జూచుచున్నాను నాకంతయు దెలిసినదని చెప్పకుము నీకది దెలిసి కొనుటకు సాధ్యముగాదు. దానికి పంచ తన్మాత్రలు లేవు. ఎఱుకచేతనే యీపరిపూర్ణమును దెలిసికొని ఆయెఱుకను పాఱదోలుము. అట్లుచేసిన యెడల నిన్ను సుఖదుఃఖము లేవియు పొందవు.

వి. శబ్దస్పర్శరూపరసగంధాదులు పంచ తన్మాత్రలు. ౧౩౭.

కం॥ కనవచ్చునదిట్టిదని । యనరానుంచునదిబయలు నదె
కనుఁగొనుమీ । కనరాకపో తెశూన్యం । బనుమిట్టిది యట్టిద
నుచుఁబలుకవచ్చినను ♦ నెఱుక యూఁగోపలికిఁబొచ్చినను♦విను
మాబయిటను నీవేమనిన నొప్పెదగానొ । ప్పను నీమాటను నేఁ

జెప్పిన రీతిఁ గపరాగఁ బలుక వచ్చినను ♦ నెఱుకయాలోపలికిఁ
జొచ్చినను॥ ౧౩౮॥

తా. బాగుగా కనపడునదియు యిటువంటిదని జెప్పుటకు నలవి కానిదియునైనదే పరిపూర్ణమని యెఱుంగుము దానిని యిదిగో జూడుము నీకు తెలియక పోయినయెడల దానిని లేదనిజెప్పుము, పరిపూర్ణము నిట్టిదనిజెప్పుటకు సాధ్యము కాదనియైనను లేక యెఱుక పరిపూర్ణమునందు జొఱబడెననియైనను జెప్పినయెడలనేనునమ్మను, ఇంకదేనినైనను నమ్ముదునుగానిదీనినిమాత్రము నమ్మను. ౧౩౮.

కం॥ కనవచ్చు బయలులేదని । యనవచ్చునె యిట్టిదట్టిద
నవచ్చునెఛీ । యనరాదెఱుకను నెన్నఁడు । గనుకనె నీబయలు
నెల్లకాల ముంచుందీ ♦ దీనం దెఱుకే కాలములేందీ♦వినుము
లేనెఱుకనువివరింపశూన్యమై ।యనుమానమేయెఱుకగనువిశ్వ
మిట్టిదేకాలముంచుందీ ♦ దీనందెఱుకేకాలము లేందీ॥ ౧౩౯॥

తా. బాగుగా కనబడుచుండు నట్టి పరిపూర్ణము నేలాగు లేదని జెప్పవచ్చును. పరిపూర్ణము గానంబడుచున్నను యిట్టిదని జెప్పుటకు సాధ్యంబుగాక యున్నయది. లేదుపో యెఱుకయే నిజమని చెప్పుదువా ఛీ. అట్లు జెప్పనే కూడదు. కావున నీ పరిపూర్ణము నిత్యము, శాశ్వతము, సర్వకాలములయందును నుండునది. దీనియం దెఱుక యేకాలమునందును నుండదు. బాగుగా విచారించి జూచినయెడల యెఱుక లేనిదిగా నేర్పడును. అనుమానమునే యెఱుకయని దెలియుము. ఈవిధముననే విశ్వమంతయు పరిపూర్ణమందు లేదనియు, నిజముగాదనియు దెలియ వలయును, ౧౩౯.

కం॥ పరిపూర్ణమనిన నెట్టిదో । యెఱుకెఱిఁగిన నెఱుకబైటి
కేగిన నెఱుకే । యెఱుకకుశూన్యంబయ్యెను। నెఱుకనుజన్మించి
నట్టియావిశ్వమంత ♦ యెఱుకావలనేమి లేదంత♦ యెఱుకయుం
డఁగానె యెఱుక విశ్వము లే । నెఱుకకేయివిచూడ నెంతోవిం
తైతోఁచు నీవిశ్వమంత ♦ యెఱుకావల నేమిలేదంత॥ ౧౪౦॥

తా. ఎఱుక పరిపూర్ణమును దర్శించిన వెంటనే, పాఱిపోవును, అట్టి దర్శించినయెఱుక తానుశూన్యమని తెలిసికొనును. ఎఱుకే పోయినత

రువాత నాయెఱుక వల్లనే జననమొందిన విశ్వమంతయు శూన్యమే నని చెప్పవలయునా, యెఱుకకు, పరిపూర్ణమును దెలిసికొనుటకును పై తానును, విశ్వమును తనకువింతలుగాను నిజమైనవిగాను దోచు చుండును. ౧౪౦.

కం॥ గురుమూర్తి చూపకున్నను । బరిపూర్ణంబెట్లుతనకుఁ బ్రత్యక్షమగుర । గురుమూర్తి చూపెనేనియుఁ। బరిపూర్ణము తనకులెస్స ప్రత్యక్షమౌరా ♦ చూచితెయెఱుక పాఱిపోవును రా ♦ యెఱుక పోయినవెనుక నెదిరా ప్రత్యక్షము । యెఱిగిట్టి దట్టదంచెఱుఁగు వారటు మీఁదఁ బ్రత్యక్షమౌరా ♦ చూచితే యెఱుక పాఱిపోవునురా॥ ౧౪౧॥

తా. ఎఱుకకు సద్గురూప దేశము లేనియెడల పరిపూర్ణమేలాగు బ్రత్యక్షమగును [ అనగా కాదు ] సద్గురు కటాక్ష మందినయెడల పరిపూర్ణమును దెలిసికొనును. పరిపూర్ణమునుగాంచినక్షణమే యెఱుక పారిపోవును ఎఱుగునట్టి యెఱుకపోయిన వెనుక పరిపూర్ణము నిట్టిదని జెప్పుటకు నెవ్వరును లేరు. ౧౪౧.

కం॥ పరమపదమునఁగ బయలన । గురుగుహ్య మనంతమని న గోప్యంబనిర । బరిపూర్ణ మచల మనినను । తిరమనఁగా బట్టబయలు తెలియు మాయప్పా ♦ తెలిసినయా తెలివి మానప్పా ♦ యెఱుక నెఱిఁగినదాని నెఱుక మీఱినదాని । నెఱుక మఱుపులు లేని పరవస్తువన బయలె తెలియు మాయప్పా ♦ తెలిసిన యాతెలివి మానప్పా॥ ౧౪౨॥

తా. పరమపదము, బయలు. గురుగుహ్యము, అనంతము. గోప్యము పరిపూర్ణము, అచలము. అను నీపేళ్లన్నియు బయలునకు పర్యాయనామములుగా గ్రహింపుము. వీటిని భేదబుద్ధితో నెఱిగిన వివేకమును వదలిపెట్టుము. ఎఱుకను నెఱిగినదియు. నెఱుకను మించినదియు. నెఱుక మఱపులు లేనిదియునైన యా యుత్కృష్టవస్తువే పరిపూర్ణము.

కం॥ బట్టబయలనుచు దీనికి। మొట్టమొదల్ పేరులేదు ముదమున నెఱుకే । పుట్టియుఁ బేరిడెదీనికిఁ । బట్టుకలవ్వాడె లేక పాఱిపోవురా ♦ కనరాదింక దూరు నేరదురా ♦ పుట్టిచచ్చు

చుమళ్లి పుట్టిగిట్టుచునుండు । నిట్టితిప్పలునొందక దెఱుకే బయ
లును జూడఁ బొతి పోవునురా । కనరా దిందు దూర నేర
దురా॥ ౧౪౨॥

తా. మొదట పరిపూర్ణము కా పేరు లేదు. అది ఎఱుక పుట్టిన తరువాత నెఱుక పెట్టినపేరు. అట్టు నామకరణంబు చేసినదయ్యు, పరిపూర్ణముకడ నిలువజాలక పరుగిడు చున్నది. ఎఱుకకంటెకి గానరాక, పరిపూర్ణమునందు జొర నేరకయు, జనన మరణావస్థలం దేలుచుండును. పరిపూర్ణమును గనిన యెడల నే యవస్థలు లేక నాశము జెంది పోవును. ౧౪౩.

కం॥ వినుమా నేనని యెత్తిగెడి । తనువందున లేక బయ
లుతానిండి నదా । గనుఁగొను మదిగనుఁగొనియా । తనువు
నువిడనా మనుమింత తడవేలనోయీ ♦ యీపనికింక గడు వేల
నోయీ ♦ అనుమానముంచె మాయనఘులొ శివరాము । ల
నుదీక్షితులు చేసిన యచలగ్రంథమునందు నరిచూడవోయీ♦
యీపనికింక గడువేలనోయీ॥ ౧౪౪॥

తా. నేను నేనని యహంభావమును వహించు శరీరము లేవి యుపరిపూర్ణము నందు లేవని దెలిసికొనుము. అయినప్పటికిని పరిపూర్ణమునిండియున్నది. పరిపూర్ణములో లేనిశరీరమును త్యజించుము. ఈ కార్యమున కేమియు నాలస్యము సేయుతగదు. నీకేమైనను సంశయముండినయెడల. నాగురుండైన శివరామదీక్షితకృతమైన యచలగ్రంథమును జదువుము. నీసంశయములెల్ల బాయును. ౧౪౪.

కం॥ దేహాకారము గానిది । యాహం భావంబులేని య
ఖిలజనులుదా । సోహంసోహంబనినను । మోహముఁజెందనిది
బయలు మొదలెఱుఁగ వలెరా ♦ యెఱిఁగిన యెఱుక తుదకరు
గవలెరా ♦ కోహంకస్త్వంబనికూతలు గూసెడి । దేహి దేహ
ములని దెలియనిదీబయలు మొదలెఱుఁగవలెరా♦యెరిగినయె
ఱుకతుదకరుగవలెరా॥ ౧౪౫॥

తా. పరిపూర్ణమునకు శరీరరూపమువలె లేవియులేవు. అహంభావమును వదలి [తనువుమీదియాశనువదలి] పరిపూర్ణమునుదాసోహ

మ్మని జెప్పినను నేనునీకు దాసుడను♦ పరిపూర్ణము సంతోషముకొం
చెమేనియు బొందదు. ౧౪౫.

కం॥ ఏవస్తువుచేతనుదా । నావిర్భవమొందు దేహ మనుత
రువరయగ । ఆవస్తువె దానికివి । త్తై నెలయును దాన్నెసాక్షి
ద్రష్టనిగనుమీ♦ యెఱుకైతే స్పష్టమువినుమీ ♦ భావించిచూ
డుమీ బట్టబయలును భూమి । యావిత్తుచెట్టున్న దరయవిత్తనే
ద్రష్టను గనుమీ ♦ యెఱుకైతే స్పష్టమువినుమీ॥ ౧౪౬॥

తా. దేహమును చెట్టునకు విత్తన మయినది అంగా కారణ భూతమైనది ద్రష్టయని దెలిసికొనుము. దేహమున కెఱుక కారణము. ఎటులనైతే భూమి చెట్టు విత్తనముల నెఱుగదో నట్లె పరిపూర్ణమును దేహమెఱుకల నెఱుగ జాలదు. ౧౪౬.

కం॥ ఏపరిపూర్ణము మేనికి । లోపలవెలి నిండియుండు లో
పము లేకగ । ఆపరిపూర్ణమెజగతికి । లోపల వెలినిండి దా
నిలోనే యున్నదిరా ♦ పయిరెండెవ్వి లేని వెన్నకురా ♦ యీ
పూర్ణ బోధచే పైప్రపంచ శరీర । రూపము లెడ బాపు మీ
పట్లనె దానిలోనే యున్నదిరా ♦ పయిరెం డెవ్వి లేని వెన్న
కురా॥ ౧౪౭॥

తా. ఏపరిపూర్ణమెతే శరీరమెల్లను బైటనువ్యాపించియున్నదో ఆ పరిపూర్ణమే ఈజగత్తుయొక్క లోపలను బైటను నిండియున్నదని దెలిసికొనుము. పై జెప్పబడ్డ శరీర ప్రపంచములు రెండును లేనివని దెలిసికొనుము. వాటిని గణన సేయకుము. పరిపూర్ణ జ్ఞానము గలిగిన బిదప శరీర ప్రపంచములు లేకపోవును. ౧౪౭.

కం॥ ఎఱుకనగా నెఱుఁగుటమఱి । మఱుపనఁగా నెఱుకలిన
నుపటుచుట యీరెం । డెఱుగనిదే బయలనని । వెఱినెఱుకను
మఱుపుమిప్పు డెఱుకచే విడరా ♦ విడిచితె పైమాటుత్రేఁగె ద
వ్వేఁడురా ♦ యెఱుకే పరిపూర్ణమని యెదిరించి వదిలేవు । పరి
పూర్ణమెతెచూపర బయలందలిదాని నెఱుకచే విడరా ♦ విడి
చితె పై మాటుత్రేఁగె దవ్వేఁడురా॥ ౧౪౮॥

తా. ఎఱుకయనతన్నును నీసకలవస్తు ప్రపంచమును దెలియునది

మఱుపన నట్లు దెలియకుండుట. ఈగ్రంథమును దెలియుటయే పరిపూర్ణము. ఎఱుక మఱుపులను నెఱుకచేత నే వదలి పెట్టుము. అట్లువదలిన పిదప నెఱుగువారెవ్వరును లేరు ఎఱుకనే పరిపూర్ణమని జెప్పఁదువేవి యెఱుకను పరిపూర్ణమునందు జూపుము. ౧౪౮.

కం॥ లేదన్నను గనఁ బడుగద నేదెలిసెద నన్న బయట నేని లదుగదా। నేదీని వెనుక గదనా। కేదో మూలంబిదేగ నిఁక లేదెవ్వోటు ♦ గనుకనుఖ్ఖక్కెనను మాట♦ సకలవస్తు విషయసాక్షిత్వ ములకుదా। నొక రూపమై యుంట నూహింపుమను భ్రాంతి యిఁక లేదెవ్వోటు♦గనుక నుఖ్ఖక్కెననుమాట॥౧౪౯॥

తా. పరిపూర్ణము ప్రత్యక్షముగా గనబడుచున్నదిగాన దానిం లేదనిజెప్పుటకు వీలులేదు. నేను దెలిసికొనెదనని యున్నయెడల, నేను అనునది పరిపూర్ణమునందు లేదు. నే నను నహంభావము పరిపూర్ణమునకు వెనుక వచ్చినదాను. నాకు కారణంబైనది యిదియేగాని మత్తేదియుగాదు కావున నేను అనుమాట యబద్ధపుమాటగా నెఱుంగుము. ఎఱుకను లేదనిజెప్పినను గనబడుచున్నది. నేను నెఱుకను దెలిసికొనెదని జెప్పినయెడల, అది పరిపూర్ణమునందు లేదు. నేను అను నహంభావము యెఱుకను పిదప గలిగినదేగదా. నేను అనుదానికి మూలమైనది యీ యెఱుకయేగాని వేఱుగాదు. కావున నట్లు నేను దెలిసికొనెదనని జెప్పుమాట నిజముగాదని దెలిసికొనుము. ఎల్లవస్తువిషయ సాక్షిత్వములకును నొక రూపము నుండు పరిపూర్ణమును జూడుము. ౧౪౯.

కం॥ సత్యమగు బట్టబయలున। సత్యంబగు నెఱుక నెఱిగి సద్గురు కృపచే। సత్యముగాదని నెఱుకను। సత్యముగానమ్మి యుంటె చాలుచాలన్న ♦ వానితోటిసాటెవ్వరన్న ♦ నిత్యానిత్యములయొక్క నిర్ణయమెఱిఁగి। నిత్యుండై యుండెడు నిజబోధగలిగితే చాలుచాలన్న ♦ వానితోటిసాటెవ్వరన్న॥ ౧౫౦॥

తా. శిష్యా, పరిపూర్ణమును నిజమైనదిగాను, యెఱుకను నబద్ధమైనదిగాను సద్గురు కటాక్షముచే దెలిసికొనుము. ఎఱుకనిజము కాదని దెలిసికొనినయెడల చాలును అట్లు తెలిసికొనిన వానికిసరియైనవారు యెవ్వరును లేరని దెలిసికొనుము, ఎయ్యదినిత్యమో యేద యని

ట్లయెఱుకన్న విపరింతుఁదత్త్వాలు । మనసంమగట్టిగ మఱువకునీ
మాట తగనొంతియనిన ♦ గుండలిభూతతతిజాగ్రతనిన॥౧౫౩॥

తా. అట్టిపరిపూర్ణము నెఱుకేకనుగొనుచున్నది. ఆకాశమునకు పరిపూర్ణమునకు భేదమున్నది, అవిరెండును నొకటిగాదు. మనశరీరము కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల యొక్కసమూహమేయనియు, జాగ్రత్తనూర్ధకుండలి యొక్క పైకిలేచుటయేయనియు జెప్పెదరు. అట్లే యెఱుక తత్త్వములనియెఱుంగుము. దీనినిమరచిపోకుము. ౧౫౩.

కం॥ పొరనరఁటిదుంపయనినను। దరువులు ధనమనినరవలు
ధారుణియనిన ।గిరియన్న రాళ్లుగుట్టలు ।ధరణిక్షిముళ్ళనిన ద
త్త్వ తతియెఱుకంచనిన ♦ నెఱుకనుస్థితిలెస్సఁగనిన♦ నెఱుక చే
సిన విశ్వమెఱుకవంటిదెబయలు। నెఱుకగు రైతిఁగి తానెఱిఁగితే
నరితత్త్వతతియెఱుకంచనిన♦ నెఱుకనుస్థితిలెస్సఁగనిన॥ ౧౫౪॥

తా. సారతీగయన్నను, నరటిచెట్లన్నను వృక్షములే యగుచున్నది రవలుమొదలగు విలువగల వస్తువులు ధనమునకు సమానములుగాను న్నవి. కొండయనినను, గుట్టయనినను రాలవిశేషమే. అట్లేతత్త్వములసమూహము యెఱుక యగుచున్నది. ఎఱుకను బాగుగా దెలిసికొని, ఆయెఱుక చే గలిగిననీవిశ్వమంతయు నెఱుకగా నెఱుగుము. అట్టియెఱుక చేతనే బరిపూర్ణమును నెఱుగుము. అదియే సరియైనపద్ధతి. ౧౫౪.

కం॥ పెనుమాయనుజూడుము ఇదె।జనకుని జఠరంబువలన
జననీగర్భం।బునఁజొచ్చినూఱుఱూపున। జనియించునునవయవ
ములు జనితమైభువిని♦ వినఁగనఁదిన మూర్ఖొనవచ్చెనని♦దిన
దినమభివృద్ధాపీనిచేబయలును । గనియూమాయల మలగద
మాయించుముపోనీ జనితమైభువిని వినఁగనదిన మూర్ఖొన
వచ్చెనని॥ ౧౫౫॥

తా. తండ్రియొక్కకడుపుచిచ్చునందు రేతస్సురూపముననుండిజనని గర్భమునంబ్రవేశించి, అవయవాది విశేషములను బొంది శిశురూపమున భూమియందుపుట్టును. అట్టిపుట్టినదైక్రమేణవినుటకును, చూచుటకును నేర్చుకొనును, తరువాతనందరు దానిని ముద్దిడుదురు, ఇట్లుదినదినమునకు నాశిశువు పెరిగి బాల్య కౌమార యౌవన వార్ధక్య

ములను జెందును, ఈ వింతను జూచితివా. ఇదియె పెద్దమాయ అట్టి శరీరము చేత, గురుసాహాయ్యంబును పరిపూర్ణంబును దెలిసికొని మాయా రూపంబైన శరీరమును వదలిపెట్టుము. ౧౫౫.

కం॥ పెట్టియలోపలిగారడి। చెట్టుపయిన్ గానవచ్చిచెట్టని
చూడన్।గట్టుపయిం దోంచునిదికను।కట్టుసుమీదీనివలెనే గనుపిం
చునెఱుక♦ అంతలోనెచటంగనుపించదెఱుక♦దిట్టమాబోధచేప
ట్టి యెఱుకనుతిరిగి। పుట్టకుండంగ దానిపట్టిముంనుము లేనిదేగ
నుపించు నెఱుక♦ అంతలోనెచటంగనుపించదెఱుకా॥ ౧౫౬॥

తా. గారడివాడు,నొకనొకవస్తువునొక పెట్టెలోనుంచును. మరలనావస్తువును జూడబోయిన నాపెట్టెయందు గనబడక నొకవృక్షముపైనుండును. మరల కొంతసేపటికి నొక గట్టుపైనుండును. తరువాత కనబడకనే యుండును. ఇది యంతయు కనుకట్టువిద్య. ఇదేవిధమున నెఱుకగూడ నొకవేళ కనుపించి మరియొకప్పుడు కనుబడక యుండును. ఈ పరిపూర్ణబోధను నెఱింగి ఆయెఱుకచేతనే పరిపూర్ణమును దెలిసికొని యెఱుకను వదలిపెట్టుము. ఎఱుక నిజముగా లేకయేనొకచోట కనబడియు నొకచోటకనబడకయునుండును కావున దానిసమూలముగా ద్రుంచి ముంచివేయుము. ౧౫౬.

కం॥నేననని బ్రహ్మలోపల। లేనిదిసంభవమునొందిలీలంబసకు
దా। మేనుజగములై వలసెను। నేనదిమృగజలమురీతినిజముగా
దనుచు♦ లోకులనెడుగజిబిజివినుచు ♦ మానసమున వారిమాట
కామోదించి। దానికిబోధను దగునంచువినం జేసితినిజముగా
దనుచు ♦ లోకులనేడుగజిబిజివినుచు॥ ౧౫౭॥

తా. నేనునేను అనిజెప్పునటువంటి [అనంగా అహంకారము లేనటువంటి పరిపూర్ణమునందులేని యెఱుకపుట్టి తాను శరీర ప్రపంచరూపములుగా పరిణమించెను. నేననెడు నహంకారము, యెండమావులవలె నిజముగాదని తెలియుము. లోకులు ఇష్టము వచ్చినటుల మాటలాడుచుందురు, నీవువారిమాటలను వినకుము. నిన్నువారిమాటలనువినకుండ జేయుటకును, నిజమైన మార్గమును నీకు దెల్పుటకును, నీపరిపూర్ణబోధను జేయుచున్నాను.

నున్నది యనిపరిపూర్ణమును, తన్ను (ఎఱుకను,) నబద్ధమనియు నెఱుక యెఱుగుటయే మోక్షము. తరువాత దెలియబడు. పరిపూర్ణమును నేనెట్టిదని చెప్పుదును, నాజెప్పినమాటను రాత్రింబగళ్లు దృఢమైనమన స్సుతోనమ్మియుండుము.ఇదియేసరియైనమార్గమనియెఱుగుము. ౧౬౦.

కం॥ఎఱుఁగననుటయును నెఱుకే। యెఱుంగుదుననితన్నుఁ బరుల నెఱుఁగుటయెఱుకే। యెఱుక నెఱుంగుదునని తా। నెఱుఁగుచు నుండునది యెఱుకె సరుపమబుద్ధి♦నీ వెఱుఁగుటనిగమప్రసిద్ధి♦గురు మంత్రమని యెడు గొడ్డలితోడ నీ। యెఱుకరుండు వేరు నెఱిఁగి త్రవ్వి తేచాలునిరుపమబుద్ధి♦నీవెఱుఁగుటనిగమప్రసిద్ధి॥ ౧౬౧॥

తా. నేను దీనినెఱుగను అని చెప్పునది యెఱుక. నేనన్నిటిని నెఱుగుదునని జెప్పి తన్నును నితరులను దెలియునట్టిదియు నెఱుకే ఓసాటిలేని బుద్ధిగలవాడా; ఎఱుకను నేను దెలియుదునని జెప్పునదియు నెఱుకే. ఈయెఱుకనే వేదములుగూడ ప్రసిద్ధముగా జెప్పుచున్నవి, గురూపదేశమను గొడ్డలితో నెఱుకయను వృక్షమును సమూలముగా తెగగొట్టుటయే సరియైన మార్గమని దెలిసికొనుము. ౧౬౧.

కం॥ ఎఱుకేచదువులఁజేయును। ఎఱుకేవినుజదువునెఱుక ఎఱుకేతిరమం । చెఱిగించును శంకించును। ఎఱుకేకొనకేమిలేక నేగునోయన్న ♦ బయలే చదువు నెఱుఁగదోయన్న ♦ ఎఱుకే యెన్నటికైనఁబరిపూర్ణమున్నదం। చెఱఁగిత్తేలేనని యెఱిఁగితే నిలువక నేగునోయన్న♦బయలేచదువునెఱుఁగదోయన్న॥౧౬౨॥

తా. వేదశాస్త్ర పురాణేతిహాసములకును విద్యల కెల్లనునెఱుకే కారణము. ఎఱుకే చదువును. ఎఱుకేవినును. ఎఱుకే శరీరప్రపంచాదులు నిత్యమని దెలియజేయును ఎఱుకే సందేహములు జెందును. కడపట యెరుక యేమియులేక నశించిపోవును పరిపూర్ణమున కేలాటి చదువులును దెలియవు. అదివినజాలదు. దానికి యేలాటి సందేహములును లేవు. అట్టి పరిపూర్ణమును దర్శించి తానులేనని యెఱిగిన తోడనే యెఱుకనశించును. దీనిని బాగుగా దెలిసికొనుము. ౧౬౨.

కం॥ చూపులలోఁగలవస్తువు। చూపులఁగనువస్తువులుచూపులుచూడఁ। తేపకునెఱుకని తెలియుము। చూపులు లేనట్టి

బయలుచూచెదింకేమి ♦ యెఱుకేలేదుతో చేదింకేమి ♦ దీపము
వలె గనుపాపలలోఁగలవస్తు । వేపరమాత్మనిజాపునీనెఱుకని
చూచేవేంకేమి ♦ యెఱుకేలేమతోచేదింకేమి॥ ౧౬౩॥

తా. చూపులలోనుండునదియు (అనగాగురుతుచే నెఱుగదగి నదియు చూపులుగలదియు) అనగా నెఱుగునదియునైనదియే యెఱుక యని దెలియుము. ఎఱుకనామరూపములతో గూడినదియు, సర్వము ను నెఱుగునదియు ననుట. చూపులు లేని అనగా నెఱుగజాలని పరి పూర్ణమెట్లుయెఱుగగలదు పరిపూర్ణమునందు యెఱుక లేదుకావునదది యెట్లుతోచును. కంటిపాపలయందు దీపమువలెనుండు నాపోజ్యోతియే పరమాత్మ యనియెఱుగుము. ౧౬౩.

కం॥ శతపత్రాప్తునిఁబోడగని । యతిరయమునతిమిరమణఁగి
యగుపడదెట్ల । ట్లతులితగురుకృపగలిగిన । మతిమంతులజూచి
యెఱుక ,మఱినిల్వఁబోదు ♦ సంశయము నీమది నిలుపరాదు
శ్రుతులందుస్మృతులందునితిహాసములయందు । సతతముశ్రమ
పడి వెదకిన నీయెఱుక మఱి నిల్వఁబోదు ♦ సంశయము నీమది
నిలుపరాదు॥ ౧౬౪॥

తా. సహస్రాంశు కిరణములనుబొడగన్నతోడనే యంధకార మెంత త్వరలో మాయమైపోవునో అంతత్వరలో సద్గురుకటాక్షముచే పరి పూర్ణమును గన్నవారినెపుట యెఱుక నిలువక పాఱిపోవును. నీమనస్సు నందన్ని సంశయములను విడువుము వేదములలోను, మనుస్మృతిమొద లగుస్మృతులలోను, భారతము మొదలగు నితిహాసములయందునునీవుశ్ర మపడి వెదకిన యెఱుక యెందును నిలువక పాఱిపోవును. ౧౬౪.

కం॥ ఎఱుకేకోశము లైదును । నెఱుకేభూతములనెఱుఁగునెఱుఁ
గునుసర్వం । బెఱుకేయెఱుక నెఱుంగును । నెఱుకనుగుర్తెఱుఁగ
వేరేయెఱుకయున్నదా ♦ ఉన్నదంటేనరకమేకాదా ♦ నిరతము
గురుసేవపరతంత్రుఁడగుచునాత్మారుణకుపాత్రులై యెఱుకమూ
నినవారి కెఱుకయున్నదా ♦ ఉన్నదంటేనరకమేకాదా॥ ౧౬౫॥

తా. ఎఱుకే పంచ కోశములని యెఱుఁగుము ఎఱుకయే పంచ భూతములను నెఱుగునని దెలియుము ఎఱుకసర్వమును నెఱుగును సర్వ

మును నెఱుంగునట్టి మెఱుకను మెఱుకతప్ప వేరొద్దియు నెఱుగజాలదని దెలిసికొనుము ఎఱుకను దెలియునది వేఱేయున్నదని జెప్పినయెడల పాపము సంభవించును, సద్గురుసేవా పరతంత్రుడై, గురుకటాక్షమునకు పాత్రుడైనవానికి మెఱుక లేనేలేదు. అటుల యున్నదనిజెప్పినవాడు నరకమునకు పాత్రుడగును.

వి. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములన కోశము లైదువిధములు. ౧౬౫.

కం॥ గురుమంత్రముచేనిలువని । మెఱుకనుబరిపూర్ణమును
నెఱిఁగిసిరతము ౯ । ఎఱుకయియుండిన వారల । తెరువిఁకనీకేలవట్టి
దీజోలిమానుఁ ♦ మెఱుక లేనియుజోలిపూను ♦ గురునిచేఁబరిపూ
ర్ణమునసియూతెలిసిన । మెఱుక నెన్నటికి నీ నెఱుఁగకు విందవట్టిదీ
జోలిమాను । మెఱుక లేనియూజోలిపూను॥ ౧౬౬॥

తా. సద్గురూపదేశముచేత, లేనిమెఱుకను, నిత్యమైనపరిపూర్ణమును, దెలిసికొనినవాడయ్యు సదామెఱుకను నమ్మియుండు సజ్ఞానులమాట నీకెందుకు. అదితప్పుమాత్రోవ. ఆత్రోవబట్టకుము. ఎఱుక లేని, యీనిర్మలమైన పరిపూర్ణముయొక్క మార్గమునం జనుము గురుదయచేత పరిపూర్ణమునెఱింగి లేనిమెఱుకను వదలిపెట్టుము. ఎఱుకతో సంబంధించిన వారియొక్క సాంగత్యము నీకువలదు. ౧౬౬.

కం॥ లేనికలదోచినప్పుడు । లేనివిచిత్రంబులన్ని లేకమెతో
చు౯ । లేనికల మేలుకొన్నను । లేనివిచిత్రములు తాను లేకపోవు
నురా ♦ అనుమానము లేదంచువినరా ♦ లేనెఱుక యీరీతిగా నెబయ
లునుజూడఁ । దానుదిమత్రయమువూ నెంచునిలిచుండ లేకపోవును
రా ♦ అనుమానము లేదించువినరా॥ ౧౬౭॥

తా. స్వప్నమునందు, లేనివస్తువులన్నియు నుండునటులో దును. అట్టిస్వప్నమునుండి మేల్కొనిన వెనుక కనబడినవంతయు నిజముగానివిగా గనబడును. అట్లే మెఱుకయందుకనబడునవిమెల్ల నిజముగావని దెలియుము. పరిపూర్ణమును గాంచిన వెంటనే మెఱుకయు సూక్ష్మస్థూలకారణ దేహములతో, స్వప్నము మెలకువ మెదుట పాఱిపోవునట్లు, పాఱిపోవును ఇందులకు సందేహమేమియు లేదు. ౧౬౭.

కం॥ మరణసుషుప్తులఁ జెందిన । పురుషుఁడు మేల్కొనినవాఁడు
భువి తదితరుఁడౌ । పురుషుఁడు కలఁగనువాఁడని । యెఱుఁగుండుము
మొదటియతఁడె మెఱుఁగఁడీ రెంటిన్ ♦ రెండవపురుషుఁడెఱుఁగునీ
రెంటిన్ ♦ ఇరువురొక్కటె సుమ్మి తిరిగి పుట్టుదురిల । గురునిచే
మేల్కొనినఁ దిరిగి పుట్టవే పుట్టఁడెఱుఁగ । డీ రెంటిన్ ♦ రెండవపురు
షుఁడెఱుఁగునీ రెంటిన్॥ ౧౬౮॥

తా. మరణమును, నిద్రను జెందిన వాఁడును, మేలుకొని యుండువాఁడును, అని రెండు విధములు. ఈ రెండును గానివాఁడు స్వప్నము నందుండువాఁడని యెఱుంగుము. దీనిలో మొదటివాఁడు (అనగా చావు నిద్రలను జెందినవాఁడు) కల మెలకువలను నెఱుఁగఁడు. రెండవవాఁడు అనగా మేలుకొని యుండువాఁడు, రెంటిని నెఱుఁగును. అయితే మరణ సుషుప్తులను జెందినవానికి మేలుకొని యుండువానికిని చావుపుట్టుకలు తప్పవు. సద్గురుకటాక్షముచే పరిపూర్ణమును దర్శించి నాఁడు దేనిని నెఱుఁగఁడు అతనికి చావుపుట్టుకలు లేవు. ౧౬౮.

కం॥ ఎఱుకే యెఱుకఁగొనుకులు । ఎఱుకే తలిదండ్రులెఱుక
కెఱుకే యితరుల్ । ఎఱుకే యెఱుకకు మూలము । ఎఱుకకు మూ
లంబు బయలం దెట్లందునోయి ♦ ఎఱుక లేక యేమి లేదోయి ♦
లేనియుత్తి ఎఱుక పరిపూర్ణమును జూచి । ఎఱుకే తా లేనని యెఱుఁగి
పోయినపై మాటెట్లందునోయి ♦ ఎఱుక లేక యేమి లేదోయి॥ ౧౬౯॥

తా. ఎఱుకను నెఱుకే బిడ్డ. తనకుదానే తల్లియు దండ్రియు. తనకు నితరమైన వారలును తానే. అనగా నెఱుకకంటె వేరైన దేదియు లేదు. దానికదియే మూలము. అదియట్లుండ నెనెఱుకకు పరిపూర్ణము మూలమని యేలాగు చెప్పనగును యెఱుక పరిపూర్ణమును దర్శించిన వెంటనే మాయమై పోవును. ఉత్కృష్టమైన లేని యెఱుకకు పరిపూర్ణము మూలమని యేలాగు జెప్పఁదును. ఎఱుక లేకపోయిన యెడలనే మియునుండదు. అనగా విశ్వమేయుండదని భావము. ౧౬౯.

కం. గుఱుతుగఁగలలోఁ బలసి । నరులూరక వచ్చిపొందిన యము
గసుతులన్ । పగకన్నియలనుగాంచియు । గురునరుచే మేలుకొనిన
గుఱుతుండదన్న ♦ ఆపై మాట నెఱింగే దేదన్న ♦ ఎఱుకో

క్కటుండిననేర్పాటులుండును । నెఱుకొక్కటేగితే యేర్పాటు
చేసెడిగుఱుతుండదన్న ♦ ఆపై మాట నెఱిఁగేదేదన్న ॥ ౧౭౦॥

తా. శిష్యా, సంసారమనునీ కలయందు మనుజులు స్త్రీపురుషులను గుఱుతుగలిగి నొకరితో నొకరుసంభోగించి, కొమాళ్ళను, కూతుళ్ళనుగాంచి వారితో సుఖమున నుందురు, సద్గురుని కటాక్షము జెందిన పిదప స్త్రీపురుషుల భేదముయొక్క గురుతేమియు నుండదు. ఆగుఱుతును నెఱిగి భేదమును దెలియునదే యెఱుక. ఎఱుకయుండినప్పుడేనీభేదము లన్నియుదోచును. ఎఱుక లేక పోయినయెడల నీభేదములను జూపు గుఱుతు లేవియు నుండవు. ౧౭౦.

కం॥ నెనునను నీవును గాంతువు । నినునను గలలోన గాంతునేనొకవేళన్ । నినునను నీవును నేనును । గనుగనుఁగొనఁగలమెమేలు కొనినమీఁదటను ♦ గురుబోధిట్లు వినిన మీఁదటను ♦ మునుపుగలిగిన యెఱుక మొదటికే నిలువదు । నినునన్ను నేనిన్ను నినునివెఱుఁగుట కనిన మీఁదటను ♦ గురుబోధిట్లు వినినమీఁదటను॥ ౧౭౧॥

తా. కలయందు నీవునన్ను జూతువు, నేనును నిన్నుజూడవచ్చును. మేల్కొనిన పిదప నీకునేనును నాకునీవును కనబడుట యెట్లు కలలో గాంచినది మెలకువయందు గనలేము. అట్లే గురూపదేశమైన తరువాత నెఱుక పాఱిపోవును. నిన్ను నేనును, నన్ను నీవును జూడలేము. నీవు నేను అను భేదముండదు. నామ రూపములతో గూడిన నీప్రపంచమును జూచుటంతయు గలయనియు, పరిపూర్ణమును నెఱుగుటయే జాగ్రత్తయనియు నెఱుంగుము. ౧౭౧.

కం॥ నినునీవునన్ను నేనును । ననునీవును నేననిన్ను నను నెఱిఁగినదే। తను నెఱుఁగని దానినిఁగని । తనకలిమిన్యప్రపంచముఁ దెలిసితా నేగినను ♦ అది మెలఁగపలదా యెవ్వఁడెఱుఁగును ♦ ననునీవు నేనిన్ను వినిపింతు మెండొరు। లనుటకిదరి కిప్పుడు మునుపున్న యెఱుకేది తా నేగినను ♦ అది మెలఁగపలదా యెవ్వడెఱుఁగును॥ ౧౭౨॥

తా. నేను నన్నునునిన్నును, నీవు, నిన్నును నన్నును నెఱుగుటయో

10

నెఱుక. తన్ను తా నెఱుగునదియే నెఱుక. అట్టియెఱుక, తన్ను దా నెఱుగ నిపరిపూర్ణమును గాంచిన వెంటనే తనసంపదయంతయును కల్లయని నెఱిగి పాఱిపోవును. అట్లు ఎఱుక పాఱిపోయిన పిదప నెఱుగువార లెవ్వరో నాలోచింపుము. ఎవ్వరును లేరు. అప్పుడు, నేనును, నీవును పరస్పర మెఱుగుట యసాధ్యము. మనకు ముందట నుండిన యెఱుక విడిచిపోవును. ౧౭౨.

కం॥ తిమిరారియందులేనిదె। తిమిరము తనుదానె వచ్చి తేజోనిధియై। తిమిరారియునికిం గైకొని। తిమిరముదా నిలువనట్లు

తెలిసికోరాదా ♦ బయ లెఱుకలం దెలిసి యూరికోరాదా ♦ భ్రమ రూపమైనట్టి బ్రహ్మాండమెఱుకల। భ్రమనొసి చేసిన భ్రాంతిపుట్టుము నుల తెలిసికోరాదా ♦ బయ లెఱుకలం దెలిసి యూరికోరాదా॥ ౧౭౩॥

తా. శిష్యా, సూర్యునియందు లేనిచీకటి తనకుదానే గలిగి వ్యాపించి సూర్యోదయము కాగానే తానెంమును నిలువలేక మాయమై పోవును, అట్లే పరిపూర్ణము నందును నెఱుక లేదు. లేకయే నల్లెడల వ్యాపించి యుండును. అట్టి మాయా స్వరూపమైన యెఱుక పరిపూర్ణమును దర్శించిన వెంటనే నిలువలేక మాయమైపోవును. గురుకృపా కటాక్షముచే బ్రహ్మాండ మెఱుకలయొక్క భ్రమనుండి విడిపింపజేసిన పిదప భ్రాంతు లేవియు నుండవు. ౧౩౭.

కం॥ లేదు లేదనుచు నెందఱు। వాదించిన లేకపోదు పరిపూర్ణము తాం। బోదుపోదనుచు నిలిపినం। బోధనియునుకోకు మెఱుకపోనే పోతుంది ♦ గట్టిగ లేచి పోనేపోతుంది ♦ వాదభేదములేనివారిచే నెఱుకను। పాదు కదలించు ప్రకృతి నెంచిగినంబో నేపోతుంది ♦ గట్టిగ లేచిపోనే పోతుంది॥ ౧౭౪॥

తా. శిష్యా. పరిపూర్ణమును ఎందఱైనను లేదులేదు అని చెప్పినను అది లేకపోదు. అదియుండియే తీరును. ఎఱుకను నిత్యము నిత్యము అని ఎన్నిమార్లు చెప్పినను అదికపటనశించియె పోవుచున్నది. ఎఱుక నశించియే పోయితీరును. పరిపూర్ణజ్ఞానులైన మహాత్ములచే ఎఱుకను సమూలముగా నశింపచేసెడు సచలబోధయొక్క యుపదేశము చెందిన

యెడల ఎఱుక నశించినదే పోవును. నిశ్చయముగా పోవును. దీనిని బాగుగా నమ్ముము. ౧౭౪.

కం॥ మేనెఱుకల రెంటనునొక। దానినినెడఁబాసి చేయత రమౌపనులకా। మేనికి నెఱుకకుఁగాపున। మేనన నెఱు కెఱుకియనిన మేననియెఱుఁగు ♦ రెంటిని నీవు నేననియెఱుగు ♦ యెఱిఁగినీటి లో బయలునెఱిఁగి మేనెఱుకల। తిరిగి చూడకు చూడ గురుని పా దములాన మేననియెఱుఁగు♦ రెంటిని నీవు నేననియెఱుఁగు॥౧౭౫॥

తా. శరీరమును ఎఱుకయు ఒకదానిని ఒకటి వదలి ఏ పనియై నను చేయజాలవు. శరీరమున్నను ఎఱుకయే, ఎఱుకయున్నను శరీరమే. ఈ రెంటిను ఒక్కటేయని తెలుసుకొనుము. సిద్ధసహాయ్యంబును పరి పూర్ణమును నెఱింగి శరీరమును ఎఱుకను మరల చూడకము నీయొ క్కసద్గురుని పాదములానగా వాటిని మరల చూడకుము. ౧౭౫.

కం॥ మరుపు సుషుప్తియుమూర్ఛయు। మరణంబుసమాధియు నుచు మానవు లెఱుకకా। పొరిఁగిన నరునిశరీరము। నెఱిగెవ రా నరుఁడుమేను నెఱుఁగఁగోయన్న ♦ తన నైన౯ఁ దానెఱుఁ గఁగోయన్న ♦ యెఱుఁగకుండినవాఁడు తిరిగిపుట్టుచునుండు। తి రిగిపుట్టఁడువాఁడే గురుబోధగల్గిన నెఱుఁగఁగోయన్న। తనైన౯ఁ దానెఱుఁగఁగోయన్న॥ ౧౭౬॥

తా. శిష్యా. మఱపు నిద్ర మూర్ఛ మరణమును నీ నాల్గింటిని లోకులు సమాధియందురు. ఎఱుకచే విడువబడిన శరీరమును ఎవ రును ఎఱుగలేరు. సమాధియందుండు మనుజుడు శరీరమును ఎఱు గజాలడు, తన్ను తాను ఎఱుగజాలడు. అట్లు ఎఱుగని వానికి చావు పుట్టుకలు తప్పవు, సద్గురూపదేశముచేత పరిపూర్ణమును గన్నవార లకు జనన మరణావస్థలు గెలుగవని ఎఱుంగుము. ౧౭౬.

కం॥ పరిపూర్ణ మెఱుకలివియని। యెఱుఁగని బయలందు లే నియెఱుకతనకుఁదా। నరుదెంచుట గురుశిష్యుల। తెఱగునమూ ర్ఖాడి రెంటి తెలిసితాఁజనును ♦ ఆపై మాట పలికే దేదిఁకను ♦ అరమరలేక నేనెఱిఁగించినట్టియూ। సుబోధ పాత్రుల నెఱుగి క తెలుపక తెలిసితాఁజనును♦ఆపై మాటపలికే దేదిఁకను॥౧౭౭॥

తా. ఇదిపరిపూర్ణము, యిదిఎఱుక అని గురుతుపట్టజాలని పరిపూర్ణమునందు, లేని ఎఱుక తానుగానే జన్మించి గురుశిష్యులవలె వాదులాడి పరిపూర్ణమెఱుకలరెంటిని తెలుసుకొని తానుఎందునునిలువజాలక పారిపోవును. ఎఱుక అట్లుపోయిన వెనుక నెఱుగువారు ఎవ్వరులేరు నేను నీసందేహములెల్లను బాయున ట్లుపదేశించిన నీపరిపూర్ణ భోదను నీవు అపాత్రులకు నుపదేశము చేయవలదు. ౧౭౭.

కం॥ మఱుపునుషుప్తియు మరణము। పరిపూర్ణంబునకు సాటిపరచియెఱుకకును । మఱనాది మేల్కు పుట్టువు। లిరుదెఱుంగులనెఱిఁగి యెఱుక నెగరఁజిమ్మోయి ♦ ఆపై నుండె దెఱఁగేదెల్లోయి ♦ గురుమంత్రమిదెనుమ్మీ మఱువక యేప్రొద్దు। స్మరణ జేసితివేని తిరిగిపుట్టువు నీవల్లగరఁజిమ్మోయి ♦ ఆపై నుండేదెఱిగే దెల్లోయి॥ ౧౭౮॥

తా. మఱుపు, నిద్ర, మరణము వీటితో పరిపూర్ణంబునకు బోల్చి ఎఱుకను, జ్ఞానము. మెలకువ. పుట్టుకవీటితో బోల్చియీరెండు విధములను బాగుగా తెలిసికొని ఎఱుకను నశింపచేయుము. యిదే గురుమంత్రము. దీనిని మరచిపోకుము. దీనిని ఎల్లప్పుడునుస్మరించుచుంటివేనినీకుజాపుపుట్టుకలు కలుగవని తెలిసికొనుము. ౧౭౮.

కం॥ క్షితిలోనసరుసుపక్వా। న్నతతినివెలికక్కి మరలనాకునె యతిసం। స్కృతివిడిచి తిరిగిపూనునె । వితరణశాలిచ్చినట్టివిత్తముసుగునా ♦ సత్యశాలిసత్యముసుగునా ♦ ప్రతి లేనిగురుబోధసితిజెందిన యెఱుక నీ । గతి సంగ్రహించడు కృతకృత్యుడిచ్చిన విత్తముసుగునా ♦ సత్యశాలిసత్యముసుగునా॥ ౧౭౯ ॥

తా. శిష్యా, సరులు, వమనముజేసిన షడ్రసోపేతాన్నమును మరలగ్రహింపరు. బుద్ధిమంతుండైనవాడుతాను, నీవిగానిచ్చిన ధనమును పరిగ్రహింపజనడు. సత్యవ్రతుండైనవాడునునబద్ధమాడనొల్లడు. సద్గురుకటాక్షముచేపరిపూర్ణమునెఱిగినజ్ఞానియెఱుకనుమరలగ్రహింపడు.

కం॥ మఱుపన తొలిమేనులు మూ । డెఱుకన నాలవశరీర మిరారెంటికిఁకకు । పరిపూర్ణ మవలిది యని । యెఱుకను గురు వాక్కుచేత నెగరజిమ్మినను♦ పోవును లేనియెఱుక నెఱిగినను♦

ఎఱిగేదే లేకుండు నేమో యావలి జాడ। నెఱిగేవా రెవరింక నింతేచా లెఱుకను నెగరజిమ్మినను॥ పోవును లేని యెఱుక నెఱిగినను॥ ౧౮౦॥

తా. మఱుపనగా ఆదిదేహములుమూడును అని యెఱుంగునది. అవియెవ్వియన స్థూలసూక్ష్మకారణ. శరీరములు. నాలువశరీరము [అనగా మహాకారణశరీరము] యెఱుకయని దెలియుము. ఎఱుకయు మఱపును రెండును నొక్కటేయని యెఱుంగుము. వీటిని మించినదే పరిపూర్ణమని యెఱుంగుము. గురునిదయచే నెఱుకను పాఱజిమ్మినయెడల నెఱుగువా రెవ్వరును నుండరు. పరిపూర్ణము నెఱిగిన తరువాత ఎఱుక పాఱిపోవును. ౧౮౦.

కం॥ నానావిధావయవములు। నానావిధ నామరూప సటలు మాయల్। నానావిధములయూహలు। నేనను నెఱుకందునిన్ని నిబిడమైయుండు॥ బయలును గనితా నిలువలేకుండు॥ నేను మేనులు రెండు లేనే లేకుండిన। మేను లేదది లేకయే నిలిచేదెట్లన్న నిబిడమైయుండు॥ బయలునుగని తా నిలువలేకుండు. ౧౮౧.

తా. అనేకవిధములైన అవయవములును అనేకవిధములైన నామరూపక్రియలును, మాయలును, అనేకవిధములైనట్టి యూహలును, నేననియహంభావము జెందియుండు నెఱుకయందు నిండియుండును. పరిపూర్ణమును గాంచినవెంటనే తాను నిలువజాలక పాఱిపోవును. దేహము లేనియెడల నాత్మయు నుండజాలదు. కావున శరీరాత్మలు రెండును నశించును. ౧౮౧.

కం॥ జగమువలన సంకల్పము। జగమా సంకల్పమునను జనియించును వే। అగుపడదుజన్మమందరి। మగుపడ దెడంబాసినిల్వ వారెండెన్నటికి॥ బయలునుగనిన నివిరెండెన్నటికి॥ ఇకందలంచబోకు మివిబుట్టుట్లుళ్ళక్కి। మృగజాలమగుపడమిథ్యం చెఱిగిన మాటక్కి నీరెండెన్నటికి॥ బయలును గనిన నివిరెండెన్నటికి॥ ౧౮౨॥

తా. జగత్తువలన సంకల్పమును, సంకల్పమువలన జగమును గలుగుచుండును. ఒకదానికొకటి కారణముగా నున్నది. ఈరెంటికిని

కారణమైనది మరియొకటి యున్నదని జెప్పుటసరిగాదు. ఈరెండునునొకదాని నొకటివిడిచిపెట్టి యుండజాలదు. ఇవి రెండును పరిపూర్ణము దర్శించినయెడల నశించును. మరలనీటికెన్ని యుగములకైనను పుట్టుకకలుగదని తెలిసికొనుము. మృగతృష్ణలను నేలాగుమిథ్యయని యెఱుంగుదుమో అట్లనీరెంటిని నిజముగాననిగా నెఱుంగుము. వాటినికమీఁదట తలంపకుము. ౧౮౨.

కం॥ పరిపూర్ణమనెడు పలుకే । యెఱుకను సల్పాత్మునముల
నెప్పుడు గనినను । దినమై యున్నది గనుగొన । నెఱుకను సల్పా
త్మములనిక గట్టిపట్టు ♦ ఎవరికి తెలియ దిది, మూలగుట్టు ♦
గురుమూర్తి కరుణచే నెఱిఁగి తెలిసితి నేను । పరిపూర్ణబోధను
పరులు తెలిపిన బోధ నికగట్టిపెట్టు ♦ ఎవరికి తెలియ దిది
మూలగుట్టు॥ ౧౮౩।

తా. పరిపూర్ణము నొక శబ్దముగాదు. దాని నిట్టిదని జెప్పుటకు మాటలకు దరముగాదు. ఎఱుకైతేనో కొంచె ముకురము లనగా త్రిపూటతిగానున్నది. చిన్నపేరు గలదిగావున అందరి నోటియందును స్థిరముగానున్నది. అట్టి యెఱుకను నింక గట్టిపట్టుము. గురునికరుణచే పరిపూర్ణమును గని యెఱుకను గట్టిపట్టుము. ఇది పరమరహస్యము, ఇది యెవ్వరికిని తెలియదు. ౧౮౩.

కం॥ చూపించి చూపరానిది । చూపించితి దానినుండజూ
చితివిగదా । చూపించగ నిదెవిదిదే । న్నెగ్రాద్దిక దలచబో
కు మిదెగురుబోధ ♦ నిన్నంటునితర ప్రబోధ ♦ నాపాపనాకూన
నాచిన్ననాయన్న । నాపెన్నిదానవు నారత్నముల కొండ ♦ ఇ
దెగురుబోధ ♦ నిన్నంటు దితరప్రబోధ। ౧౮౪॥

తా. చూపించియుట్టిదని జెప్పుటకుసలవికానిదియు చూపతేనిదియునైన పరిపూర్ణమును నికెరింగించితి. దానిని నీవు బాగుగా దెలిసికొంటివిగదా. చూపమనదిమైన యెఱుక యిదేను. దీని నికదలచవలదు. ఇదియేనచలబోధ ఇతరమతములవారిబోధలు నీమదికెక్కవు. నాబిడ్డా నాకూనా, నారత్నమా, నానుశ్లేషమా, నీవు బాగుగా దెలిసికొనుమని ప్రేమతో గురుడుచెప్పును. ౧౮౪.

కం॥ నామము రూపము నటన | స్థానము బయలందు లే
దు చూడుముసీవా| నామమురూపమునటన| స్థానము నెఱు
కందుగలవుచూడుమి నిజము ♦ బయలెఱుకల జూచిచూడను
ము ♦ వేమాఱునేనెంత వినజెప్పినగాని | నీమార్గమె తప్ప యి
క లేదు రెండనది చూడుమి నిజము ♦ బయలెఱుకల జూచిచూ
డనుము॥ ౧౮౫॥

తా. నామరూపక్రియలనెడు వృత్తిత్రయము పరిపూర్ణమునందు లేదు. లేదని బాగుగానమ్ముము. పరిపూర్ణ నామరూప క్రియా రహితము నామరూపక్రియలతో గూడికొన్న దెఱుక. బాగుగా జూచి తెలిసికొనుము. పరిపూర్ణమునుజూచి యెఱుకను జూడకుము [అనగా నెఱుకను త్యజింపుమనుట.] నే నెన్నిమాఱులు నీకు జెప్పినను దీనినే చెప్పుదునుగాని యింకదేనిని జెప్పను. ఇదియె సద్వైనత్రోన. కావున దీనినే జెప్పుదునని తెలియుము. ౧౮౫॥

కం॥ గురుడు గురుబోధ శిష్యుని | కెఱిగించెను నేడు శిష్యు
డెఱిగెను నేడు | ఇరువురునై క్యోనర | కర్పూరములవలె వెలిగి
యనల పోడుచూడవరోయి ♦ అట్లనేని విక్కుడు దెలియుమోయి ♦
పరిపూర్ణ మెఱుకల నెఱిగియా మీదట | నెఱుకనువిడువ కే గు
రుబోధ నెఱుగుము పోడు చూడవరోయి ♦ అట్లనే నివిక్కడ దె
లియుమోయి॥ ౧౮౬॥

తా. శిష్యా. గురుడు నిజశిష్యునకు నుపదేశించు నేయుండును, శిష్యుడు నట్లు గురుముఖమున నుపదేశము గొను నేయుండును, గురు శిష్యులిద్దరు నగ్నికర్పూరములనీతి దేహంబ్లినపిదప గిసబడరు. అనగా తిరు వాతె నారిద్దరికిని భేదభావముండదు. పరిపూర్ణ మెఱుకల గెలిచిని యెఱుకచేనెరింగి పరిపూర్ణమును నిజమైనదిగాను, ఎఱుకను కల్లగాను దెలిసికొని, యెఱుకనుత్యజించుటయే నుత్తమమైన స్థితి, దానికి మించిన పద్ధతి లేదు. ౧౮౬.

కం॥ నతికౌగిట తత్సుఖము | త్పతి కౌగిట నతియు జేరి నమ్మించి
కడు | రతి సౌఖ్య మేలుకని సు | స్థితులై రొకరొకరు
చేష్ట దెల్పుమరా ♦ నిన్నదలియూచేష్ట దెల్పుమరా ♦ ప్రతిలేనిగు

రుబోధ స్థితిజెంది యట్లెసం । తతితిరిగి లేనెఱుకగతి యిట్టిదస
రానిచేష్ట దెల్పుమురా♦సిగ్గడలి యాచేష్ట దెలుపుమురా॥౧౮౭॥

తా. భార్యాభర్తలిరువురు నాలింగనాది రతిక్రీడలయందు ప్రొద్దుపుచ్చి ఉదయము నిదుర మేల్కొన్నప్పుడు, రాతిరియందు తాము కామోద్రేకంబున నొనరించిన క్రీడావిశేషములను సిగ్గువిడిచి పరస్పరము చెప్పుకొనుదురా, చెప్పుకొనరు సాటిలేని యీపరిపూర్ణబోధను తెలిసికొని యెఱుకను నబద్ధమని విడిచిపెట్టినపిదప, ఎఱుకయందు తాము పడినపాట్లను చెప్పుకొనరు. ౧౮౭.

కం॥ రానిదిపోనిదిబయలని । లేనిదియెఱుకనుచునీకు లెస్స
గదృష్టమా । దానను నిపీమంత్రము । మానకజపియించుచుం
డుమాబుద్ధిశాలి♦ లేనిదెలేదు మఱువకీజోలి ♦ లేనిదెలేదనిపూ
నినిశ్చయమైతె। తానొక్కటుండునుగానియట్లను వినుమాబుద్ధి
శాలి ♦ లేనిదెలేదు మఱువకీజోలి॥ ౧౮౮॥

తా. చావుపుట్టుకలు లేనిది పరిపూర్ణమని యు, ఎఱుక నిజమైనది కాదనియు [అనగా లేనిదనియు] నీవుదృఢముగా నమ్మినయెడలనీమంత్రమును జపియించు చుండుము. లేనియెఱుక యెన్నటికిని లేనెలేదనియెఱుగుము. దీనిని మఱువకుము. ఉండునది ఒక్కటియేను. అదియే పరిపూర్ణము దానికంటె వేరైన దేదియు లేదు. ౧౮౮.

కం॥ ఉన్నదిపరిపూర్ణములే । దెన్నటికిని నెఱుక యనచు
నిదిదృఢమాదా । కెన్నమునే బోధించిన । తిన్ననియీ బోధ
శిష్యతిలక మఱువకుమీ♦సుజనులముందలపలుక వెఱువకుమీ♦
నిన్ను కుమతులు వచ్చి నీబోధడిగిన వారి। కెన్నివిధముల నీవె
ఱిగింపకిది శిష్యతిలక మఱువకుమీ ♦ సుజనుల ముందలపలుక
వెఱువకుమీ॥ ౧౮౯॥

తా. శిష్యులలోతిలకము వంటివాడా, ఉండునదేపరిపూర్ణము. లేనిదే యెఱుకయని నీకుమనోనిశ్చయము కలుగువఱకు నీ పరిపూర్ణబోధను మఱవకుము. దీనినిగుఱించి పెద్దలయెదుట మాటలాడుటకు వెనుదీయకుము, సజ్జనులకు నీబోధను జెప్పుమనుటకు జనులు నిన్నడిగినచో వారలకీ పరమరహస్యమును జెప్పకుము. ౧౮౯.

కం॥ పరిపూర్ణ మెఱుకలను నే। నెఱిఁగించితి నీవు రెంటి నె ఱిఁగితివిగదా। యెఱుకను గురుదక్షిణగా। మఱి వేగిర మిమ్ము వట్టిమాట లేమిటికి ♦ నెఱుకతో నింకఁ గూటమేమిటికి ♦ బరులు నేననియెడు భావ మభావమై నిరతము నొకరీతి నిలిచి యుండుము వట్టిమాటలేమిటికి ♦ నెఱుకతో నింక గూట మేమిటికి॥ ౧౯౦॥

తా. పరిపూర్ణము, లేనియెఱుకలను రెంటిని నీకు బాగుగా దెలియజెప్పితిని. నీవును దానిని బాగుగా దెలిసికొంటివనినమ్ముచున్నాను. నాకు గురుదక్షిణగా నీవు యేమియు నివ్వవలదు. ఎఱుకనుయిచ్చిన జాలును. అనగా నీవు యెఱుక నుత్యజించుటయే నాకు గురుదక్షిణ ఎఱుకతోటి సాంగత్యమునికెన్నటికి నివలదు. నేనునీవు అను భేదబుద్ధినికలిగియుండకుము నీవెన్నటికిని పరిపూర్ణమును నమ్మి ఒకేతీరున నుండుము. ౧౯౦

కం॥ పరిపూర్ణ మెఱుక లిపియును। గురువరుఁ డెఱిఁగించి యెఱుకి కూటమియున్నది। గురునకు గురువే సరిగదా। మఱి శిష్యునకింక నోట మాటవెళ్ళునా ♦ పోయిన యెఱుక మళ్ళి మళ్ళునా ♦ గురుశిష్యులనియెడు గురుతున్న దెఱుఁగక। నిరతము నొకరీతి నిలుచున్న బయలందు మాటవెళ్ళునా ♦ పోయిన యెఱుక మళ్ళి మళ్ళునా॥ ౧౯౧॥

తా. ఇయ్యది పరిపూర్ణము. ఇయ్యది యెఱుక యనియునందులో, యెఱుక లేనిదనియు దెలియజెప్పి, యెఱుక యొక్క సాంగత్యమును మాన్పుటకు గురుడే సమర్థుడు. ఇంకెవనికిని సాధ్యము కాదు. అట్లు గురుడుపదేశించిన పిమ్మట శిష్యునకు నోటజెప్పుటకు నొకసందేహ మేనియునుండదు. సందేహములన్నియు తీరును. అట్లు పాఱదోలబడిన యెఱుక మఱల రాదు. గురునకును శిష్యునకును భేదము లేని పరిపూర్ణమునందు సందేహము లేవియునుండవు. ౧౯౧.

కం॥ స్థిరముగు పరిపూర్ణమును। స్థిరముగు నీ యెఱుక యెఱుక తెలియుజగములం। దెఱిఁగిన దెఱుకే గదస। గురుకృపచే నెఱుక పోవ గురుశిష్యులేరి ♦ నోరెత్తక నుండవిననోరి ♦ గురుని పాదములాన గుఱుతు లేనటువంటి। పరిపూర్ణ మొకటుండు ప

లుక రాదట్లుండుగురుశిష్యు లేరి♦నోరె తక మఱివినరోరి॥౧౯౨॥

తా. పరిపూర్ణమునిత్యము. ఎఱుకయూ అనిత్యము. యీజగత్తునంతయు నెఱుగునదియే ఎఱుకయని తెలుసుకొనుము. ఇట్లు ఎఱుక పరిపూర్ణమునుదర్శించి తానుపోయినపిదప గురుశిష్యులకు భేదములేదు. అనగా అన్ని భేదములును నశించుచున్నవి దీనికి ఏమియు బదులుచెప్పక వినుము. నీగురునితోడు గుఱుతులేని నామరూప క్రియారహితమైన పరిపూర్ణము ఒక్కటియే యున్నదని తెలియుము. దానినియిట్టిదని వర్ణింప మాటలకసాధ్యము. ౧౯౨.

కం॥ గురుఁడచలము నెఱుకనుదవ। కెఱఁగించిన శిష్యుఁడె ఱఁగి యెఱుకై యుండెనె। ఎఱుకిను నిలుపకుమనిననుని। నెఱుకనువిడనాడిఁ శిష్యుడెట్లుండునంటె ♦ నట్టనెనేని నెట్లుండునంటే ♦ పురుషుఁడుఁలేనట్టి పొలతి సౌందర్యము। మఱిమాఱిగలిగుండి మఱిలేకట్టనెయంటినెట్లుండునంటె ♦ నట్టనెనేని నెట్లుండునంటె॥ ౧౯౩॥

తా. సద్గురుడుసాటిలేని పరిపూర్ణమునుఎఱుకనురెంటినియొఱిగించినపిదపకూడా శిష్యుడు ఎఱుకయందుండుటం గాంచి శిష్యునకు ఎఱుకను త్యజింపుమని ఆజ్ఞాపించిరి. అట్లెఱుకను త్యజించినశిష్యుడు ఏలాగు నుండుననగా గతించిన పురుషునిగలసుందరి ఏలాగు విరక్తయై యుండునో ఆలాగునే శిష్యుడును ఈ ప్రపంచముపై యిష్టములేక విరక్తుడుగా నుండును. ౧౯౩.

కం॥ ఎఱుకను విడనాడినయా। పురుషుని స్థితి యెట్టిదనిన పొందుగ వినుమీ। సరిపడుసరిపడదనకను। సరిగా వర్తించుచుండు సమరసబుద్ధిన్ ♦ కార్యములందు సహజప్రబుద్ధిన్ ♦ పరిపరివిధములఁ బరువులు పెట్టను। మఱి వైరాగ్యముచేత మానుకొనియుండఁడు సమరసబుద్ధిన్। కార్యములందు సహజప్రబుద్ధిన్॥ ౧౯౪॥

తా. ఎఱుకనుత్యజించిన పురుషుడేలాగునుండుననిన జెప్పెదనాలకింపుము. అతను యిదిఒప్పుఅదితప్పుఅని చెప్పకకడపటన్యాయమార్గమున నేప్రవర్తించుచుండును. ఎల్లకార్యములయందుస్వభావసిద్ధి హి

తమైన బుద్ధితో మెలంగుచుండును అతనికిదేనిపైనను రాగానురాగ ములుండవు. అట్లుమిక్కిలి విరక్తిచేత కార్యములు చేయకయునుం డడు, అనగా అతడు నొకదానిపైనను ఎక్కువ ఆశలేక కార్యములు జరిపించుకొనుచుండును. అతనికివైరాగ్యముగానివాంఛగానిఅపరిమి తముగానుండదు. అన్నియు సమముగానే యుండును. ౧౯౪.

కం॥ కలమేలుకొన్న పురుషుడు౹ కలలోపలిబాము లెఱుగఁ
గలిగుండకయే । దలపోయ లేరుగురుకృపఁ౹ దెలివొందిన వా
రికింక తిప్పలున్న వా॰ తెలుపరకొద్దిగొప్పలున్న వా॰ తలిదండ్రి
దొరతాతకులదైవమాప్తులు ।కలబాంధవులు దేశికులనినమ్మి
ననింకతిప్పలున్న వా॰ తెలుపరకొద్దిగొప్పలున్న వా॥ ౧౯౫॥

తా. స్వప్నమందుచూచినకష్టములను మేల్కొనినపిదపమను ష్యుడు చూడజాలడు. సద్గురునికటాక్షముచే జ్ఞానముచెందినవారికిఏ లాటిసంకటములున్ననుగలుగవు వారికిఅపరిమితసుఖములును గలుగ వుఅనగా సుఖదుఃఖములు సమానముగా నుండుననియు నేదియుమితి మీరియుండదనిన్ని భావము గురుడేతల్లి గురుడేతండ్రి గురుడే దొర, తాత,కులదైవము,మిత్రుడు,బంధువు,సర్వమునుఅతడేఅనినమ్మియుం డువారిని ఏలాటికష్టములను చెందజాలవు. ౧౯౫.

కం॥ ఈరీతిస్థితిగలిగిన । నేరుపుశాలితరజనులనిందాస్తుతు
లఁ । దారేగిచేయఁడెన్నఁడు । వారలుమఱిచేసిరేని వలదని
యనఁడు ♦ చెవియొగ్గికావలెననివినఁడు ।వారు మీవారుమా
వారువీరనుకొంచు। సారెకువీరితో పోరాడెవారిని వలదనియ
నఁడు ♦ చెవియొగ్గికావలెననివినఁడు॥ ౧౯౬॥

తా. ఇట్టియునికిగలవాడైన [అనగాగురుని నమ్మియుండిన] బుద్ధిమంతుడింకెవ్వరినిదూషింపడు,భూషింపడు.తానేకార్యమునందును కోపము చెందడు ఇతరులు కోపముచెందినయెడల తాను వద్దనియు జెప్పడు. ఇతరులసమాచారమును తానుచెవియొగ్గిపూనికతో వినడు ఎవరైననుపోట్లాడుకొనుచుండినయెడల వలదనియు జెప్పను.౧౯౬.

కం॥ ధ్వనిమొదలగు తన్మాత్రలు । గనుఁగొనఁగా లేశ
మైన గాన్పించనిచో । టును బట్టబయలుగాఁగని । ధ్వనిమొ

దలగుతన్మాత్రలున్న దాని నెఱుఁగకను♦ గనియీ రెంట్లోదాని నెఱిఁగెడునికిఁగలిగినయట్టి ఘనుని సన్నుతిసేయ। జనులకుశక్యమంచనరాదు దాని నెఱుఁగకనుఁ ♦ గనినీరెంట్లోదాని నెఱిగియును॥ ౧౯౭॥

తా. దేనిక్రైతే శబ్దస్పర్శ రూప రసగంధముల నెడు పంచతన్మాత్రలతోడి సాంగత్యము లేదో అదియే పరిపూర్ణమని యెఱుగుము ఎందునన్నైతే శబ్దాది తన్మాత్రలు గలవో అదియే యెఱుకయని యెఱుగుము ఈ రెంటియందును నిత్యమైన పరిపూర్ణమును నెవ్వడైతే నెఱుగుచున్నాడో ఆమహాత్ముని పొగడుటకు నెవ్వనికిని శక్యముగాదని యెఱుగుము. ౧౯౭.

కం॥ నామది లెస్సగవినుమీ। సామాన్యంబనుచుఁజూడఁ జనదీబోధ౯। ప్రేమాతిశయమునం గని। వేమాఱిదిగురుని నోటవినవలెసుమ్మీ♦ నిత్యముచదువుకొనవలెసుమ్మీ♦ నామ రూపక్రియనటనలు గలిగిన। దేనస్తునాదాని నెటునిల్వనీయకు వినవలెసుమ్మీ♦నిత్యముచదువుకొనవలెసుమ్మీ॥ ౧౯౮॥

తా. నేజెప్పబోవుదానినిబాగుగావినుము. ఈబోధనుసామాన్యమైనదిగా నెంచకుముదీనిని యనేకతేపలు గురునినోటనుండియత్యాదరముతో వినవలయునుసుమా. లేనిచో ననుదినము సేయుచలబోధను గుఱించిన పుస్తకములను పారాయణముసేయవలయును. నామరూపక్రియాసహితమైన యెఱుకను నెందునునిలువనీక పాఱదోలుము. ౧౯౮.

కం॥ నేమొదటనిన్నుఁగనుగొని। యేముక్కలు నీదు చెవిలో నిమిడించితినో। యామక్కలమూడింటిని। నేమాత్రము మఱువకుండ నీబోధనిస్తి♦నందుకె నింతగాబోధజేస్తి♦ ప్రేమతోఁజదువుమి నేమాఱు కెప్పుడు। కామితార్థములిచ్చునీము ముతోకుతనీబోధనిస్తి♦ నందుకెనింతగాబోధఁజేస్తి॥ ౧౯౯॥

తా. నేనునిన్ను మొదటగన్నప్పుడు యేమాటలపుడునీమానస్సునాటునటుల నీచెవియందూదితినో ఆమాటల మూడింటిని మఱవకుము. పరిపూర్ణము నిత్యము. ఎఱుకనిత్యముకానిది. కావునమఱుపు తెఱపుగలయెఱుకను త్యజింపుము అను నీమూడువాక్యములనుమఱచి

పోకుము. నీవు మఱువకుండ నుండుటకొఱకై నేనిన్ని మారులు చెప్పినదే చెప్పుచున్నాను. దీనిని మఱువక దీని ప్రకారము నడచుకొంటివేని నీవు కోరినదన్నియు నీకు సమకూరును. ఈ బోధయొక్క నియమముతో నుండుము. అనగా నీబోధ ప్రకారము నడుచుకొనుమనుట. ౧౯౯.

కం॥ అన్నముదిన్నను నాకలి। తిన్నగ నీరంబు ద్రావ తృష్ణయు రోగం। బెన్నఁగ నౌషధ సేవను। జన్న క్రియ నెఱుక నిల్వఁజాల దోయన్న ♦ యీబోధ నీ చెవులతో విన్న ♦ కన్నులతోఁ జూచి కడముట్ట జదివిన। నిన్నంటి నీయెదుట నిలుచుండి కనుగొనజాలదోయన్నా ♦ యీబోధ నీ చెవులతో విన్న॥ ౨౦౦॥

తా. శిష్యా. కడుపాఱ భుజించుటచేతను క్షుద్బాధయు, నీరు గుడుచుట చే పిపాసయు ఔషధ సేవచే రోగబాధయు నేలాగు పోవునో అట్లే పరిపూర్ణబోధను గురుద్వారమున నెఱిగిన పిమ్మట నెఱుకయు నిలువక పాఱిపోవును. నీవీపుస్తకమంతయు సాంగముగా జదివి పరిపూర్ణమును దర్శించిన పిదప ఎఱుక యెట్లు నిలువజాలక పాఱిపోవును. ౨౦౦.

కం॥ జననమరణ ప్రవాహము। లణచును నీబోధ పట్టుడని సాధువులి। చ్చిన నోళ్లకుండి వారల। జనునపుడా బోధమీఁద జనియించు ప్రేమ ♦ వెదకెదరి వెల్లజన చేష్టలేను ♦ యనితోఁ చినీకు నేవిన జెప్పవలసెని। ఫును నీబోధను నోళ్లననకు దొరకదు మళ్ళి జనియించు ప్రేమ ♦ వెదకెదరి వెల్లజన చేష్టలేను॥ ౨౦౧॥

తా. పరిపూర్ణబోధ జననమరణములను నాశము జేయును. దీనిని వినుడు అని యొక మహాత్ముండుపదేశము చేయవచ్చెనేని, కొందరు మూఢులు వానిని బెడచెవి పెట్టి వినకుందురు. అట్టి మహాత్ముండు పోయిన పిదప నాతనిపై యనురాగముగలవారై యీతనిం వెదకుదురు. సమయమునందు నిరాకరించినందులకు వగతురు. ఇదియంతయు జన సామాన్యమే యని యెఱుంగుము. నీవును లోకమువలె నిరాకరింపక నేజెప్పినదానిని సావధానముగా నాలకింపుము. ౨౦౧.

కం॥ మఱుపుకు దన్మాత్రలుగల। వెఱుకకు దన్మాత్రలున్న వీరెండొకటే। పరిపూర్ణమునకు లేవవి। పరిపూర్ణం బెఱుకగాదు పరికించవోయి ♦ వెదికిన దీని సాటిలేదోయి ♦ పరిపూర్ణ మెఱుకలబరి

శోధించి గ్రంథ ము రచి యిస్తి మరువక పరిపూర్ణము మెఱుపు
గాదోయీ ♦ వెదికినదీనిసాటి లేదోయీ॥ ౨౦౨॥

తా. మెఱుపునకు శబ్దస్పర్శాది పంచ తన్మాత్రలు గలవు శబ్ద స్పర్శాదులెఱుకకును గలవు. ఈ రెండును ఒక్కటేయని యెఱుగుము. పరిపూర్ణంబునకు శబ్దస్పర్శ రసరూపగంధములేవియు లేవు. పరిపూర్ణమును, ఎఱుకయునొకటిగాదు. నీవు బాగుగా నాలోచించిచూడుము. ఎక్కడ వెదకినను పరిపూర్ణమునకు సమానముండదు. పరిపూర్ణము మెఱుపుగాదని దెలియుము. పరిపూర్ణ మెఱుకల రెంటిని బాగుగా విచారించియే గ్రంథమును వ్రాయుటకుఁ బూనితిని. దీనిని బాగుగా దెలిసికొనుము.

కం॥ అందముగా సద్గ్రంథము । చందము వినిపింతు దానిజది
వినవినినఁ । ముందుగ బయ లెఱుకై యే సందున లే నెఱుక లేకజన
వలెసుమ్మీ ♦ మదిని దెవినిచదువుమి నమ్మీ ♦ యెందుకు నీకింక నితర
శాస్త్రములజోలందుగుర్తెఱిగిపోదదిగానదీ యెఱుక జనవలె
సుమ్మీ । మదిని దెపనిచదువుమి నమ్మీ॥ ౨౦౩॥

తా. శిష్యా, నీకీ గ్రంథమును బాగుగా వినిపింతును. దానిం జదివిననైనను వినిననైనను నీవు మొదట బయలెఱుకల రెంటిని దెలిసికొని యెఱుకను పారదోలుదువు, కావున నీగ్రంథమునే జదివి నమ్ముము ఎఱుక నశించిపోవలయును. ఇతర శాస్త్రములనుజదివి వాటినే నమ్మిన యెడల నెఱుక పోజాలదు. కావున నీవు దీని నే జదువుము. ౨౦౩.

కం॥ చక్కెర మెక్కనిరోగులు । జక్కెర మాధుర్య మెఱుగి
జాలరటువలెఁ । మక్కువతో వినివిడువక । చక్కగ గ్రంథార్థ
మెఱుగజాలరాజనుల ♦ కావుననీవుచాలించిపనులు ♦ చొక్క
మీగ్రంథముచూడుముకొనవెళ్ళ । నిక్కడితోజన్మమెత్తపుసరి
తెలియఁజాలరాజనులు ♦ కావుననివుచాలించిపనులు॥ ౨౦౪॥

తా. చక్కెరనుదినియుండని రోగులు చక్కెరయొక్క మాధుర్యమును జూడజాలరు. చక్కెరను తినిననేగదా దానియొక్క రుచి దెలియును అట్లే శ్రద్ధాసక్తులతో నీగ్రంథమును వినని యెడల, గ్రంథార్థమును దెలియజాలరు. కావున నీపనులన్నియు నటునుంచి శ్రద్ధతో నీపుస్తకమును మొదటినుండి కడవఱకు నేమియు విడిచి పెట్టక

చగుపుము. అట్లు దెలిసికొనిన యెడల నీకింక జన్మములు కలుగవు, ఇది యే నీకడపటి జన్మమగును. ౨౦౪.

కం॥ గూఢార్థమెఱిగినతడా। రూఢుండైనతడు గ్రంధరుచి గొనరుభువి౯ । గాఢతరాజ్ఞానంబున। మూఢుండై యున్న వాడు మొదట నేవినడు ♦ సుజనులపాదముద మొప్ప గనడు ♦ వాడు వీడన బానివాడే గ్రంధమువిని। వాడునిశ్చయమిట్టివార్త లెఱుగని వాడు మొదట నేవినడు♦సుజనులపాదముద మొప్పగనడు॥ ౨౦౫॥

తా. శిష్యా. గూఢార్థ మెఱిగినవాడును (సాంఖ్యాదిమతస్థుడు) ఆరూఢుండైనవాడును [యోగమునభ్యసించువాడును) వీరిరువురునునీ గ్రంధముయొక్క స్వారస్యమును గ్రహింపజాలరు. ఏలననగా వారుయి తరమతములను నమ్మినవారుగాన. వారలకీ గ్రంధముమీద మనస్సుపో గు. ఏమియుదెలియనిమూఢునకైతేనో వానికిని మొదలే తెలియదు. అట్టిమూఢుడు పెద్దగొప్పతనమును గనజాలడు వాడువీడని భేదము లేకయుండు పరిపూర్ణజ్ఞుడే గ్రంధమునందలిస్వారస్యమును బాగుగా గ్రోలును, ఇదినిశ్చయము. ౨౦౫.

కం॥ తాబేటితలపుచేతను। దాబేలై యిల క్షుధార్తిదనరుట దెలియ౯ । దాబేటిగర్భమందున। దాబేలై పుట్టుచున్న దరమె యితరులకు ♦ సద్గురుబోధట్లరయనితరులకు♦ నేబోధ లెఱుగని యాబోధగలవారి। చేబోధపడయక జేకొన దలచి తెతెరమేయి తరులకు♦సద్గురుబోధట్లరయనితరులకు॥ ౨౦౬॥

తా. తాబేటియొక్కతలంపుచేత ననగా తాబేలువలెకుత్సితము గా ప్రవర్తించుటవలన మనుజుడు తానునుతాబేలై (వ్యర్థుడై భూమి యందు క్షుద్బాధాది బాధలం గష్టబడుచుండును.) ఇట్టివాడుతనయొ క్కయపరాధము చేతనే మఱియొక జన్మమునందు తాబేలుగాపుట్టు ను. తాబేలు తాబేలు గర్భమునుండియే జనించవలయును గాని నరగర్భమునందుండి జనించదు. అట్లే ఆరూఢులు మొదలైన వారి కని మూఢులకునునీపరిపూర్ణబోధను దెలియుటనశక్యము, పరిపూర్ణజ్ఞు లనుండియే దెలిసికొననగును. అదివారి కే దెలియును. ౨౦౬.

కం॥ ఈతయపేకునుమనుజులు। నూతిదరిం జేరినిలిచినోట

గోణగినన్। ఈఁదేలవచ్చువారికి। జేతులతో నీళ్ళమీద జేరియీా
దకను ♦ మును నేర్చినవారీదించకను ♦ నీతీరుగ నదేశికేంద్రుడు
జెల్పక। చాతుర్యమునబోధ సాధించనయ్యేనచేరియీాదకను ♦
మును నేర్చినవారీదించకను॥ ౨౦౭॥

తా. ఈఁతనేర్చుకొనుటకభిలాషగలమనుజుఁడు. బావియొద్దకుం
బోయినాకు నీవుటకు రావలయునని వేమారులు జెప్పినను నీతవచ్చు
నా. రాదు ఈఁతదెలసిన వానిని నీటియం దీదమనిజెప్పి తానునువారివలె
నేఈఁదినయెడలనీదవచ్చునుగాని లేనియెడల రాజాలదు అటులనేనాకు
నచలబోధ దెలియవలయునని జెప్పుకొనుచుండినయెడల దెలియదు.
దానిని దెలిసిన పెద్దలయొద్దకుబోయి వారియొద్ద దానినిఉపదేశ మొంది
నగాని రాజాలదు. కావున సద్గురువును సంపాదించుకొన వలయును.

కం॥ ప్రవిమలచిత్తుండగుశిష్యుఁడు। సవినయమున దేశికునకు శర
ణాగతుడై త్రివిధప్రసాదములుగొని। భవనాశస్థితులు లేనిపదదతి
విదినన్ ♦ తిరిగిరానిపదదతిగనినన్ ♦ భువిలో వానిసాటిబోల్ప నెవ్వరు
లేరు। అవిరళభక్తియు వానిని నొందుసీపదదతివిదినన్ ♦ తిరిగిరాని
పద్ధతిగనినన్॥ ౨౦౮

తా. పరిశుద్ధమైన మనస్సుగల శిష్యుఁడనడకువతో గురునొద్దకు
బోయి అతనిపాదంబు లేశరణుసనమ్మి, గురుప్రసాదముననుగ్రహించిన
వాడై, చావుపుట్టుకలనుండి విడుదలజేయునట్టియచలబోధను ఎవ్వడై
తె గురునియొద్దనుండియెఱుగునో వానికిసమానులెవ్వరు లేరని దెలియు
ముఆబోధను దెలిసికొనినవానిని, సాటిలేనిభక్తి పొందును. ౨౦౮.

కం॥ ఉపనయనముగాని దైతా। యుపనయనముమీాదిచదువు ప్ర
యాసా నెఱింగినన్। విపరీతమగును దానును। జపలుడు బ్రాహ్మ
ణుఁడుగాఁడు చర్చించిమూాడ ♦ శూద్రుండువాఁడు చర్చించిమూాడ ♦
ఉపనయనముచే బోధట్టులగ్రాహించనియట్టి। కపటచిత్తుఁడుసా
ధుగణముతో సమమనానె చర్చించిమూాడ ♦ శూద్రుండువాఁడు
జర్చించిమూాడ॥ ౨౦౯॥

తా. ఒకానొక బ్రాహ్మణుఁడు ఉపనయనము కానిదే, ఉపన
యమునకుతరువాత నభ్యసించెడుపద్యలను తానభ్యసించేనేనివిపరీతమ

గును వాడును బ్రాహ్మణుడు కాడు. వానిని చపలునిగా నెఱుంగుము. ఉపనయనమునందు గురుడు నుపదేశము చేయును. ఉపనయనమనగా బ్రహ్మజ్ఞానమును దెలియునట్టి కంటిని దెఱచుట. ఉపనయనమునందుగురూపదేశము జెందిననేగాని ఎవడును బ్రహ్మజ్ఞానమును జెందుటకు నర్హుడుగాడు. ఎవడైతే గురునిచే నుపనయనసంస్కారమును జెందకుండునో వాడు సాధువుగాడు. విచారించిచూడగా వాడు శూద్రుడౌనని దెలియుము. ౨౦౯॥

కం॥ మంత్రముచేసంతెట్టగు! తంత్రము లేకున్నగాదు తంత్ర
ముచేతగా! మంత్రము లేకనువడిగల! మంత్రముతంత్రమ్ము రెం
డుమఱిగూడుకొని ♦ కార్యములన్ని జరిగించుపూని ♦ మంత్రతం
త్రములలో మర్మముగురుండెఱుగు! మంత్రతంత్రములలో మర్మ
ముగురుని చెంతఁ గూడుకొని ♦ కార్యములన్ని జరిగించుపూని॥ ౨౧౦॥

తా. మంత్రము చేతనే కార్యములు కాజాలవు మంత్రముతో కూడ తంత్రము లేకపోయినయెడల కార్యము కాజాలదు తంత్రముతో గూడ మంత్రము లేకపోయినను కార్యములు కాజాలవు మంత్రతంత్రములు వెవ్వేరుగానే పనియు చేయజాలవు. మంత్రతంత్రమ్ములు రెండునుగూడియే సకల కార్యములను జేయుచున్నవి. ఈ రెంటియొక్క మర్మము సద్గురునికి తప్ప యింకెవ్వరికిని తెలియదు. నీవును శ్రీ గురునియొద్దనుండి యీ మర్మమును దెలిసికొనుము. ౨౧౦.

కం॥ సంకల్పాదిక గుణములు! సంకులమీ యొఱుకయందు
సమకూడుండుఁగా! సంకల్పాదిక గుణములు! సంకులమని యొదనుఁ
జూడఁజూడ లేదన్నా ♦ యీ రెండును వేఱుగావన్నా ♦ కొంకకని
రెంటిగూర్చి గ్రంథము జేస్తి! సంకోచింపకఁ జదువు శంకఫుట్ట
దింక జూడ లేదన్నా ♦ యీ రెండును వేఱుగావన్నా॥ ౨౧౧॥

తా. ఈ యొఱుకయందు సంకల్పాదిగుణములుండును, ఈ గుణములయొక్క కూడికను చూచుట కేటువంటి బాధయును లేదని తెలియుము. ఈ రెండును వేరుగాదు. ఒకటియని తెలియుము. నేనీ రెంటిని జేర్చి యీ గ్రంథమును వ్రాసితిని. నీవు దీని చదివితివేని యేలాటి సందేహములును ఉండవు. ౨౧౧.

కం॥ హాటమునకుటిలాత్మునిఁజం। పుటకై భటకోటికాజ్ఞ
ఘూపతియిడెనట। భటులటువలెఁ జేసెడిచోఁ। భటుకుటిలుఁడు
బడినపాట్లు పాటించికనునా ♦ అట్లనెగురునినోటదావినిన♦నిటు
వంటిబోధను నెఱువంటినరుడైన। నటువెన్కతనచేష్ట లెటువం
టిపో దానిపాటించికనునా♦అట్లనేగురునినోటదావినిన॥ ౨౧౨॥

తా. ఒకనొకకుత్సితుఁజంప రాజానతినొందితద్భటులు, ఆకుత్సితునురిఁదీయపోయినపుడు వానికితానుముందు జేసిన ఆకార్యములు జ్ఞాపకమునకువచ్చునా వాడుతాను చేసిన దుష్కార్యములకువగచునా. వగవఁడు. అట్లేగురునియనుగ్రహముచే పరిపూర్ణము నెఱిఁగి, ఎఱుకనుపొందోలినవారుతాముయెఱుకయందుపడినపాట్లను తలపరు. ౧౧౨.

కం॥ సకలజనులసమ్మతిగా। నొకడైననునడువజాలఁడు ర్వో
స్థలిపై। మకరాంకజననిజనకా। ద్యకలంకులలోనసీవననేమి
గణన♦బోధించితర జనులేమిగణన ♦ వికలమౌనసుడవై వెత
లొందబోకుసీ। వకుటిలభక్తుడవనిదెల్పితి బోధననేమిగణన♦
బోధించితరజనులేమి గణన॥ ౨౧౩॥

తా. సర్వజనానుసమ్మతంబైన త్రోవనునడచుట కెవనికిన్ని సాధ్యముకాదు. అట్టిమార్గముకుదురుటయే దుర్లభము. విష్ణ్వాదిదేవతలకే సర్వానుమతముగనడచుకొనుటకసాధ్యమైనప్పుడు, నీబోటిసామాన్యునకుసాధ్యమా, కాదనుట. ఇతరమతస్థులేమేమో జెప్పుదురు, వారికనుగుణ్యముగ పోవుటయసాధ్యము. నీవువారిమాటలనువిని మనస్సునందు చపలత్వమును పూనకుము. నీవుచపలుడవుకావని దెలిసియే నీకు బోధించితిని. నీవును దృఢమైనమనస్సుతోనుండుము. ౨౧౩.

కం॥ బలధనవిద్యలుదుష్టుల। కలగలిగిననొరులనెంతు రెం
తయుసీర్ష్యన్। బలధనవిద్యలుశిష్టుల। కిలగలిగిననొరులబ్రో
తురెంతో మోదమునఁ నీవెఱంటినెఱిఁగి మోదమున ♦ కలలో
ననైనదుష్టులచెంత జేరకు। మెలమిశిష్టులచెంతగలనైన వద
లకుమెంతో మోదమున♦నీవెఱంటినెఱిఁగిమోదమున॥ ౨౧౪॥

తా. శరీరసంపత్తియు, ధనమును, విద్యయును, ఈమూఁడునునొకానొకదుష్టునికి గలిగియుండెనేని వాడితరులను అసూయతోజూచుచు

నిందించుచుండును. శరీరధనవిద్యా బలములను నీ త్రివిధబలములును. నొకయోగ్యునికిఁ గలిగి యుండెనేని వాఁడు ఇతరులకు మేలుచేయవలయునను తలంపుతో వారిని గారాబముతోఁ జూచును. నీవీరెండువిధములవారిగుణములను బాగుగా నెఱిఁగి దుష్టులను నిరాకరించి శిష్టులతోడి సాంగత్యమును వదలకుము. నీకు కలయందైనను దుష్టుల సంగతి వలదు. ౨౧౪.

కం॥ అందమగుస్వాతి వర్షపు । బిందువు లెందెందు బడునో పృథివీస్థలి ద । ద్బిందువులు పాధివశమున। జెందునుదగ నామరూప చేష్టాదికములు ♦ అట్లనె నీవు చెందెదవన్నియును ♦ మందితోఁ జతగూడి మాట్లాడినంతలో। సందు కేసహవాసమరయు ముతగువాని చేష్టాదికములు ♦ అట్లనే నీవు చెందెదవన్నియును॥ ౨౧౫॥

తా. స్వాతి కార్తెయందలి వర్షమునంబడిన వానబిందువులు, అవిపడునట్టి స్థలములయొక్క గుణదోషములనుబట్టి తాము వివిధరూపనామములచేతం బరగును వర్షబిందువు లన్నియునొకేవిధముగానే యుండును. పడునట్టి స్థలులు [అనగానున్ని చక్కపఱుపబడిన నేలలు] మాత్రము వేరు. స్థలులు వర్షబిందువుల కుపాధి ఎంతచోటునందు తామండునో, అంతచోటునందునుగల తనకన్న భిన్నములైన వస్తువులను చూపించి తానుండునది ఉపాధియన బడును. అట్లె నీవును దుర్జనులతోఁ గేరిన యెడల నీవును దుష్టుడనగుదువు. సజ్జనులతో మైత్రిసంపాదించిన యెడల శిష్టుడగుదువు. ౨౧౬.

కం॥ జారులకులోకులందఱు। జారులవలె దోచఁజమటసహజగుణంబౌ। చోరులకు సకలజనములు। చోరకులని మదికిఁ దోచు చునికిసహజము రా ♦ యట్లనెను దుష్టాత్మునికిసహజము రా ♦ సారములేనిసంసారాబ్ధిని దాటించు। వారిని దమవంటివారని గనుటెట్లుఉనికి సహజమురా ♦ యట్లనె దుష్టాత్మునికి సహజమురా। ౨౧౭॥

తా. విటులులోకమంతయు తమవంటిజారులేయని యెంతురు. దొంగలు ప్రపంచమునందుండువారందరు దొంగలేయని యెంతురు. ఇది సహజమేను. దుష్టాత్ముడైనవాఁడు. నిస్సారమైనట్టి సంసారసుఖసాగర

మును దాటించ సేర్చిన సద్గురుని కూడ తనవంటి ముముక్షువునిగా నెంచును.

కం॥ బయ లెఱుకలు శిష్యునకు। దయతో గురు డెఱుగ జే
సితరువాతనుసం। దియ మేమి లేక యెఱుకను। నయమున వి
డిపించు గురుడు నయశాలిగాదా♦ నీమదికిది నాటునా లేదా♦ భ
యభక్తిగురుసార్వభౌముని సేవ ని। శ్చయముగ జేసితె జయ
మందెదవు గురుడు నయశాలిగాదా♦ నీమదికిది నాటునా లేదా॥

తా. శిష్యునకు గురువు పరిపూర్ణ మెఱుకల రెంటిని విశదపఱ
చి, సందేహములెల్ల బాపి, లేని యెఱుకను విడిపింపజేసిన యెడల ఆగు
రువు బుద్ధిమంతుడుగాదా, నేజెప్పునది నీకు బాగుగా దెలియుచున్న
దా లేదా. భయభక్తులతో గురువే సర్వమని నమ్మియుండిన యెడల
నీకు విజయమగును. ౨౧౭.

కం॥ పదిరెండక్షరములుగల। సదమల మంత్రార్థ మెఱిగి
సద్గురుకృపచే। బదియూరక్షరములుగల। యది యెట్టిదో దెలి
సెనేని యతడె సద్గురుడు♦ ఈరెండెఱిగిన యతడె ధీవరుడు♦ మొదటి
ది పరిపూర్ణమును చెప్పు నెఱుక నుదదనంతర ప్రబోధను జేయున
వు దెలియుమతడే సద్గురుడు♦ ఈరెండెఱిగినతడే ధీవరుడు॥ ౨౧౮॥

తా. పది రెండక్షరములతో గూడిన నిర్మలమైన మంత్రమును
శ్రీగురుకటాక్షముచే నెఱిగి పదునారక్షరములతో గూడిన మంత్రము
నెవడైతే నెఱుగునో వాడే జ్ఞాని వాడే సద్గురుడు. మొదటిదైన ద్వాద
శాక్షరి పరిపూర్ణమును గురించి దెలియజెప్పును. రెండవదైన షోడశా
క్షరి తరువాత జేయవలసిన కార్యమును జెప్పును. అనగా యెఱుకను గు
రించి జెప్పును. ఈరెంటిని దెలిసినవాడే ధీవరుడు అనగా బుద్ధిమంతుడు॥

కం॥ ఆమంత్రయుగము జెప్పెద। నేమనమున దలచు
ము త్రిపుటిబట్టబయలు। ఏమియు లేదని బలికిన। నీమంత్రమాహాత్మ్య
మూలమిం కొకటి వినుము♦ ఎప్పుడు నోట నిదిమఱువక కనుము
ఈమూలము లేని గురు త్రిపుటి నశరీరము। ఏమిలేదనియుండు నిది
నా పద్ధతి యుండగా నిలిపి చుము♦ ఎప్పుడు నోటనిది మఱువక
కనుము॥ ౨౧౯॥

తా. ఆమంత్రములజంటను నేనుపదించెదను వినుము. మొదటిది

(అంతయూబట్టబయల్ ఏమియులేదు) అనునదిఅనగా సర్వమును పరిపూర్ణము. దీనినిమించినవస్తువు వేఱేదియులేదు. దీనినినియమముతో తలచుము. రెండవ మూలమంత్రమేమియన (ఈమూలములేనిగుర్తెఱిగేశరీరము ఏమి] షోడశాక్షరి. శరీరమంతయు నబద్ధమనియనుట. ఈమంత్రద్వయమును నీవు మఱువకుము. ౨౧౯.

కం॥ తొలిమంత్రపద్ధతెక్కడ। గలదోయని వెదుకనేలకలదం
తట నా। వలమంత్రపద్ధతెక్కడ। గలదోయనిచూడ నేలకా
దా చూచేది ♦ వినేదయనేదితినేది ♦ అలతొలుతదానినినవలో
కనముచేసి। కలకాలమెఱుకనుగలదానివిడుమెఱుకే కాదా చూ
చేది వినేది యనేదితినేది॥ ౨౨౦॥

తా. మొదటిమంత్రమునందు చెప్పబడినదానిమార్గమును యెక్కడనోయని విచారింపనేల. అది(బయలు) అంతటనునిండియున్నది, రెండవ మంత్రమునందు ప్రతిపాదింపబడిన దాని (అనగా యెఱుకయొక్క)మార్గమెద్దియని యడుగవలయునా అదియేకదా సర్వమును చూచునదియు వినునదియు, మాటలాడునదియు, తినునదియును. నీవు మొదటిమంత్రమునందు ప్రతిపాదింపబడియుండు దానినెఱిగి, రెండవమంత్రమునందలి దానిని విడిచిపెట్టుము. అనగా పరిపూర్ణమునుగ్రహించి యెఱుకను త్యజింపుము. ౨౨౧.

కం॥ ఇదితప్పనేమిలేదని। మొదటిది మొఱపెట్టుచుండు
మదమునవినుమిరా। యిదియేమిలేదుపొమ్మని। వదలక రెండవది
తెల్ప వదరుచుండునురా ♦ బయలెఱుకలు ఇదినిశ్చయమురా ♦ అ
దిగానసీరెంటి నరసినీవిప్పుడు। విదితముగ నెఱుకను విడురమం
త్రమిట్లు వదరుచుండునురా ♦ బయలెఱుకలు ఇదినిశ్చయ
మురా॥ ౨౨౨॥

తా. మొదటిమంత్రమైనద్వాదశాక్షరిపరిపూర్ణముతప్పసింకేదియులేదని మొఱపెట్టుచుండును. రెండవదియో ఎఱుకే లేనేలేదని జెప్పుచుండును. పరిపూర్ణ మెఱుకల స్థితి యిదియేయని తెలియుము. కావున నీవిప్పుడు రెంటిని గుర్తెఱిగి, యెఱుకను త్యజింపుము. ౨౨౩.

కం॥ పరిపూర్ణమిదిగో యిదిగో। యెఱుక [illegible] జూపించి లే

నియెకను లేదం। చెతెఁగించిన గురుఁడేసరి। యెఱుకను నిల్పె
టిగురుఁ డెందుకోయన్నా ♦ తద్బోధనీ కెందుకోయన్నా ♦ శ
రణన్న వారి మస్తకమందుఁ జెయివెట్టి । తిరముగ నెఱుకను దీ
సి వేయని వాఁడెందు కోయన్నా ♦ తద్బోధ సీ కెందుకో
యన్నా॥ ౧౧౧॥

తా. పరిపూర్ణమును. ఎఱుకయొక్క సాహాయ్యము చేతం జూపించి లేని యెఱుకను సళింప జేయువాఁడే గురువు. ఎఱుకను పోగొట్టజాలని మాత్రపుగురువు కాఁడు. అట్టివానిబోధయు సద్బోధ కాఁజాలదు. నీకట్టి గురువును, అట్టిబోధయు వలదు. శరణుఁజొచ్చినవానిని శిరమున చేయుంచి అనగా నాదరముతో ఎఱుకనుండి విడిపించువాఁడే గురువని నమ్ముము. అట్లు కానివాఁడు నిరర్థకుడు. ౧౧౧.

కం॥ పరిపూర్ణ బోధ నెఱుఁగని। గురుశిష్యులు బోధకొఱ
కుఁగోరఁబనిపడె । గురువర్యుఁ డొకని మజిలను। హరువర
మునఁబుట్టి నట్టియా శిఖండికిని ♦ సతియైనట్టి యబలతండ్రికిని ♦ వ
మలసిద్ధజనిఁ దేవలయు నీయల్లుఁడు నేను। వరియింతుమని చెప్పి
నరుసపంపిన యట్టులా శిఖండికిని ♦ సతియైనట్టి యబల తం
డ్రికిని ॥ ౧౧౩॥

తా. తొల్లి మహేశ్వరుప్రసాదమున ద్రుపదేశ్వరుడు శిఖండి యనునొకకూతుఁగనియె. ఆబిడ్డ పురుషరూపమును చెందునని వరము గావునవానిశిశువుయొక్క స్త్రీత్వమును గోప్యముగానుంచి యెల్లరకు నుపురుషశిశువేయని వెల్లడిచేసిరి వివాహకాలమాసన్నమైనందున వాలుని తీసికొనిపోకనే యొక చంద్రాయుధమనుకు కాశీరాజుకూతును పరిణయము జేసిరి. కొద్దిదినంబులకా కాశీరాజతనూజయు, భర్తయు తన వంటి స్త్రీయేయని దెలిసికొని తనతండ్రికి యీలాగువర్తమానమంపెను నాకునునీయల్లునకునునిరువురు పురుషులను వెంటదీసికొనిరమ్మని వ్రాసెను. ఇంతలకా రాజాగ్రహించి సేనాపరివారములతో ద్రుపదదేశముపై దండెత్తెను శిఖండియు భయపడినదై యడవికి పాఱిపోయి, అక్కడనొక యక్షునిగని, యాతని పురుషత్వమును దానుగ్రహించి తన స్త్రీత్వమును నాతనికిచ్చియంపెను. ఆటులపురుషాకారముతో నామగువను

యథావిధిం జేపట్టి సుఖంబుననుండెను ఇతడే భీష్మునివధియించినవాడు ఎటులనైతే. పురుషత్వములేని శిఖండియు, భార్యయు, పురుషునిగోరి రో, అట్లె పరిపూర్ణజ్ఞానము లేని గురుశిష్యులిద్దరును మఱియొక గురునొద్దకుంబోయి పరిపూర్ణమును దెలిసికొనవలయును. ౧౧౩.

కం॥ పరిపూర్ణ బోధ నెఱింగిన । గురువరుచే బోధగొనిన గొప్పఫలంబౌ। బరిపూర్ణ బోధ నెఱుఁగని । గురువుచే బోధగొనినగొప్పఫలమౌనా ♦ అదియెట్లన్న గూడిరతిలోనఁ ♦ బురుషునిచేసంతు పొలఁతినడయునుబడయఁ । దరమౌనెవారికిఁ దమవంటివారిచే గొప్ప ఫలమౌనా ♦ అదియెట్లన్నఁ గూడిరతిలోన॥ ౧౧౪॥

తా. పరిపూర్ణమును నెఱిగిన గురునొద్ద దీనిం దెలిసికొన గొప్పఫలమిచ్చునుగాని, అచలబోధను దెలియనివానివద్ద నుపదేశము జెందినయెడలఫలమిచ్చునా, ఇవ్వజాలదు. అదియెట్లనగా, స్త్రీపురుషులిద్దరు సంభోగించినయెడల శిశువుల బడయవచ్చునుగాని, ఒకేజాతివారు అనగా పురుషులతోడ పురుషులును, స్త్రీలతో స్త్రీలును సంభోగించినబిడ్డలు కలుగునా కలుగనేరదు. పరిపూర్ణబోధ తెలియని యితర మతస్థుల వలనయెఱుకపోజాలదు. కావున పరిపూర్ణము నెఱిగినగురువు నే సంపాదించుకొనుము. ౧౧౪.

కం॥ దృష్టాంతము దొఱకెనునీ । యాత్మము గదలించఁగానెనిజకల్లనుచుఁ । దృష్టాంత మడుగబోధకు। స్పష్టముగాగప్పురముదీపముఁ జూపరోయి ♦ యీ యుక్తిలోపముఁ జేయకోయి ♦ తుష్టినొందెదరిట్లుతోచి చెప్పితిగాని । శ్రేష్టమీబోధచేకొన్న వారికి దీపము జూపవలెరాయి ♦ యీ యుక్తిలోపము జేయకోయి ॥ ౧౧౫॥

తా. ఈబోధనీనోటనుండిజాఱగానే యెవరేనియుదృష్టాంతములడిగినచో వారికి కప్పురమును ప్రజ్వాలింపజేసి దృష్టాంతముగాజూపుము. ఇట్లుచేయుటకు వెనుకదీయకుము. ఎటులనైతే ప్రకాశించు కర్పూరమెదుట నన్నియు స్పష్టముగా తెలియునో అట్లు పరిపూర్ణజ్ఞానమను వెలుతురియందు అన్నియు స్పష్టముగా దెలియును. ఈ దృ

ష్టాంతమును జూపిన యెడల జనులు తృప్తినొందుదురు. కావుననే నిట్లు జెప్పితిని. ౨౧౫.

కం॥ ఎఱుక భ్రమగల్గుశిష్యుని । పరితాపము మాన్పునట్టి పండితు డితడే। గురువరుడుగాని గురువులె। గురువులమని పొట్ట కొఱకు గొణగేవారెల్ల ♦ వారికిబోధ దెలియుటకల్ల ♦ పరిపూర్ణమునలేని యెఱుక నేర్పడ దెలిపి। యెఱుకనువిడిపించ నెఱుగక గురువులైగొనిగే వారెల్ల♦వారికిబోధదెలియుటకల్ల॥ ౨౧౬॥

తా. ఎఱుక యొక్క భ్రమను జెందియున్న శిష్యునిదుఃఖమునుమాన్పువాడెగురువు తక్కినవారు గురువులుగారు వారు ఉదరపోషణార్థము కొఱకు గొణగువారని దెలియుము. పరిపూర్ణమునందు లేనటువంటి యెఱుకను చూపి దానిని పోగొట్టజాలనివారుగురువులుగారు. వారుమోసగాండ్రని దెలియుము. ౨౧౬.

కం॥ గురువు శుశ్రూష యొనర్చుట । నెరిగించెద నెట్లులని ననేర్పడ వినుమీ । నరులిష్టదైవమునకుం । బరిచర్యయొనర్చునట్లు భక్తిశోభనను ♦ గురుమూర్తి కత్యుక్తిశోభనుతను ♦ నిరతమరమరలేక నిప్పసల్పితి వేని। గురుబోధమెఱుగుసద్గురునిచే దెలిసేవ భక్తిశోభనుతను ♦ గురుమూర్తి కత్యుక్తిశోభనుతను॥ ౨౧౭॥

తా. గురునికి శుశ్రూష చేయుపద్ధతిని దెలిపెదను వినుము. ఇష్టదైవములకు నేలాగున గంధ ధూపదీపనైవేద్యములర్పించి పూజయొనర్తురో: అట్లె మనస్సున సంశయములుంచుకొనక గురుని అర్చించెనేని పరిపూర్ణము యొక్క పరమరహస్యమును శిష్యుడు తెలిసికొనును. ౨౧౭.

కం॥ తనుమనధనములుగురునకు। వినయంబున ధారవోసి వేడ్క గురునిచే। ననువైనబోధవడసిన। ఘనమతిమంతునకుసాటి గలరాయీభువిని♦లోకులు। మ్రొక్కవలదా తాము విని♦ తాను నితరులనితానసక యేమాట। వినక పరిపూర్ణతదనకు వారికిసాటిగలరాయీభువిని♦ లోకులు మ్రొక్కవలదా తాము విని॥ ౨౧౮॥

తా. గురునికి, ఆత్మార్పణంబును ధనార్పణంబును, భక్తితో జేసి యాతనివలన బోధనందిన మహాత్మునకు సాటియెవ్వరును లేరు అట్టి వానిని జూచినప్పుడు వానికందరును నమస్కారముచేయవలయును నే

ను నివులను భేదము దెలియునట్టియు నూట్లాడనట్టియు విననట్టియు, అనగా వృత్తిరహితమైనట్టియు. నెవ్వరునుసాటిలేదని దెలియుము. ౨౨౮.

కం॥ జలమునెడఁ బాయనొల్లని । జలచరముల దీవిపూని సచ్ఛిష్యుఁడుహృ। జ్జలజంబను పీఠముపై। నిలిపితరముమానిగురుని నేగొల్చుసుమ్మి॥ తదుక్తులనే దలచునమ్మి॥ కలకాలమిారీతిగ డపుచునే। ప్రాద్ధతలిదండ్రిదొరదాతదైవమనుచుగురువునేగొల్చుసుమ్మి॥ తదుక్తులనేదలఁచునమ్మి॥ ౨౨౯॥

తా. నీటిని విడిచి వెలుపలరానిష్టపడుమత్స్యాదిజలజంతువులవలె శిష్యుడునుతనహృదయకమలమునందెప్పుడును గురురూపమునే ధ్యానించుచుండునుగాని యితరమైనసాటిపై మనస్సును పోనివ్వడు. గురువాక్యములను సదా తలచుచుండును. తన జీవితకాలమంతయు నీలాగుననే చేయుచుండును గురువునే తలిదండ్రులనుగాను దొరగాను దైవముగాను భావించుచుండును. ౨౨౯.

కం॥ సతిపొరుగూరికిపోయిన। పతిరాకడగోరినట్లుభావములోనన్ । మతిమంతుఁడు సచ్ఛిష్యుఁడు। సతతముగురురాకగోరు సత్యమువినరా॥ వానితోటిసాటెవ్వరనరా॥ హితునిరాకడకు స్నేహితుఁడుగోరినయట్లు । అతిదరిద్రుఁడుద్రవ్యతతిని గోరినయట్లు సత్యమువినరా ♦ వానితోటిసాటెవ్వరనరా॥ ౨౩౦॥

తా. పరదేశంబునకుంబోయిన భర్తరాకకుభార్యయేలాగు నెదురుచూచుచుండునో, మిత్రునిరాకకు నేలాగు నెదురుజూతురో దరిద్రుండైనవాడు ధనప్రాప్తిని యేలాగు నెదురుజూచునోఅల్లె. మంచిశిష్యుడు తనగురుని రాక కెదురుజూచుచుండును. అట్టిశిష్యునిసమానులీలోకమున లేరు. ఇది నిజమైనమాట. దీనినినమ్ముము. ౨౩౦.

కం॥ అతివలరతిచతురతలు। యతులచేవారితండ్రులరయరనుచుఁద। త్పతులరయనేర్తురట్లనే। మతిమంతుఁడు గురుని బోధ మానినఁగాని ♦ తద్బోధతామానఁడుపూని ♦ అతిదరిద్రుడుచే విద్యార్జనాఘనుఁడు। చతురుని విత్తమార్జించిన తంతులుమానినఁ గాని♦ తద్బోధతామానఁడుపూని॥ ౨౩౧॥

తా. స్త్రీలచాతుర్యమునువారితండ్రులు తెలియజాలరు. వారి

పతులు తమభార్యలు తెలుపకయే వారి చాతుర్యములను దెలిసికొం దురు. అటులనే బుద్ధిమంతుడైనశిష్యుడు తనగురుడు చెప్పకయే బోధ ను దెలిసికొనును. దరిద్రుడు తనయొద్ద విద్య నేర్చుకొనుటకు వచ్చిన ధనవంతునియొద్ద క్రమేణ ధనములాగునట్లు బుద్ధిమంతుడైన శిష్యు డు గురునియొద్దనుండి క్రమేణ బోధను దెలిసికొనును. ౨౩౧.

కం॥ పరిపూర్ణబోధదెల్పెడు। పరియంతము శేవజేసి బహు
నమ్మికగాగురుమూర్తికి దరువాతను ! మరికన్నుల గననివాని
మార్గము ఛీఛీతలచరాదామాటలుఛీఛీ॥గురువాజ్ఞవినని దేగు
రువై శిష్యులఁగూర్చి। గురుబోధదెల్పెడు గురువంచ కునియొ
క్క మార్గముఛీఛీ ♦ తలఁచగాదామాటనుఛీఛీ॥ ౨౩౨॥

తా. పరిపూర్ణమునుగురుడు తనకు దెలియజెప్పునంతవఱకునా తనికి శుశ్రూషాదులొనర్చి. బోధనుదెలిసికొనిన పిమ్మట గురునికంట బడని శిష్యుడుశిష్యుడుకాడు. వాడుద్రోహి, వానినమ్మకుము. వా నిని గుఱించి తలచినగూడపాపముసంభవించును. గురునియనుమతిం బడయకయే. తానునుకొందఱు శిష్యులను గూర్చుకొని వారికుపదేశ ముజేసెడు వేషధారిని నమ్మకుము. వాడుమోసగాడు. టక్కరి. ౨౩౨.

కం॥ తనశిష్యులువిసతనునతి। వినయంబునగొలుచుకొఱకు
వినుతులొనర్చుచు ! దనగురువునుగురునింటికిఁ । జను దెంచినఁ
జూచి శుశ్రూషతానొనర్చండు ♦ లేమినిఁ దెలిపి చనుమను
చుండు ♦ వినుముకుత్సితశిష్యాగ్రణివీడు వీఁడెట్లు । ఘనబో
ధోత్కృష్టిఁగనునో గురునకు శుశ్రూషతగ నొనర్చండు ♦ లే
మిని దెల్పి చనుమనుచుండు॥ ౨౩౩॥

తా. కొందఱు, తమశిష్యులు తమ్మునొప్పువారని యెంచి త మ్ము పొగడిఱ సేవించుటకొరకై తమగురువులమహాత్మ్యంబును త మశిష్యులయెదుట కీర్తింపుచుందురు. అట్టివారలు తమగురువులే త మయింటికి వచ్చినపుడు వారలను సరిగానాదరింపరు. అతనికి శు శ్రూషాదులు సరిగాచేయరు. అతనితో తమదారిద్ర్యమును దెల్పు కొని వానిని అంపించివేయుదురు. ఇటువంటివారికి పరిపూర్ణజ్ఞానమే లాగు కలుగునో ఆలోచింపుడు. ౨౩౩.

కం॥ కుటిలాత్ముఁడైన శిష్యుం। డిటువలెదా బల్కుఁగురుడు నింటికిరాగా। నెటుబోవుచుండిరాకో। యిటకిక దర్శనముమ ళ్ళియెప్పుడయ్యెనో♦ యెవరికి దెలియునెవ్వ డేమౌనో♦ యెటు దోచదేమైనని త్తనుంచనుకొంటె। తటుకున నొక రాగిదుడ్డయి నలేదిపు డెప్పుడయ్యెనో♦ యెవరికిదెలియు నెవ్వ డేమౌనో॥ ౧౩౪॥

తా. కుటిలుండైనశిష్యుడుతనగురునింటికివచ్చినపుడు వానితో నిట్లనిచెప్పును అయ్యా మీరెక్కడికి బోవుచున్నారో మాకుదర్శనమి చ్చితిరి. ఇంక యెప్పుడు దర్శనమిత్తురో తెలియదు. రాబోవు సంగతు లలో నెవియెప్పుడెప్పుడు జరుగునో యెవ్వరికిని తెలియదు. తమకే మైనను కానుక సమర్పించు కొందామంటే నాదగ్గిర నొకరాగి కా సైనను లేదు. నాకేమియు దోచలేదు. ౧౩౪.

కం॥ జపములు తపములు సలుపుచు। విపరీతస్మరణ జేయు వే దాంతార్థం। బపరిమితంబుగ జెప్పును। గపటాత్ముఁడు శిష్యకో టిగనిమెచ్చుకొఱకు ♦ మెచ్చి ద్రవ్యమును నిచ్చుకొఱకు♦ అప కీర్తిసేతల కమరినట్లగుపడి। యుపముచే బ్రతుకుచునుండులో కులు తన్ను గనిమెచ్చుకొఱకు ♦ మెచ్చి ద్రవ్యమును నిచ్చు కొఱకు. ౧౩౫॥

తా. కపటాత్ముండైన శిష్యుడు యెల్లప్పుడునుజపతపములు సే యుచుండును. ఎదియో ఒకస్మరణ జేయుచుండును. ఎప్పుడుజూచినను వేదాంతము మాట్లాడుచుండును. ఇదియంతయు జేయుటపరమార్థము కొఱకుగాదు. తన్ను తనశిష్యులుచూచి మెచ్చుటకొఱకును తనకు బ హుమతు లందరునిచ్చుటకొఱకును యీవిధమున జేయును. ఈబ్రతు కు మిగుల నీచమైనది. ౧౩౫.

కం॥ గురుమూర్తి కెదురహంకృతి। దొరకొన్నను దొంగ త్రోవ ద్రొక్కిన చెవులం। గురునింద వినిన జేసిన। నరునకు బరిపూ ర్ణబోధ నలవియె తెలియ♦ కూడదు వాని దెలియకకలియ ♦ గురుడు దెలిసిన పుస్తకరీతిచే బూర్ణ। మరసితినని యెంతో ము రిసిన గురుబోధ నలవియె తెలియ ♦ కూడదు వాని దెలియ కకలియ॥ ౧౩౬॥

తా. గురుని యెదుట నహంకారము జెందిన వాడును, తప్పావుగ్రంథ వలయందు బోవువాడును, గురునిందను విన్నవాడును, గురుని నిందించు వాడును, పరిపూర్ణబోధను దెలియలేరు అట్టివానితో సహవాసము జేయ కూడదు. గురునికి దెలిసిన పరిపూర్ణమును దెలుపు నచలగ్రంథము చే నేను పరిపూర్ణమును దెలిసికొంటినని వాడెంత చెప్పినను వానికి బోధ కలుగనేరదు. ౨౩౬.

కం॥ నాలుగుశుశ్రూషణములు । లోలతగావించుకొనుచు లోకాతీతం । బాలోకించియుగురుచే । నీలోకముజోలివిడువు మింతేచాలన్నా ♦ నీతో గూడ నిదిమఱువకన్నా ♦ కీలు దెలియ నిచదువుచాలాచదివెందుకు। చాలించునీవిట్టికీలు దెలిసితివేని నింతే చాలన్నా ♦ నీతో గూడ నిదిమఱువకన్నా ॥ ౨౩౭॥

తా. గురునకు నాలుగువిధములైన యర్పణములు సేయవలయును. అవియెవ్వియనగా. తన్వర్పణము, మనోర్పణము, ధనార్పణము, వచనార్పణము. తన్వర్పణమనగా గురునకు చరణసంవాహనాది శుశ్రూషలచేయుట మనోర్పణమనగా గురువునందు దోషబుద్ధిమియునుంచక పూజ్యబుద్ధియెనుంచుట, ధనార్పణమనగా, గురువు గృహస్థులైన పక్షమున భార్యాది సకలధనములను నాతని వశము జేయుటలేక గురువు త్యాగియైన పక్షమున ధనమునంతయు త్యజించి గురుశరణ పొందుట వచనార్పణమనగా గురుని స్తుతించి తనదీనతను దోవజేయుట. ఇట్టి చతుర్విధశుశ్రూషలచేగురుని సంతోషింపజేయుచుండుము. అన్నిటిని త్యాగముచేసిగురువాక్యమే శరణమని నమ్మియీతనినాశ్రయింపుము దీనిని మఱువకుము. ఈకీలును నెఱుగజేయజాలని చదువునిరర్థకములు నీకికీలు దెలిసినయెడల చాలును అదినిన్ను కడతేర్చును. ౨౩౭.

కం॥ దేశికుని చరణతీర్థము । కాశీ గంగయని గురుని గను గొన్నను విశ్వేశుండని తనకును నుప దేశంబొనరించునట్టి దే తారకమని ♦ మనసందు దానెతీరుగని ♦ యే సీమయందున్నగా శ్రీప్రయాగరా। మేశుని పురమై ప్రకాశించునా సీమ యదే తారకమని ♦ మనసందుదానీ తీరుగని॥ ౨౩౮॥

తా. గురుని పాదజలములను కాశీగంగాజలములుగాను, గురువును

కాశీవిశ్వేశ్వరుడేయనియు. అతనుపదేశించుబోధయే తారకమంత్రమనియు మనస్సునందు భావింపవలయును. అతనుపదేశముచేయుప్రదేశము కాశీరామేశ్వరాది పుణ్యక్షేత్రములకు సమానముగా నెంచవలయును. ౨౩౮.

కం॥ గురుచరణజలముగోదా। వరియని గురుము తిరారామభద్రుండనితె। త్పురమునుభద్రాచలమని। గురుమంత్రమె
తారకమని గుఱికగల్గినట్టి ♦ తిరిగిరానిమఱుగెఱిగినట్టి ♦ గురుకున్నచోటె సుందరమైన శ్రీశేష। గిరిరంగనాయక పురమనదగియుండుగుఱికగల్గినట్టి। తిరిగిరాని మఱుగెఱిగినట్టి॥ ౨౩౯॥

తా. గురుని పాదోదకమే సప్తగోదావరంబనియు, శ్రీగురుడు రామచంద్ర స్వరూపుడే యనియు, ఆతడుండు పట్టణంబు భద్రాద్రినాథుని వాసస్థానంబైన భద్రాచలంబేయనియు. ఆతనుపదేశముజేయుమంత్రమె తారకమంత్రమనియు నెమ్మనంబున నెంచియుండు శిష్యావతంసుడు, భవనాశరహితంబైన పరిపూర్ణంబును జెందును శ్రీగురునివాసస్థానము, రంగనాథువాసస్థానమైన శ్రీరంగ పట్టణమునకు సమానమని చెప్పుదురు. ౨౩౯.

కం॥ గురుడునరుడంచు దలచిన। గురుమంత్రము మరచియున్న గురుపుత్రులనా। దరణరొనర్చికయుండిన। గురుపు
ను విడనాడిరెండౌగురుని జేరినను ♦ సద్గురునిబోధ నెఱిగిదూఱినను ♦ యెఱుక మహాత్మ్యము నెఱిగిన యిటువంటి నరునకుదప్పదు నరకముమఱియొక్క గురుని జేరినను ♦ సద్గురుబోధనెఱిగి దూఱినను॥ ౨౪౦॥

తా. శ్రీగురుని నరసామాన్యుగా భావించినను. గురువుచే దెలియబడ్డమంత్రమును మఱచినను. గురుసంతానమును అనాదరణ జేసినను ఒకగురుని వదలిపెట్టి మఱియొకగురుని నాశ్రయించినను, గురుబోధను కావలయునని నిందించినను, ఎఱుకనేనిజమని నమ్మిదానియందనురక్తుడై యుండినను, పైజెప్పినవాటిలో దేని జేసినను ఘోరనరకవాసము శిష్యునకు తప్పదు. ౨౪౦.

కం॥ జ్ఞానవైరాగ్య భక్తుడ। మానసదీక్షాన దేవమంత్రిప

తనత । ధ్యానమభి మంత్రములుపర । మానని యతిగోరినట్టి
మనుజ సంఘముకు ♦ బోధను దెల్పు మనినవారలకుఁ ♦ దాను
బోధించుట తగదుబోధించినఁ। దాను నేనను భ్రాంతి తొలఁగు
టేలాగనిన మనుజ సంఘముకు ♦ బోధను దెల్పు మనిన
వారలకు॥ ౨౮౧॥

తా. కర్మభక్తి జ్ఞానమార్గములయందును వైరాగ్యాదుల యందును గంగాదిపుణ్యనదులయందు స్నానమాచరించుట యందును, పంచాక్షర్యాది దేహితోపాసనల యందును. ధ్యానమునందును, మంత్రములయందును, నమ్మకము కలిగి ఇవియెల్లను పరమార్థసాధకములనియెంచువారలకు, వారెన్ని మాఱులు దెలుపమని వేడినను నీబోధను దెలుసకుము. అట్లువారికి తెలిపినను కూడ వారికి నేను నీవు అనుభేదబుద్ధివదల నేరదు. వారా భ్రాంతియందేయుందురు. ౨౮౧.

కం॥ ఇంగితము నెఱిఁగిసద్గురు। పుంగవుచేనరుఁడు భక్తిము
క్తిక్రియలఁ। సంగాసంగము వెడలిన। శృంగారమె వానిచే
ష్టచూచువారలకు ♦ వాఁడున్నట్లు తోఁచువారలకు ♦ మంగళ
సూత్రమెభృంగి శృంగారమో। శృంగారవతికి నాశృంగార వ
తికిట్లుచూచువారలకు ♦ వాఁడున్నట్లుతోఁచువారలకు॥ ౨౮౨॥

తా. జ్ఞానియైన శ్రీగురునికటాక్షముచే, భక్తిముక్తిక్రియల, చేరికయును. చేరకయుండుటయును రెంటినువిడిచిపెట్టినవాని చేష్టలన్నియు చూచుటకు వింతలుగా నుండును. మానినియైనపతివ్రతకు మంగళసూత్ర మేలాగు ప్రధానభూషణముగానుండునో అట్లెపురుషులకు పరిపూర్ణజ్ఞానమేయుత్తమభూషణములు. ౨౮౨.

కం॥ జనులందఱు గురుబోధను। గనిరాజనులందు నేనుఁగలి
యకయున్న। న్ననుమన్నింతు రెవారని। మనసునం దలఁపోయ
బోధమర్మ మబ్బునా ♦ అబ్బినవారి ధర్మమబ్బునా ♦ జననమ
రణములేని ఘనమైనత్రోవనేఁ। గననైతినీబోధ గనకున్నయీ
బోధ మర్మమబ్బునా ♦ అబ్బినవారి ధర్మమబ్బునా॥ ౨౮౩॥

తా. సత్పురుషులందురును పరిపూర్ణబోధను గలిగియుండగానే నుమాత్రమువారితోగలియకుండినపక్షమున బాగుండునాయనియెంచి

పరిపూర్ణజ్ఞులతో నెవ్వడేనితానును జేరనేని వానికాబోధయొక్క మర్మములు తెలియునా. అనగా తెలియదు. అటుల దెలిసినను వారియొక్క పుణ్యమువంటి పుణ్యమితనికి రాజాలదు. భవనాశరహితమైన పరిపూర్ణబోధదెలియనివారికి దానిమర్మ ధర్మములు దెలియ నేరవు. ౨౪౩.

కం॥ హృదయ గ్రంథీవిడుటకై। సదయతనీబోధదెల్పఁజన
దాగురుఁడై । వదలకచిత్తము లోపలఁ। బదయుగములు ద
లఁపవలదె భక్తుఁడైనపుడు ♦ భ్రాంతి రహితా సక్తుఁడైనపు
డు ♦ కుదురవి వీరెండుగురుశిష్యులకుఁగాక। కదలిక లేనట్టిఘ
నబోధో క్తస్థితి భక్తుఁడైనపుడు ♦ భ్రాంతి రహితా సక్తుఁ
డైనపుడు॥ ౨౪౪॥

తా. శిష్యా, హృదయమునందలిముడివీడునట్లు అనగా నెల్ల సందేహములుదీరునట్లు గురువైనవాడు దయతో నుపదేశము చేయవలయును. శిష్యుడైనవాడు తానును, శ్రీగురు చరణారవిందంబులకు మనస్సునందెల్లప్పుడును తలచుచుండవలయును. గురునియందు భక్తిగలవాడైన పక్షమునను భ్రాంతులన్నియుపోవలయునను నిష్టమున్నయెడలను శిష్యుడాలాగు గురునిదలంచుట కర్తవ్యముకాదా. గురువుతానాలాగు సందేహములు వీడునట్లుపదేశముచేయకపోయినను శిష్యుడాలాగు గురునిసేవించకపోయినను. పరిపూర్ణజ్ఞానము యుక్తమైనవిధమందు దెలియ నేరదు. ౨౪౪.

కం॥ గురుఁడాసవదలకుండిన। మఱిశిష్యుఁడుద్రవ్యలోభమ
ఘ్నుండైనఁ । మరియాద దక్కిదిరువురు। కెఱఁగుండుము వి
రలతి హీనులోయన్నా ♦ గట్టిగదురభి మానులోయన్నా ♦ గు
రుఁడుశిష్యునిఁగన్నకొడుకుగాఁగనకున్న। గురునిపై శిష్యుడాగు
ఱి నిల్పకుండిన హీనులోయన్నా ♦ గట్టిగా దురభిమాను
లోయన్నా॥ ౨౪౫॥

తా. గురుడు అత్యాశగలవాడుగానుండినను శిష్యుడు అమితలోభిగానుండినను, గురుశిష్యులకిద్దరికిపొందుగలుగ నేరదు ఇట్టివారినిహీనులనుగా నెఱుగుము. వీరుదురభిమానులు. గురుడుశిష్యునిపై పుత్రవాత్సల్య ముంపకున్నను, శిష్యుడుగురుని జనకునిగాభావింపకున్నను వారి

ర్థరికి పొందుకలుగనేరదు వారు నీచులు. ౨౪౫.

కం॥ గురుగురు బోధలచేతను। బరిపూర్ణం బెఱిఁగి మెలు కవదలినయతనిఁ। గుఱుతెఱుఁగ నరులసక్యమె। మెఱిఁగిన నరులట్టి బోధ నెఱిఁగెదరోయన్న ♦ దారెఱిఁగిన మఱుగుండ దన్న ♦ చిఱుతపాపనిరీతి మఱి పిశాచముభాతిఁ। దిరుగుచు నుం డు వెక్కలిమాడ్కి గురుఁడెల్లెఱిఁగెదరోయన్న ♦ దారెఱిఁ గిన మఱుగుండదన్న॥ ౨౪౬॥

తా. పరిపూర్ణబోధను గురునిచే గ్రహించి. పరిపూర్ణము నెఱిగి మెలుకను త్యజించిన మహాత్ముని దెలిసికొనుట యసాధ్య ము. అట్టి మహాత్ములను దెలిసికొనును వారిబోధను దెలిసికొనుట సాధ్యము కాదు అట్లు మెఱిగిన పక్షమున వారికేలాటి సందేహము లును ఉండవు పరిపూర్ణబోధ నెఱిగినవారు చూచువారికి బాలుర రీతిగాను పిశాచములరీతిగాను, వెర్రివాండ్ర వలెను వర్తింపుచుందు రు కావున వారిని దెలియుటకష్టము. ౨౪౬.

కం॥ మలయాద్రి యున్న చెంచులు। కిలచందన భూరుహము లెయింధనమటమి। క్కిలిగలుగఁ బట్టియట్టులె। చులకన సు మియింటగల్గు సూరిభూషణుడు ♦ బహుమాన్యుడు దూరస్థు డెపుడు ♦ తెలియనివారికి దెలిసేది కఠినము। తెలివిచే దెలి పితె తెలియ జేసినబోధ సూరిభూషణుడు♦ బహు మాన్యుడు దూరస్థుడెపుడు॥ ౨౪౭॥

తా. మలయపర్వతమున వాసము జేయు చెంచువాండ్రుచందన పుకట్టెలనేపొయ్యికిగట్టియలుగా నుపయోగింతురువిలననగా అక్కడ చందనపువృక్షములు విస్తారము అట్లే గురువును దగ్గరయుండిన యెడ లనాతనిమీద భక్తియెక్కువగానుండదు. కావునగురుడు దూరముగా నుండవలయును అప్పుడే యాతనిమీద నధికభక్తియుండును. ౨౪౭.

కం॥ దూరముననుండివిన్నను। జేరును సజ్జనుడుగురుని చెం తకుబోధకై। గోరియుదుష్టుడుగోరడు। దూరస్థుడు గాక గురు నిం గూడియుండి ♦ యెట్లనియన్న దూరాన నుండి ♦ కోరితు మ్మెదతమ్మి జేరితేనియగ్రోలు। నారీతి నెఱుగవు చేరికప్పలు

మ్మిగులఁ గూడియుండి♦ యెట్లనియున్న దూరాననుండి ॥ ౨౮౮॥

తా. పూదేనెయందాసక్తిగల మధుపములు [తుమ్మెదలు] సరసిజము లెంతదూరమున నున్నను వానిలోఁ జేరి మధుపానము జేయును. కప్పలు తామరపుష్పముల చెంతనున్నను వానిలోని మధువును పానము సేయజాలవు, అట్లె పరిపూర్ణ బోధయందాసక్తిగల సజ్జనులు యెంతదూరదేశమున నున్నను సద్గురుని పాదారవిందముల జేరి బోధను దెలిసికొందురు. అట్లుగాని దుర్జనులైనవారు సద్గురు చెంతనున్నను బోధను గననొల్లరు. ౨౮౮.

కం॥ వాసిని దెలిసినశిష్యుని। యాశ్రమమునకుఁ దగినబోధ
యతనికిఁ దెలియం। జేసిముదమంద జేసెడి దేశికుడే ముఖ్యు
డనుచు దెలిసికోవోయి ♦ కనియాతని గలిసికోవోయి♦ చేసి
నదయతో నీయాశ సంపూర్తిలు। వ్రాసిన వేసుకొని చూచెదుత
రువాత దెలిసికోవోయి♦కనియాతనిగలిసికోవోయి॥ ౨౮౯॥

తా. మంచిచెడులను దెలియనేర్చినశిష్యుని, ఆతనియాశ్రమమునకు(అనగా బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాస, ఆశ్రమములలో నేది యాతనిదానికి)తగిన బోధనంతటిని సుపదేశము చేసి ఆతనిని సంతోషింపజేయ నేర్చినగురుడే ఉత్తముడు. అట్టివానిని కనిపెట్టి, ఆతనినాశ్రయింపుము. అట్లుచేసిన యెడల నీయభీష్టములన్నియు తీరును, నీవిది నిజమని నమ్ముము. కావలయునన్న నేను వ్రాసియిచ్చెదను చూడుము॥ ౨౮౯॥

కం॥ మంతసమున గురుబోధను। నెంతో వింతనుచునమ్మి
తింతేగదయో। వింతలు గనరానిదిధా। వంతయునొందేటి వా
నిబ్రతుకంతకంతే ♦ చింతలు తేని గతిగానందంతే ♦ అంతకంత
నువాని కలిచాద స్వమేగాని। సంతసమాటమునంటి సంభోగిం
చెడువాని బ్రతుకంతకంతే♦చింతలు లేనిగతి గానందంతే॥ ౨౯౦॥

తా. శిష్యా! కుటిలులైన వారు నొకపరిపూర్ణము నెఱిఁగిన సద్గురునొద్దకు వచ్చియాతని బోధనుగల వింతగా వినసి యెంచియాతనికి శుశ్రూషాదులొనర్చి యాతని యొద్ద వింత లేదియు గానక మిగుల విచారగ్రస్తుడై యేగును. ఎట్లనగా ధర్మపత్ని యొక్క పొందును మెలుగాదని యెంచి వారాంగనతోడి సాంగత్యము చేయు జారపురుషునను,

తాను యిచ్చించిన సుఖములు సుఖములే కావని తెలిసికొని విచార
గ్రస్తుడై యుండును. ౨౫౦.

కం॥ తనగురుబోధను దాఁజది। వినవినుజనవితతిమదికివింత
యియాబో। ధనునేర్పకున్న వ్యర్థము।జననంబని సోఁచిశరణు
శరణనునట్లు♦ వెంటనె వారు దరిఁజేరునట్లు ♦ ఘనమైనయుక్తిఁ
జేకొను వాఁడే శిష్యుఁడు। అనుమాన మేమియుఁగనరాదువిన
వోయిశరణనునట్లు ♦ వెంటనెవారు దరిఁజేరునట్లు॥ ౨౫౧॥

తా. తాను ఈపరిపూర్ణబోధను చదువునప్పుడు మిగుల నాసక్తితో వినునట్టిజనులసమూహమునకు, వినువారలు అయ్యో యేమిబోధదెలిసికొనకపోయినయెడల మాజన్మము నిరర్థకము, అని చెప్పి శరణాగతులయిబోధను దెల్పుమని చెప్పునటుల, వారికిసందేహము లెల్లయు బీడునట్లుబోధించువాడె శిష్యుఁడు. వాడేపరిపూర్ణమును దెలిసినవాఁడు.

కం॥తనభార్యరూపురేఖలు। తనపుత్రులసద్గుణములుతన
సంపదయుఁ। దనపెరటిచెట్టుమందును। దనగ్రామపుసాధుజ
నులుఁతనకు మెప్పానా ♦ యీయిలలోనెంతటివారికైన ♦ విన
లేదనీవహల్యను జూచిమోహించె। ఘనవాహనుండుచక్క
నిభార్యగలిగుండి తనకుమెప్పానా। యీయిలలోనెంతటివా
రికైన॥ ౨౫౨॥

తా. శిష్యా, తనభార్యయొక్క రూపరేఖావిలాస సౌందర్యమును, తనకుమారుల మేలిగుణములును, తనకలిమియు, తనపెరటిలో కాయుచెట్టుమందును, తనగ్రామమునందుండెడు సాధుజనులును, తానుమెచ్చుకొనడు. అది యెట్లనగా దేవేంద్రుడు తనకు మిగుల సౌందర్యవతియైనశచీదేవిభార్యగానుండినను, ఆమెయొక్క సౌందర్యతృప్తిపడక, పరభార్యయైన అహల్యనుచూచిమోహించి, ఆమెతోఁగూడి పడరానికష్టములకును, శాపములకును పాత్రుడయ్యెను. ౧౫౨॥

కం॥ జతనముగదాఁచి చదువుము। రతనమ్ములహారమిది
యురసికులగలమా। యతనము దీనికనేబహు। యతనముగా
వించి తెచ్చి యిచ్చితి నేను ♦ బోధకుబందోబస్తారమాను। ర
తనాలెల్లా రాళ్ళురతనాలంచనియంటే।రతనాలీపద్యాలేరసికు

లెఱుఁగదరివినీకిచ్చితినేను♦బోధకుబందోబస్తారచూడ॥ ౨౫౩॥

తా. శిష్యా, ఈకందార్థము లేరత్నములు. అట్టిరత్నములయొక్క-సమూహమైన నీగ్రంథమే రత్నహారము. ఇది రసికజనులకంఠము నందుండునది. దీనిని నీకుగాను మిక్కిలిశ్రమపడితీసుకొని వచ్చియిచ్చితిని దీనినిమిక్కిలి భద్రముగానుంచుకొనుము. ఈపద్యములుపరిపూర్ణ బోధకుబందోబస్తుగానుండును. దీనినిబాగుగాచదువుకొనుము రాళ్లు రత్నములుగావు. ఈపద్యములేరత్నములని తెలిసికొనుము. ౨౫౩.

కం॥ విననేర్చి చెప్పనేర్చిన । మనుజులకే దీనిలోని మర్మము
దెలియుఁ । వినఁజెప్ప నేరకుండిన । మనుజులు నీబోధలోనిమ
ర్మమెఱిఁగెదరా ♦ దీనందుండె ధర్మమెఱిఁగెదరా♦ జనులేకొ
బ్బరికాయ తిననేర్పుగలవారు । తినవచ్చునాకోతి తనకాకా
యబ్బిన మర్మమెఱిఁగెదరా ♦ దీనందుండె ధర్మమెఱిఁ
గెదరా॥ ౨౫౪॥

తా. ఈగ్రంథముతనకులభించి నంతనేతనకు బోధయంతయు దెలియునను. కొనరాదు. వినను, చదువను, గురువుయొద్దనుండి, నేర్వకున్న, దీనియందలి మర్మము దెలియనేరదు గురుముఖముగాదీనిం జదువనేర్చినవానికిదీనియొక్క-మర్మము దెలియునుగానిసామాన్యులకు దెలియనేరదు. [మనుజులకు] టెంకాయనుతిననేర్చినవారికే టెంకాయ లభించినపుడు తినసాధ్యపడునుగాని, తినను తెలియనికోతి టెంకాయ దొరకినను తిననేర్చునా. నేరదు. ౨౫౪.

కం॥ తానెంత లెస్సచదివిన । దీనినిఁదెలియంగఁగలడె దేశి
కవర్యుం । బూనికసేవించనియెడ । మానవులది యెట్లటన్న
మఱివినవోయి♦ నామాటందు మనసుంచవోయి♦ వానకాల
ములోని వర్ష మొకబిందు । వైనమింటను నిల్వదదినిశ్చయ
మేకద మఱివినవోయి♦నామాటందుమనసుంచవోయి॥ ౨౫౫॥

తా. ఈగ్రంథమును తానెంతబాగుగాజదివినను గురుసర్య్యప్రసాదములేకపోయిన యెడల, ఇందలిమర్మము మనస్సున కెక్కదు, ఒక్క-యంశమేనియు మనస్సున నిలువదు. వర్షాకాలములోని నీటిబిందువులలో నొక్కటియైనను ఆకాశమునందుండదో అట్లే ఒక్క-యంశమే

నియు మనస్సున నిలువదు. ౨౫౫.

కం॥ నన్నాశ్రయించినావని। యన్నా యీబోధనీకునతు
కుటకొఱకై। యెన్నో యుక్తులు చెప్పితి। విన్నా వాదీనినీవు వి
డువ కెప్పటికి ♦ నాయాజ్ఞను గడువ కెప్పటికి ♦ నన్ను నీవునిన్ను
నేఁగన్న వేళెట్టిదో। నన్ను నీవు విడవునిన్ను నే విడ లేనువిడువ
కెప్పటికి ♦ నాయాజ్ఞను గడువ కెప్పటికి॥ ౨౫౬॥

తా. నీవునాశరణుజొచ్చినావునిన్నాదరింపవలయుననుతలంపు
న నీకీబోధను జెప్పితిని. అదినీకుమనస్సున బాగుగా నాటుటకొఱకై
యెన్నెన్నో యుపమానములను జెప్పితిని. నీజెప్పినదానిలో నేదియు
నీవుమఱువవద్దు, నీవెన్నడును నాయాజ్ఞ నతిక్రమింపకుము. మనమిద్ద
రము పరస్పరము జూచిన వేళ యెట్టిదోగాని నీవునన్ను విడిచి యుండ
లేవు. నేనును నిన్ను విడిచి యుండజాలను. ౨౫౬.

కం॥ పతియైనను సతియైనను। నతిసాహసపరులుగాకయాం
తర్యమునఁ। రతివేళలజ్జపడన। తతికలుగదుచూడు మట్లత
గదులజ్జింప ♦ గురుశిష్యులకట్లు తగదులజ్జింప ♦ మదినినీవిట్లనమ్మ
తిచేసి యే యేసం।గతినన్నడుగుము బోధస్థితినీకుదృఢపఱతుఁ
దగదులజ్జింప ♦ గురుశిష్యులకట్లుతగదులజ్జింప॥ ౨౫౭॥

తా. శిష్యాదంపతులలో జాయయైననుపతియైననురతిసమయ
మునందుల్లాసముననుండకసిగ్గుతోనున్న యెడలసంతానముకలుగ నేర
దు. అట్లెగురుశిష్యులిద్దరిలో నెవ్వరైనను సిగ్గుపడి చెప్పవలసినపుడు చె
ప్పక పోయినను, అడగవలసినపుడుఅడగకయైననునుండి కేసిఫలము క
లుగ నేరదు. కావుననీవులజ్జనువదలి ధైర్యముతో నీకుగోచరముకా
ని సంగతులనుఅడుగుము. నేనునునీసంశయములనుదీర్చెదను. ౨౫౭.

కం॥ రతికొఱకుఁగాదెసతిపతి।కతిహితమతి సేవసేయున
టువలెబోధ। స్థితినీకుఁగుదురుటయున।మ్మతితో గురు సేవసే
యుమానీతిమంతా ♦ అభిమానము పోనీతిమంతా ♦ అతనికిద
యరాగ మరసిమిపమునబోధ। స్థితినీకుఁగుదిరించునిగ్గువిడిచి
కొలువుమానీతిమంత ♦ అభిమానము పోనీతిమంతా॥ ౨౫౮॥

తా. భోగెచ్చంగదా చర్యలునిజనాయకులకు పరిచార్యలో

నర్చుట. అట్లైనీవు నాబోధ బాగుగా నలవడుటకై గురునకు పరిచర్య సేయుము. దేహముమీది యభిమానము వదలిపోవును. నీవు లజ్జవిడిచి గురుపరిచర్య చేసినయెడ నీమీద గురునకత్యంతానురాగము కలుగును. నిన్ను అరనిమిషములోపల పరిపూర్ణజ్ఞానిగా జేయును. ౨౫౮.

కం॥ నీమానసమున సంశయ । మేమాత్రము నిల్వఁబోకు
మిఁక నాకొడే । నామాట నిశ్చయము నే । నేమాత్రము దాఁ
చ లేదు నీకొడుకుమిన్నా ♦ యింతకు మిక్కిలి యిఁక లేదు లెమ్మా।
నామీఁద తలంపుంచిన నుమఱువ కిఁక నేను । నీమీఁద దయయుం
తు నిజమిందు కేమొట్టు నీకొడుకుమిన్నా ♦ యింతకు మిక్కిలి
యిఁక లేదు లెమ్మా॥ ౨౫౯॥

తా. శిష్యా నీ మనస్సున సంశయము లేవియు నుంచుకొనకుము. నాకు దెలిసినదంతయు నీకు జెప్పితిని, నాకొడుకా నేనేమియు దాచలేదు దానికి మించినదిక యేమియు లేదు. నామీద జ్ఞాపకముంచినన్ను మఱవకుము నీయాన. నేను నీమీద దయయుంచి నిన్ను మఱవకుందును ఇది యేమనకిరుపురకు వాగ్దత్తము ౨౫౯.

కం॥ నాగురుబోధను నిచే । బాగుగ విని నిందసేయు భ్రష్టు
లమాటల్లోఁగొని విడిచెడ విడిసి । కేగురుఁడీలాటిబోధ నెఱఁగిం
చఁడోయి ♦ యెఱుకలోని దెఱఁగించునోయి♦ ఆగురుబోధల
నన్నిటి నెఱఁగుంచి । నాగురుబోధనే నయముగ నీకిచ్చి తెఱఁగిం
చండోయి ♦ యెఱుకలోని దెఱఁగించునోయి॥ ౨౬౦॥

తా. ఈబోధను నీ వెఱిఁగించినప్పుడు నీ చెవిని సోఁదించు భ్రష్టుల మాటలు విని చెలుపోకుము. నీ కేట్టిగురుడును, ఈలాటిబోధను నెఱిగింపడు తక్కినవారిబోధలయంతయు నెఱుకయందుండును. అట్టి యెఱుకతో సంబంధించిన బోధలన్నియు నాకుం దెలియును. అట్లు దెలిసియుండియు నీకది ఉపదేశము చేయక, ఉత్తమమైనట్టి, అస్మద్గురు ప్రసాదమైనట్టి ఈబోధను నీకిచ్చుచున్నాను. ౨౬౦

కం॥ నిక్కముగ బీరపీచుల । చిక్కు సుమీ విచ్చ రాదు ధీయా
యెఱుకకు । మక్కువనే బోధించిన । చక్కనిబోధాగ్ని చేత
సాధించుపోరా ♦ విచ్చును చింత చాలించుకోరా ♦ చొక్కమా

సీబోధ కెక్కడికీడౌను । దక్కినబోధల దిక్కునూడకు దీనిసా
ధించుమహోరా । విచ్చనుచింత చాలించుకోరా॥ ౨౬౧॥

తా. ఎఱుకతో సంబంధించిన బోధలుబీరకాయపీచుల చిక్కుల వలెమిగులచిక్కు గానుండును. అట్టిచిక్కునువిచ్చుటకు నెవ్వరికిని సాధ్యము కాదు. అట్లువిచ్చుటయుతగదు. అట్లు సద్గురుడు చేయడు. ఛీవాటి నంతయువదలిపెట్టుము. ఎఱుకను, నేనుబోధించిన పరిపూర్ణజ్ఞానముచేత నశింప జేయుము. అట్లు జేసితివేని విడరానిచిక్కులన్నియు వీడి చింతలన్నిటిం బాపును. ఈపరిపూర్ణబోధకు యింకేబోధయు నీడుకాజాలదు ఇతరబోధలనుతెలయెత్తియైనను చూడకుము. ఈయచలబోధను సాధింపుము. ౨౬౧.

కం॥ అడవి యుసిరికేయు జలనిధి । బొడమినలవణం బటం
చుంబొగడినరీతిగ । బుడమిని నీస్థలమందునం । గడువేడుకనీ
వునేనుగలి యుంటివినరా♦ నీనాప్రేమ గలిసెంగన్గొనరా ♦ విడు
వునీవునన్ను విడలేను నేనిన్నుం। గడువేడ్కనీవు నెక్కడంబోకని
లచిట్లుగలియుంటివినరా♦ నీవాప్రేమ గలిసెంగన్గొనరా॥ ౨౬౨॥

తా. ఆరణ్యప్రదేశమునందుకాచు యుసిరికకాయలు సముద్రజలమునందుండులవణమును జేరి యెట్లురుచియిచ్చునో అట్లె మనమిద్దరము ఇక్కడ జేరితిమి నేను నిన్ను వదలను నీవు నన్ను వదలవు ఉసిరికయు లవణమును జేరి రుచియిచ్చునటుల మన మిరువురమును జేరినప్పుడు మిగుల ప్రకాశింతుము. ౨౬౨.

కం॥ పెద్దలనిందయొనర్చకుం। బెద్దలసేవించుకొలుకుంబిరిది
వియకుమే । పెదలతో వాదించకుం । బెద్దలుబోధించుమాట
పెడచెవులవినకు♦ పెద్దలునడుచు నడతనేమనకు♦ పెద్దలకన్న
నేంబెద్దనంచనుకోకు। పెద్దలంగనుంగొన్నం। బ్రియముతో ప్రమొ
క్కుము పెడచెవులవినకు♦ పెద్దలునడచునడతనేమనకు॥ ౨౬౩॥

తా. పెద్దలనునిందింపకుము, పెద్దలను సేవించుటకు వెనుకదీయకుము వారితో వాదములుపెట్టుకొనకుము. వారు చెప్పుదానిని సావధానముగావినుము నారునడుచుప్రకారము నీవునుఉండుము వారలకంటె నీవు పెద్దవనియనుకొనకుము వారిని కన్నప్పుడు వారికి నమస్కారాదు

లోనర్పుము. ౨౬౩.

కం॥ పెత్తనమున నేనుంగిలఁ। జెత్తను దినవలసెఁ జీమ చిన్న
తనమునే । హత్తుకొని దినును జక్కెర । నిత్తెఱఁగున రెంటినీకు నిష్ట
మేదైతే ♦ చేకొనుమదె స్పష్టమేదైతే ♦ పెత్తనమునఁ జేటు పెం
పొందుచుండును । జిత్తములోఁ దెలియు చిన్నతనమే మేలు । ఇ
ష్టమేదైతే ♦ చేకొనుమదె స్పష్టమేదైతే॥ ౨౬౪॥

తా. ఏనుగు పెద్దతనము వహించియు భూమింబడియు అనుకసవును దినవలసివచ్చెను. అట్లుకాని అడఁకువగల చీమ పుట్టిననాఁడె చక్కెరను తినును. కావున నీ రెంటిని బాగుగా గాంచి నీకేది యిష్టమో తెలిసి చేయుము బాగుగా విచారించి చూచిన యెడల పెద్దతనము వహించిన యెడల చేటు కలుగునని తెలియనగును. కావున యెల్లప్పుడును చిన్నతనమందు అనగా అడఁకువతో నుండుటయే మేలు. ౨౬౪.

కం॥ తననుశరణన్న వారల । మనసెట్టిదో తెలిసిచూచి మ
ఱి దెల్పఁదగుఁగా । వినువారికిఁ దగినట్టిది । యనరిట్టు మహానుభా
వులతి చాతుర్యమున ♦ వికాసముగ నతిచాతుర్యమున ♦ ఘన
మగునయి యాబోధ కరుణనిచ్చితి దీనిఁజ । చ్చినదనుక నినుఁ దనచ్చి
నదాఁక మఱువకుమతి చాతుర్యమున ♦ వికాసముగ నతిచా
తుర్యమున॥ ౨౬౫॥

తా. తనకెవరైన శరణుజొత్తురో వారి మనోభీష్టంబులు బాగుగా నెఱిగి వారి మనోభావంబులకుం దగిన బోధలననుగ్రహింపవలయునని పెద్దలు చెప్పియున్నారు. నేనును నీ హృదయము నరసి నీకీ సద్బోధను జేసితిని నీవు దీనిని చచ్చువరకు. నీ హృదయమందప్పు మఱచియుండకుము.

కం॥ చెప్పఁదగు గురుఁడు బోధను । జెప్పినపని జేసె నేని శిష్యా
గ్రణికిఁ । జెప్పఁదగుం జెప్పినపని । తప్పిన నా దంచ నేసినయు
దలచి బోధ । యుద్ధరికుండఁ దగదట్టివేద ♦ చెప్పినట్టుగ బో
ధ చెప్పెడి పనులన్ని । చెప్పఁగూడ నవ్వాని తిప్పలు పెట్టిన దయ
దలఁచి బోధ ♦ యుద్ధరికుండఁ దగదట్టివేధ॥ ౨౬౬॥

తా. గురువు, తన శిష్యుడు తాను చెప్పిన పనులు చేయుచుండిన యెడల అతనికి బోధ దెలుపవలయును. అట్లు చేయక పోయినను కూడ అత

కం॥ ఎవరున్న నేమిభయమని।సవరింతురుదప్పులున్న సాధులువినిన౯। సవరింతురు సుమ్మివి విని। యవినీతులునింద జేయనయ్యే దేమోయీ॥ అందులో మనదిపొయ్యే దేమోయీ॥ భవనాశస్థితిలేనిపద్ధతి యీబోధనవురుగవినిపించుచా టలమాటలనయ్యే దేమోయీ॥అందులో మనది పొయ్యే దేమోయీ॥

తా. మనముచదివినేప్పుడు దానిలోనేమేనియు దప్పులున్న యెడ, సభనిట్టివారలున్నారని చూడక ఇదితప్పుఇదిఒప్పుచెప్పి సవరింతురు. దుష్టులైనవారుతప్పులను జూచిగ్రంధకర్తను దెలియనివాడని నిందింతురుగానివాటినిసవరింపరు. వారట్లుతిట్టుటవలనమనకు రాబోయ్యేదేదియు లేదు. పోయ్యేదియు లేదు. కావునపరిపూర్ణ బోధను ఎల్లవారియెదురను బహిరంగముగా జెప్పను. ౨౬౯.

కం॥ పుట్టింటబిడ్డబహుగా।దిట్టయియుండినను నెవరు దిట్టరు భువిలో। బుట్టింటివారికోడలు। దిట్టయినను నత్తవారు దిట్టేరుసుమ్మీ॥చేతులకొద్దికొట్టేరుసుమ్మీ॥ అటువలెనేబహు దిట్టయినశిష్యుని। దిట్టకుగురుమూర్తి వట్టివారుచాల తిట్టేరు సుమ్మీ॥ చేతులకొద్దికొట్టేరుసుమ్మీ॥ ౨౭౦॥

తా. ఇంటపుట్టినబిడ్డ యెంతదుష్టుగానుండినను। తల్లికూతును యేమియు జెప్పదు. ఇంటికోడలే ఆలాగుండేనేని ఆపెను పడరాని పాట్లను చెందజేయుదురు. అనగామిగుల హింసింతురు. అట్లె సద్గురుడైనవాడు తనశిష్యుని పుట్టినింటి బిడ్డవలెజూచును. వాడెంత దుష్టుడైనను వానిపై కోపమునెందడు తక్కినవారలు శిష్యునికొట్టియు తిట్టియు హింసింతురు. ౨౭౦.

కం॥ అందముగఘనులుమెచ్చెద। రెందుకుమెచ్చెదరు దీని నితరజనంబుల్। చంద్రుడుదయంబందిన। సింధువుచెలరేగిన ట్లుచెలగునె చెరువుల్॥ కోనేళ్లుబావులునూతు లేరుల్॥మందయానల పొందు మగవారెనుతిచేతు। రెందుకునుతిజేతురిల షండపురుషులు చెలగునెచెరువుల్॥ కోనేళ్లు బావులునూతు లేరుల్॥ ౨౭౧॥

తా. శిష్యా. ఈపరిపూర్ణబోధను, దానిని తెలిసినగొప్పవారలు

మెచ్చగలరుగాని, సామాన్యులు మెచ్చజాలరు, చంద్రోదయమైనప్పు
డు సింధువు ఉప్పొంగునేగాని సామాన్యమైన యేఱులును, తటాక
ములును సంతోషింప నేర్చునా. నేరదు. అల్లిముగువలపొందును,రతి
సౌఖ్యమెఱింగిన [పురుషత్వముగల] పురుషుడు సంతోషింపజాలు
నేగాని, నపుంసకు లెఱుంగజాలరు. ౨౭౧.

కం॥ కాకంబులుసంపూర్ణతటాకస్థజలంబు లెట్లుద్రావక
తృషచేఁ। గైకొనునోకుంభజలమ। ట్లీకలియుగమిందు దుష్ట
లింపుమీఱఁగను♦నిల్వదుబోధకంపుపాటినను♦మీకుదీని కెలం
కెమాకేలయిట్టిచీ। కాకుచొక్కడ మైతెగ్గ కొందు మాదురు
ఇంపుమీఱఁగను ♦ నిల్వదుబోధకంపుపాటినను॥ ౨౭౨॥

తా. కాకములు నిర్మలంబులైన తటాకాదులయందలిస్ఫటిక
జలములచే పిపాసం దీర్చుకొనక మిగుల మలినమైన ఘటములయం
దుంచియుండు జలములనే పానము చేయును. అదేవిధమున. ఈకలి
యుగమునందు దుష్టజనులు నిర్మలమైఉత్కృష్టమగు నచల పరిపూర్ణ
బోధను జెందక ఉపయోగములేని యోగభ్యాసములయందును,మొ
ఱుకయొక్క మార్గములయందును మనస్సును చొప్పించుచుందురు.
వారుపరిపూర్ణజ్ఞులనుగేళిసేయుచుందురు. వారిమాటలుమనకువలదు.

కం॥ కుత్సితమతియగు పురుషునిఁ। జెచ్చెరవినుమనుచుఁ
జదువ శిష్టులవలెఁదా। ముచ్చటపాటుగవినఁడివి। కుచ్చులకు
ళ్ళాయి కుక్కకూనకెందుకురా♦పిడుదాకుదుగ్ధ పానమొందుకు
రా ♦ హెచ్చైనముత్యాల పచ్చలపతకము। గ్రుచ్చి పేరుగఁజేసి
తెచ్చి వేసినఁగోతి కూనకెందుకురా♦పిడుదుకుదుగ్ధ పానమొం
దుకురా॥ ౨౭౩॥

తా. కుత్సితమైనబుద్ధిగలమనుజుని యొద్దకు బోయి ఈబోధ
నువినుమని చెప్పినయెడల,వాడువినయముతో గూరుచుండి సావధాన
ముగా వినునా, వినడు. అదియెట్లనగా శునకమునకు కుచ్చులుకట్టి జిగి
నాపని చేసినయొక మంచికుళ్ళాయిని తలపై నిడిన,అదినూరక కూర్చొని
యుండునా,ఉండదు. కుక్కలయొక్క రక్తమును పానము చేయు పిడు
దునకు క్షీరపానము చేయించిన ద్రావునా, త్రాగదు. మిగుల విలువగల

ముక్తాహారమును. పచ్చలపతకముతోఁగూర్చి యొకక్రోతిమెడయందు వైచిన, మర్కటము కుమురుగానుండునా, ఉండదు. ఎటులనైన తేకుల్లాయని కుక్కకును. క్షీరమును పిమదానకును, ముక్తహారమును క్రోతికిని యిమటనిరర్థకములో అట్లె కుత్సితునకు బోధించుటయు నిరర్థకము. ౨౭౩.

కం॥ అక్షయబోధస్థితిగల। లక్షణవేత్తలకు మెప్పులైనకృతులతోఁ। గక్షుకుఁదప్పులు కుమతి ప। రీక్షింపుచునుండు నెన్నోరీతులవినుమీ॥ తద్భావమిారీతిగఁ గనుమీ॥ మక్షికమెప్పుడు హానిసుగంధాదు లీక్షింపు వ్రణము ప్రత్యక్షమేగద యెన్నోరీతుల వినుమీ॥ తద్భావమిారీతిగఁ గనుమీ॥ ౨౭౪॥

తా. శిష్యా, నాశములేని ఈబోధయొక్క స్థితినిన్ని, దీనిలక్షణమున్ను బాగుగా నెఱిగిన పెద్దలయొక్క మెప్పునకువచ్చునటుల నీగ్రంథమునురచియించితిని, దుష్టబుద్ధితనతండ్రియుంచిపోయిన కాణాచియందుతప్పులు కనిపెట్టుచుండును. [ఉంచినధనముచాలదని చెప్పుచుండును.] అదియెట్లంటేని ఈగలు, మంచి సుగంధములేను పరిమళవస్తువల పైవ్రాలి వాని సౌగంధ్యంబునుం గ్రోలక, దుర్గంధములైన కురుపుల మీాదను వ్రణముల మీాదను వ్రాలి వాటి దుర్గంధమునే గ్రోలును. కావున దుష్టులును గ్రంథమునందలి గుణములను గ్రహించక దోషములనే యెన్నుచుందురు. అట్లుచేయుట సరికాదు. ౨౭౪.

కం॥ రమ్మనిపిలువనిదే ప। ద్యమ్ములు చదువంగవచ్చియవి నిందింతుర్। సమ్మతిగాకను మతిని। యిమ్మహినది యెట్లటన్న నిట్టులెవినుమీ॥ వానిబుద్ధినిట్టులెకనుమీ॥ బొమ్మలాటాడించుబొమ్మతానొకటిఫ। పొమ్మని యనిహాస్యమొనరించినను బోకయట్టులెవినుమీ॥ వానిబుద్ధి నిట్టులెకనుమీ॥ ౨౭౫॥

తా. ఈగ్రంథమునువినిదీనియందలి గుణదోషముల నెఱింగింపుడనివారినిరప్పించిఅడుగుటకుమునుపే [అనగా వారినిరమ్మనిపిలుచుటకు మునుపే] వచ్చి గ్రంథమునందలిపద్యములయందు దోషారోపణముచేసి, గ్రంథమును గ్రంథకర్తనున్ను నిందింతురు. దుష్టులందరు ఈలాగుననే జేయుదురు. అది యెట్లంటేని. బొమ్మలాటయందు నడుమ నడు

మహాత్స్యము చెప్పు బొమ్మను నెంతపొమ్మని కసరిననుపోదు. అదిఅక్క డనేయుండి నాటక పాత్రములను ఆతంక పఱచుచుండును. ౨౫౫.

కం॥ వటియించినచన్నులుగల । కుటిలాలిని నిందఁజేయు గు త్తపురవిక్ల । ఎటువలెందనతప్పెఱుఁగక । యటువలెగ్రం థముచుమెచ్చఁ డతిదుర్జనుండు♦ లేనిదెతప్పు వెదకుచునుండు♦ ఇటువంటిబోధనే నెఱుఁగుటెట్లనుకోక । కటువాక్యములు పలికిఘనులఁగాసిలఁజేయు నతిదుర్జనుండు♦ లేనిదెతప్పు వెదకు చునుండు॥ ౨౭౬॥

తా. వ్రాలిన స్తనములుగలవృద్ధాంగనంజూచి, కఠినకుచద్వయ ముగలతే బ్రాయపురాలు పరిహాసముచేయును. కుంభములనుబోలి యుండు తన స్తనములును కొంతకాలమునకు ఆలాగువ్రాలిపోవునని ఆ లోచించక పరిహాసింపుచుండును. దుర్జనుడైనవాడును ఈగ్రంథము నందలివిషయమును తానెట్లుదెలియ నేర్తునో అందులకేది యుపాయ మోయనియాలోచింపక గ్రంథమును వృథానింద జేయును. పెద్దలను.ఉ చ్చరింపరాని మాటలాడి, కష్టపెట్టి వారిమనంబులను రోయునట్లు జేయును. ౨౭౬.

కం॥ గురువర మీనాసందున । నెఱుకను తెరగలిగియుం డెనిన్నాళ్లు సుమీ। కరుణారసేక్షణములం। వెరదీసితి రెఱుక మాటదీతెక్కడికిఁ♦ జాలునుబోధదూర దెక్కడికిఁ♦ బరిపూ ర్ణమునలేని యెఱుకను జూపించి । యెఱుక లేదని యంటిరెఱుక లేదాయెను దీతెవిక్కడికిఁ♦జా[illegible]నుబోధదూరదెక్క డికి॥ ౨౭౭॥

తా. ఇకశిష్యుడుగురునకు జెప్పుచున్నాడు, గురురాజా, ఇన్నినా ళ్లుగురునకునునాకునునడుమనెఱుకయనుపరదాయొకటియుండెను. దే వరవారి యనుగ్రహముచేనా తెరతొలగి పోయెను. ఎఱుక నేటితోన శించెను. దానిమాటయె యింకలేదు. తమరుబోధించినపరిపూర్ణబో ధయికనన్నువిడిచిపోదు, దేవరవారు, యెఱుకనులేదని తెలియజెప్పిదా నిని పోగొట్టితిరి. తమరనుగ్రహముచే యెఱుక పాఱిపోయెను. ౨౭౭.

కం॥ ధారుణిఁగొంతచరించిని । చారించితిఁగానియీవిచా రమునేనె । వ్వారలుసెప్పగవినలే । దారయమీనోటవిన్నా

నయ్యాగురుమూర్తి ♦ తరమానుతిఁజేయ మీకీర్తి ♦ సారసనే
త్రపురారినీరజ భృందారకముఖులైన। నేరరుమిముఁదెలియ
నయ్యాగురుమూర్తి ♦ తరమానుతిఁజేయమీకీర్తి॥ ౨౭౮॥

తా. గురువర్యా నేనును ఈలోకమునందనేకదేశములుదిరిగితిని. అనేకులతోతత్త్వవిచారము చేసితినిగాని యింతవఱకునీసాటిలేని పరిపూర్ణ బోధను నేనెందునువిననైతి. ఈయుత్కృష్టమైనబోధనుతమదగ్గఱనుండియే నేనుదెలిసికొంటిని, మీయొక్క యశస్సునుపొగడుటకునాకుశక్యమాశక్యముకాదుఅయ్యా మిమ్ముంబొగడుటకుబ్రహ్మవిష్ణుమహేశ్వరాదులునుయింద్రాదిదేవతలును నేరరు.మిమ్ము దెలసికొన నేరరు. ౨౭౮.

కం॥ ఘటమెదుటఁ బెట్టిచూపిన । యటువలె బయలుండ జూపియతిమాయలచే। నటియించుచున్న యెఱుకను । ద్రుటిలోవిడిపించితిపుడు తీఱెనాశంక ♦ మదిఁబుట్టను పరీతిశంక ♦ ఎటుదోఁచ కిలువెడలి యటుమిమ్ముఁజూచిన । ప్పటినుండిద యఁజేసిప్పటిదాఁకఁ భోధింపఁ దీఱెనాశంక ♦ మదిఁబుట్టనుప రీతినింక॥ ౨౭౯॥

తా. ఒకపాత్రమునుకన్నెదుటంబెట్టిచూపించినటులపరిపూర్ణమును స్పష్టముగా కనుపఱచితిరి. అనేకవిధములైన మాయలతో మెలగెడునెఱుకను ఒక్కక్షణములోపల విడిపింపజేసితిరి నామదినున్న సందేహములన్నిటిని బాపితిరి. ఇకనామనంబున నేలాటి సందియములును కలుగవు. నేనేమియు దోచక సంసారాబ్ధినుండి దరిజేరుటకు తెరువేదియుగానక స్వగృహమునువదలిమిమ్ము నాయదృష్టవశంబున గన్న మొదలుయింతవరకు మీరునాకు బోధించితిరి అంతబోధ వినినందుననాకెల్లసంశయములును దీరెను. ౨౭౯.

కం॥ ఒరులునేననక యుండిన। దెటిఁగింపుమదేమొ బయలునేనొరులంచుఁ।ఎఱుకెవ్వరు లేదనవలె। నెఱుకనునున్నదనియుంట యదిలేదంచనుకో ♦ నేనునినునీమదిని లేదనుకో ♦ ఎఱిఁగియీలేనెఱుక యట్లలేకుండినం। బరిపూర్ణమనుదాని నెట్లు గుర్తెఱిఁగెద వదిలేదంచనుకో ♦ నేనునిను నీమదినిలేదనుకో॥ ౨౮౦॥

తా. (ఇంక గురువు చెప్పుచున్నాడు) తనకును యితరులకును భేదము నెంచకుండుటనే బయలు. తన్నును ఇతరులను భేదబుద్ధితో జూచుటయె ఱుక. నిజముగా మనకును. ఇతరులకును పరస్పరము భేదము లేదు, కావున ఎఱుక లేనిది అట్టి లేనిదే యెఱుకనుడున్నదని చెప్పిన యెడల పరిపూర్ణమును లేదని చెప్పవలయును. కావున యెఱుక లేనిదెను. నేను నీవు అనునది లేనే లేదని తెలియుము. ఎఱుక మొదటయుండును. అట్టి యెఱుక చేత పరిపూర్ణమునుగని యెఱుకను త్యజింపవలయును. ఎఱుకను మొదటనే లేదని చెప్పిన యెడల పరిపూర్ణమును ఎఱుగుటయెట్లు కావున పరిపూర్ణముగన్న తరువాత యెఱుక లేకపోవును. ౨౮౦.

కం॥ నాబుద్ధికిసరి పడ్డది।నీబుద్ధేగాని యెన్ని నేర్పులఁగనినర్వ।
శ్రీ బద్ధుల యాబుద్ధులు। నాబుద్ధికి మెప్పురావు నాతండ్రి వినరా ♦ సెబాసు నిన్నే తండ్రిగనరా♦ ఈబుద్ధినిఁక మానకే బుద్ధిఁ బూనకు। మేబుద్ధిఁ బూనిన నీబుద్ధి చెడిపోవు నాతండ్రి వినరా♦ సెబాసు నిన్నే తండ్రిగనెరా॥ ౨౮౧॥

తా. ఎల్ల విధములను, నా బుద్ధికి సరియైనది నీ బుద్ధియే నునీబుద్ధిని నేడు మిగుల మెచ్చెదను. మంద బుద్ధుల యొక్క బుద్ధుల నేనెల్లను వారి బుద్ధులెఱుకతో సంబంధించియుండును కూన నాముద్దుల పట్టి నే చెప్పుదానిం వినుము. నివంటి కుమారుని గన్న తండ్రియే తండ్రి వాడే ధన్యుడు ఈబుద్ధిని యెప్పుడును విడువకు. ఇంక నే యుపదేశమును గ్రహింపకు. ఇంక నే బోధనైనను వింటివే నీ నీబుద్ధి చెడిపోవును గావున నీ బోధను మఱవకుము ౨౮౧.

కం॥ కొట్టితిఁ దిట్టితి శ్రమలం। బెట్టితి నీమనసు చెవులఁ బెట్టక పెడగా। బెట్టితి మొట్టితి వెడలం। గొట్టితి నీమనసు దెలియగోపము లేక ♦ సరి తెలిసితి వోపిక పోక♦ పట్టుమిచ్చెదనింక పట్టేమి లేదాయె। బట్టుమిచ్చెద బోధ గట్టివాడవు రోరి కోపము లేక♦ సరి తెలిసితి వోపిక పోక॥ ౨౮౨

తా. బిడ్డా, నిన్ను కొట్టితిని, తిట్టితిని. నిన్ను పెట్టరాని బాధలం బెట్టితిని నీవు చెప్పు మాటలమ సరిగా వినక యునుంటివి. నీతలమీద మొట్టితివి. నిన్నింటినుంచి వెడలగొట్టితిని, నిన్నీలాగు యిడుములం బెట్టినదన్నియును నీయొక్క మనస్సును శోధించుటకొఱకే యని తెలియుము. నీయొ

క్క మనస్సును బాగుగా దెలిసికొంటిని. నీవుమిగుల గట్టివాడవు. ఇది గో నీకుబోధనిచ్చుచున్నా నుగ్రహింపుమునీవుకడ తేరిపోదువు. ౨౮౨.

కం॥ నీవెంతకొట్టితిట్టిన। నేవిడిచెడువాడగాను నీచరణం
బుల్ । చావైన బెండ్లియైనన్। నేవిడువనటంటిగట్టి నిజభక్తుం
డౌరా ♦ నేగనుగొంటి నీనిష్ఠలౌరా♦ కావున నీకిట్టి ఘనమైన
బోధను। వేవేగ దయచేసితి నీవిదివిడువకునిజభక్తుడౌరా♦నే
గనుగొంటినీనిష్ఠలౌరా॥ ౨౮౩॥

తా. నీవునేనెంత కొట్టినను తిట్టినను నాపాదములే శరణముల నిజెప్పి దృఢమనస్సుతోనుంటివి. వివాహమైనను చచ్చినను నా చరణములయందే కావలయునని చెప్పితివి. నీవేనిజమైన శిష్యుడవు. నీవే నిజమైనభక్తుడవు. నీయొక్క నియమనిష్టలన్నియు నేనుజూచి మెచ్చుకొంటిని కావున నీవట్టివాడవయినందున నే నీకీబోధ నిచ్చుచున్నాను, ఇంతశీఘ్రముగా నీకనుగ్రహించినదియు దానంబట్టియే. ఈబోధను గ్రహించి వదలిపెట్టకయుండుము. ౨౮౩.

కం॥ నానోటిమాటవెంబడి। దానెప్పుడుసంచరించె దగు
నీచిత్తం। బేనడిగనియీబోధ ని। దానంబిచ్చితినిదీని దాచుకో
సుమ్మీ♦నిత్యమునీవుచూచుకోసుమ్మీ♦ యేనరుడైననినీన్నిబో
ధనడిగిన। వానిమనసరయక వానికిచెప్పదు దాచుకోసుమ్మీ♦
నిత్యము నీవు చూచుకోసుమ్మీ॥ ౨౮౪॥

తా. నేచెప్పినటుల నడచెడువాడవు కాబట్టి నీకీబోధ ననుగ్రహించితిని. నేను నీచిత్తవృత్తిని బాగుగాకనిపెట్టియే నీకీపరిపూర్ణబోధం దెలియ జెప్పితిని. దీనినినీవుభద్రముగా దాచుకొనుము. ఇదియే నీకు కాణాచి. అట్లుదాచి ప్రతిదినమును దానినిమనస్సునకు తెచ్చుకొని స్మరించుచుండుము. నేనెటులనైతే నీమనంబుశోధించినపిదప నీకీబోధను జెప్పితినో అట్లెనీవునునిన్నెవరైనను ఈబోధను ఉపదేశముచేయుమని యడిగినపక్షమున, వారిమనస్సులను శోధింపక బోధనునొసంగకుము.

కం॥ కన్నదివిన్నదిలేకయు। నున్నదిపరిపూర్ణమనుచు నూ
హానెఱిగినన్ । గన్నదికన్నట్టిచనును । నన్నరయగ నెవ్వరు
న్నా రామీందననుగ♦ విన్నావా యున్నవారెవ్వరనగ♦ నిన్ను

బోలికగాను గన్నులపండుగై। తిన్నగగలిగుండు నిన్నను తెఱ
దీయ నామీదననుగ♦విన్నావాయున్న వారెవ్వరనగ॥౩౮౫॥

తా. కనునదియు వినునదియు కానిదే పరిపూర్ణమని ఊహచేసె ఱుగుము. పరిపూర్ణము కనను వినను నేరదు. అది యెల్లెడల నిండియుండును. అట్లు నీ వెఱిగినపక్షమును, పరిపూర్ణమును కని యెఱుక తనకు తానె నశించిపోవును. అట్లు యెఱుక బోయినతరువాత ఎఱుగువారును అనుగువారును ఉండరు. తరువాతయుండువారలు పరిపూర్ణ మొక్కటి దక్కయింకెవ్వరును లేరు. నీవు నీవు అను చెప్పుచున్న యెడల కన్నుల పండుగగానుండును గాని ఆ నేను నీవు అను అహంకారమను తెరను తీసివైచిన వెనుక నంతయు పరిపూర్ణముగానె తెలియబడును. ౩౮౫.

కం॥ లేనిజగమెఱుక లేదని। మానుగనది దెలిసినపుడు మర్మము లేకనె। గానబడు బట్టబయలై। మానుగగలిగుండు నెందు
జూచినయందు♦ అందముగాను జూచినముందు♦ అందునింద
నరాక యెందు జూచినబయలు। సందుసందులనిండి పొందశక్య
ముగాక చూచినయందు♦అందముగాను జూచినముందు॥ ౩౮౬॥

తా. జగమెఱుకల రెంటిని లేదని దృఢముగా నెఱిగిన వెనుక, కొంచెమైనను మఱుగు లేక పరిపూర్ణము స్పష్టముగా కనబడును. ఏవైపు నెందు జూచినను గానంబడుచునుండును. ఇక్కడ యున్నది ఇక్కడ లేదని చెప్పుట కలవి కాక, ఎల్ల యెడలను, యెల్ల సందులయందు బొందులయందును పరిపూర్ణము అందముగా గాన్పించుచుండును. దానిని పొందుటకు నెవ్వారికిని శక్యము కాక యుండును. ౩౮౬.

కం॥ నమ్ముని జమ్ముగ మనమున। ముమ్మాటికి నెఱుక జోలి
మూరొక్కనక మదికి। నమ్ముమచలమ్ము లెన్నగ। నిమ్మళము
గనిల్చిచూడ నీవు నిల్వ లేవు♦ నమ్మకు మెఱుక యదినమ్మలేవు♦
తమ్ములలోన నిమ్ముగ వెలిగెడు। తుమ్మెదయని నేను నమ్మ
బల్కితి సుమ్ము నీవు నిల్వ లేవు ♦ నమ్మకు మెఱుక యదినమ్మ
లేవు॥ ౩౮౭॥

తా. నే చెప్పిన మాటలను నమ్ముము ముమ్మాటికిని నీకు యెఱుక జోలి వలదు. పరిపూర్ణ మొక్కటియే నిజమని నమ్ముము. బాగుగా నాలోచిం

చిచూచితివేని నీవేల అబద్ధమని తెలిసికొనుదువు. బాగుగా నాలోచించి చూచిన యెడల నీవు అనుసందేనిల్వదు. నీకు మొదటనే తామరలయందు మధుపానముచేయు తుమ్మెదవంటి దెఱుకయని నీకు జెప్పలేదా అట్టి యెఱుకను వదలిపెట్టుము. ౨౮౭.

కం॥ తెలవాఱెనునీకజన్మము। కలయయ్యెజగంబులెల్లఁగ
నుగొనుచుండఁగ। గలమేలుకొన్నపిమ్మట। నిలువగలేదయ్యె
నెఱుకనిక్కముసుమ్మీ॥ నమ్మినదానిసీవికనమ్మీ॥ ఎక్కడఁ
జూచినఁబిక్కటిల్లుచు బయలు। నుక్కునఁగలిగుండునెక్కుడెల
నంతట। నిక్కముసుమ్మీ॥ నమ్మినదానినీవికనమ్మీ। ౨౮౮॥

తా. ఎఱుకయను కలనుండి మేలుకొంటివి. పరిపూర్ణమను మెలకువనుకాంచితివి ఎఱుక అబద్ధమని తెలిసికొంటివి. జగమెఱుకలు రెండును కల్లలాయెను. పరిపూర్ణోదయమాయెను. అట్టియుదయమైనపిదప ఎఱుక నిలువలేక పాఱిపోయెను. ఎఱుక లేదని దృఢముగా నమ్ముము. పరిపూర్ణ మొక్కటియే నిత్యమైనదియు సత్యమైనదియు కావున దానినే నమ్మియుండుము. ఎచ్చటజూచినను పరిపూర్ణము నిండి వ్యాపించియుండును. ౨౮౮.

కం॥ ఖండాఖండములొందక। నిండినపరిపూర్ణమొక్కటిగనెఱుక
నెఱుకనుదా। ఖండించిచిజడంబుల। దండిగఁబరిపూర్ణమొక్కటి
గ నుండువారెవరు ♦ మండితముగను నిండువారెవరు ♦ ఎండ
లోపలనున్న దండచేఁతెటిచాటు। మొండిదేహము లేకయుం
డునట్లనెచూడుముండువారెవరు ♦ మండితముగను నిండువా
రెవరు॥ ౨౮౯॥

తా. అఖండమైనటువంటిదియు, [అనగా భాగింపనలవికానిదియు] సర్వదిశలయందు నిండినదియునైన ఈపరిపూర్ణమును తెలిసికొనుము. చిద్రూపముగాను జడస్వరూపముగాను (అనగా శరీరాత్మలరూపము) పరిణమించియుండునీయెఱుకను పాఱద్రోలుము. అట్లెఱుకపోయినపిమ్మట పరిపూర్ణమునెఱుగువారెవ్వరును లేరు. అనగా పరిపూర్ణ

మొక్కటియేనుండును. ఎల్లను నొక్క పరిపూర్ణమే నిండియుండును. ఎండయందు జీకటి కనుపడక దాగి యుండునటుల, నీపరిపూర్ణమునందును, ఎఱుకతో సంబంధించిన నీశరీరాదులు గానంబడవు.

కం॥ ఇదిమర్మమనుచు నెఱుఁగక । విదితజ్ఞులనుచున నెడు
వేత్తలమాటల్ మదిలోనిల్పకుమంత్రము । మదిలోమఱచుం
డఁబోకుమాబోధరీతి ♦ నిశ్చలముగ నిలుపు విఖ్యాతి ♦ ఇదియ
ది యని యెఱుగ యెప్పుడుగలిగి। తే దప్పకు మీబోధ దైవ
మనెఱుజ్ఞప్తి మాబోధరీతి ♦ నిశ్చలముగ నిలుపు విఖ్యాతి॥ ౨౯౦॥

తా. ఎవరైనను, మేము వేదాంతవేత్తలము, శాస్త్రజ్ఞులమని చెప్పుచు నీయొద్దకేతెంచి యేమనియుబోధించిరేని, నేబోధించిన పరిపూర్ణముయొక్క గుట్టును నావల బెట్టి వారిమాటలను వినబోకుము నేజెప్పినదాని యెన్నడును మఱువకుము, ఈబోధననుష్ఠించి యశస్సును జెందుము. ఎఱుకను గుఱించి తలవకుము. ఈబోధయే దైవమని నమ్మియుండుము. ౨౯౦.

కం॥ కలవంటిది యెఱుకను దన । కలలోపలనైనఁగాని గానఁ
గఁబోకర । కల మేలుకొనినపిమ్మటఁ । గలయని చూడకు
ము నీపు కాంక్షలు లేక ♦ యెన్నడు నీవా కాంక్షలఁబోక ♦ కాం
క్షా కాంక్షల రెంటి కలనైనఁదలచక । కాంక్షలు గలయెఱుక
కాలిపోయిన వెనుక కాంక్షలు లేక ♦ యెన్నడు నీవా కాంక్ష
లఁబోక॥ ౨౯౧.

తా. స్వప్నప్రాయమైన యెఱుకను, నీస్వప్నమునందు గూడ స్మరింపవలదు ఎఱుకయను కలనుండి మేల్కొనిన పిమ్మట, ఆకలను గుఱించి (అనగా యెఱుకనుగుఱించి, తలవకుము. కలయందలి సంగతులనెవరైనను మరలదలతురా. నీవు రాగద్వేషంబులను విడిచిపెట్టుము. కలలోనైనగూడ నీకు వాటితలంపువలదు. అట్టి రాగద్వేషసహితమైన ఎఱుక నశించిన పిదప, నీకుపరిపూర్ణమునందేలాటి భ్రాంతులు నుండవు. పరిపూర్ణము రాగద్వేషాది రహితము. ౨౯౧

కం॥ లేనివిమైజగమెఱుకలు । మానసమునసత్యమట్లమాన కతోఁచుఁ । లేనివిలేవని చూచినఁ। దాననుదిలేకబయలుతా నేమైయుండు ♦ తెలివిలోఁదెలివి తెలిపి లేకుండు ♦ అలసినఁదెలిసినఁ గలసిన మెలసిన । వలసిననది వెల్లివిరిసినరీతినిఁదానేమై యుండు ♦ తెలివిలోఁదెలివి తెలివిలేకుండు॥ ౨౯౨॥

తా. శిష్యా. సత్యములుకాని వియు, సత్యములు కానివియునైన జగమెఱుకలు రెండును. మనస్సునకు సత్యముగానే తోచు చుండును, ఈరెండును లేనివని బాగుగా నెఱిగినపిదప, తానుఅనునదిఉండదు.(అనగాఅహంకారాదులుండవు ఒక్కబయలే మిగిలియుండును. తెలివిలో తెలివిలేకుండును [అనగాఅన్నిటియునెఱుగు నెఱుక సరియైన జ్ఞానము కాదు పరిపూర్ణ జ్ఞానమొక్కటియే సరియైనజ్ఞానము. అలసినను తెలిసినను, చేసినను, మెలగినను ఏమిచేసినను పరిపూర్ణముసర్వమునిండినదై మార్పులేమియు లేక నుండును. ౧౯౨.

కం॥ మాటలకుమరునులక్ష్యము । బాటలచేఁజెడునుగుఱియు మర్మమెఱిఁగినఁ । మాటలు లేకయు బయలే। మాటకు నొకచాటు లేక మఱియుండునన్నా ♦ చూపులచేతఁ జూడరాదన్నా ♦ రేపుమాపును లేదు ప్రాపుదాపును లేదు । ఆపదసంపదయనిశములేనిది మఱియుండునన్నా ♦ చూపులచేతఁజూడ రాదన్నా॥ ౨౯౩॥

తా. మాటలచేతనే లక్ష్యములు [చూపబడునది అనగా గుఱుతుగలది ఎఱుక] కలుగును, ఆమాటలచేతనే గుఱించుచునట్టి ఎఱుకయు తనయొక్క మర్మమెఱిగినయెడనాశము చెందును ఈపరిపూర్ణమును మాటలు వర్ణింపజాలవు. దీనినినశింపచేయనుజాలవు. ఈపరిపూర్ణముఏమాటలచాటునను నుండదు. దానిని కన్నులు జూడజాలవు. దానికి రేపుమాపులును అనగా మొదలు కొనలును దగ్గరదూరములును సంపదలునుదారిద్ర్యములును లేవు అట్టి యవస్థలతోడిసంబంధముఎల్లప్పుడును లేక వాటిచేత చలింపక పరిపూర్ణము ఎల్లప్పుడును నొకటే విధముగా నుండును. ౨౯౩.

కం॥ తరమాం పరిపూర్ణముగన । గురుకృప లేనట్టినరులు గురు
తులిసుట్లకై । పరమార్థమెఱుగ శక్యమె। గురుకృప చేదెలిసె నేని
గురుతుండదయ్యా ♦ మఱుగెఱిఁగిన మఱినిల్వదయ్యా ♦ మఱు
గుదెలిసినమీఁద మఱియెఱుకతాఁబోవు । మఱుగుచేత నెబహు
మాయల బెట్టును గురుతుండదయ్యా ♦ మఱుగెఱిగిన మఱి
నిల్వదయ్యా॥ ౨౯౮॥

తా. శిష్యా. గురుకటాక్షము లేని మనుష్యమాత్రుడు పరిపూర్ణమును స్వయముగా దర్శింపలేడు. గుర్తుగల ఎఱుకను త్యజింపను జాలడు. అట్టి గురుకృప లేని వానికి పరిపూర్ణమును దర్శింప సాధ్యముకాదు. గురూపదేశమునందిన వానికి గుర్తులేవియు నుండవు. అనగా ఎఱుకతోడి సంబంధములుండవు. అట్టివానికి పరిపూర్ణమెఱుకల మర్మమెఱిగినపిదప ఎఱుకతానెందును నిలువజాలక పారిపోవును. వాటిమర్మమునెఱుగక యుండిన యెడల అనేకవిధములైన మాయలకు లోబడియుండును ౨౯౮.

కం॥ ద్వయదోషరహితమగుచును । ద్వయగోషముపొం
దబోక ద్వయశూన్యుడవై । ద్వయమద్వయములు గాకను ।
ద్వయమద్వయ మనెడి యెఱుకదగులక తాను ♦ మిగులుట లేక
నగపుడమాను ♦ పగలు రాత్రులుగాక పరిపూర్ణమైబయలువై।
వెలుగక మలవక తొలగక నలుగక దగులక తాను♦మిగులుట
లేకనగపుడమాను॥ ౨౯౯॥

తా. ద్వివిధదోషములచే విడువబడినవాడవై అనగా ఆదోషములం జెందక, రెండును లేనివాడవై అనగా శరీరాత్మలు లేనివాడవై. వీటి రూపమైన ఎఱుకతోడి సాంగత్యము లేకయుండుటచేత దుఃఖము లేకయుండుము, పరిపూర్ణము, వెలుగక, మలగక, తొలగక, నలుగక, తగులకయు నుండుము అట్టి పరిపూర్ణమును దర్శించి యెఱుకను వదలిపెట్టుము. ౨౯౯

కం॥ కరాఁడి గురుశిష్యులిద్దరు । వేడుకతో బయలనున్న విధ
మాఁటెఱుకనే । పిడిదిది లేసిదనుమా । చాటున నికనేమిదోచ

దది యేమో కాని ♦ వింటిరెమీర లిదియందులోని ♦ చూడు
మీ యెఱుకను వేడితివి కనుంచు । నీడు జోడును లేని యేకమైవిల
సిల్లునది యేమో కాని ♦ వింటిరెమీరలిదియందులోని॥ ౨౯౬॥

తా. శిష్యా గురుశిష్యు లిరువురు పరిపూర్ణమునందున్న విధము. నెఱిగిన వెంట నే ఎఱుకను పాఱద్రోలిరి. ఎఱుక లేనే లేదని బాగుగా నెరుగుము అది దేని చాటునను లేదు. పరిపూర్ణ మెఱుకల రెంటిని బాగుగా దెలిసికొని, నిజము కాని యెఱుకను వదలిపెట్టుము. ఈడుజోడు లేనిదియు, నిత్యమైనదియు, సత్యమైనదియు ఒక్క పరిపూర్ణమే యని నెఱుగుము. ౨౯౬.

కం॥ ఎఱుక నెఱుంగని బయలున। గురుడును శిష్యుండను వారి గోడ వలుని కమీ । రెఱుగరు. ఎఱుక నెఱుంగరు. । ఎఱిగినవన్నియును మీరె యేనును శ్కిక్కి ♦ యుళ్కిక్కిదా నెప్పుడు శ్కిక్కి ♦ మఱియింక మాటాడ మాకు లేదాయెను । సరిలేని బయలైతె సరిపోయె నటుమీద నేనును శిక్కి ♦ యుళ్కిక్కిదా నెప్పుడు శ్కిక్కి॥ ౨౯౭॥

తా. ఎఱుకను నెగని పరిపూర్ణ బయలునందు, గురుశిష్యులకుం జరిగిన సంవాదములు మొదలగు సంగతులుగా నరావు. పరిపూర్ణము నెఱిగిన తరువాత యెఱుకను జూడజాలరు. అనగా యెఱుక యే నశించి పోవును. ఇంతవరకు మనలకు దెలిసియుండు సంగతులన్ని యును బద్ధము నీవు నేను అనునదియును బద్ధము. మనమిరువుర బద్ధము. అబద్ధ మెప్పుడును నిజముగాదు. పరిపూర్ణమును దర్శించినపిదప, మనమిరువురు మాటలాడుటయనునది యేనుండదు. సమానరహితమైన పరిపూర్ణోదయమైన పిదప నంతయును శ్కిక్కి. ౨౯౭.

కం॥ అలభద్రాచలమునిన బ। యలుగనుగు త్రెఱుగ వలయు నెఱుక యే విఘ్నం। దులద్రోచి గురుని కృపచే । నిలువక విఘ్నేగిపో వనిశ్చయము దెరా ♦ కృష్ణదాసు నిశ్చయము దెరా ♦ ఇలలోన

నెవరైన నీకందార్థములలో। పలి గూఢార్థము తెలియభ్రమ
నుచెందరు వారు నిశ్చయమిదెరా ♦ కృష్ణదాసు నిశ్చయమి
దెరా॥ ౨౯౮.

తా. శిష్యా. పరిపూర్ణమును భద్రాచల క్షేత్రముగా నెంచవ
లయును. ఎఱుకను భద్రాద్రివాసుడైన శ్రీవిష్ణునిగా నెంచవలయును.
గురుకృపచే యెఱుకయను విష్ణుని పోగొట్టవలయును. అట్లు విష్ణువు
[ఎఱుక] మాయమైపోయిన యెడల. పరిపూర్ణ మొక్కటిమాత్రము నిత్య
ముగానుండును. ఇదియే గ్రంథకర్తయైన కృష్ణదాసులవారి నిశ్చయము.
ఈగ్రంథమును బాగుగాజదివి, దీనియందలి గూఢార్థములను గురుము
ఖముగా నెఱిగిన మనుజుని కేలాటి భ్రమలునుండవు. ౨౯౮.

కం॥ భాగవతులనారాయణ। యోగికి జానకి యనియెడు
యువతీమణికిని। బాగుగ బుత్రుడనై భూ। భాగమునం గృ
ష్ణుడనుచు బ్రభవించినాను ♦ అనంతికిబ్రభుడనైనాను ♦ నా
గురుకృపచేత నయమైనయీబోధ। నేగంటికన్నంతనీకు దెల్పు
టకిట్లు ప్రభవించినాను ♦ అనంతికిబ్రభుడనైనాను॥ ౨౯౯॥

తా. శిష్యా. నాదుతండ్రి భాగవతుల నారాయణ యోగినా
దుతల్లి జానకియనెడు స్త్రీరత్నము. వారలిద్దరికిని జనియించిన నన్ను
కృష్ణదాసుడందురు. అనంతమ్మయనెడు యువతీమణిని చేబట్టితిని నా
గురుకృపచేత నీబోధ నెఱిగితిని. అట్లెఱిగిన దెల్లయు నీకుం దెల్పుటక
య్యే నేను భూమియం దవతరించితిని. ౨౯౯.

కం॥ దేశాటనంబు జేసితి। వ్రాసితిగ్రంథములుకొన్ని వర
గురుశిష్యుల్। చేసెడుచర్చలువింటిని। రోసితిమోహాగ్ర్యపేషు
రూఢిగవినుమీ ♦ నీవిట్టియారూఢతగనుమీ ♦ దేశికుదయబు
ట్టజేసితి శుశ్రూషోప। దేశముగని యుపదేశ మిచ్చితిమెచ్చి
రూఢిగవినుమీ ♦ నీవిట్టి యారూఢతగనుమీ॥ ౩౦౦॥

తా. నేనును అనేక దేశములను దిరిగితిని. కొన్ని గ్రంథము

లను రచియించితిని. గురుశిష్యులోనర్చు సంవాదము లనేకములు వింటిని మోక్షము మొదలగు వాటిపైగల వాంఛను వదలితిని. ఒక గురు నొద్దకు బోయి ఆయనకు, ధనార్పణము, మనోర్పణము, వాక్యార్పణము, ఆత్మార్పణము మొదలైన చతుర్విధ శుశ్రూష లను జేసి, వారి యనుగ్రహమును సంపాదించితిని వారిచే నుపదేశ మందితిని అట్టి యుపదేశము నీకు జెప్ప కృతార్థుండనైతిని. ౩౦౦.

కం॥ ఏపురుషుడు గురువర్యుని । శ్రీపాదముబట్టలేడో చె లువుగనాతం । డీపుస్తకమునుజూచిన। నేపట్టున నిలువ కేగుని దినిజమయ్యా ♦ నరులార మీమది దెలియరయ్యా ♦ ముదము ననిను వెడలి మోక్షసతీశుడై సదయుడౌ సద్గురునిసమ్ముఖమున కునేగునిదినిజమయ్యా♦ నరులారమీమది దెలియరయ్యా॥౩౦౧॥

తా. శిష్యా, ఏపురుషుడైతే, సద్గురుని పాదపద్మములను బూ జింపడో అట్టివాడీగ్రంథమును జదివినను, విన్నను. నిలువక పాఱిపో వును. ఇదిసత్యము. దీనిని సత్యమని మీరు బాగుగా నెరుగుడు. సం తోషముతో దారాగృహాదులను వదలి, మోక్షకాంతకు ప్రభువైన [అనగా మోక్షముచెందిన] దయావంతుడగు సద్గురుని పాలికేగి యాతనిచే బోధను గొన్నవారును జననమరణ రహితులగుదురు.

కం॥ ఘనులీకందార్థంబులు । విని యీసారాంశమును గ్ర హించినవారె। ల్లనునుదమోక్షమునొందుదు । రనవరతము ని హసుఖంబు లందుదురిలను ♦ అష్టైశ్వర్యానందులై తగను♦ పొందుగ ధనకనక పుత్రపౌత్రులుగల్గి। సందేహముడిగి ని శ్చలచిత్తములసౌఖ్య మందుదురిలను ♦ అష్టైశ్వర్యానందు లై తగను॥ ౩౦౨॥

తా. ఈకందార్థములవినిన్ని, ఇందలి సారాంశమును గ్రోలిన పెద్దలు కడపట మోక్షము జెందుదురు. ఈ భూమియందున్నంతకాల ము సుఖముగానుందురు. అణిమాద్యష్టైశ్వర్యములతో గూడుకొ న్నవారై ధనకనక పుత్రపౌత్రాదులు గలిగి సుఖంబున నుందురు.

పరలోకమునందును మోక్షసుఖము నొందుదురు. అనగా ఇహపర ములయందును సుఖంబున నుందురు. ౩౦౨.

## గద్య.

ఇది శ్రీ సుదచలగురువర్యుడు. శివరామదీక్షితుని శిష్యుడైన అప్పయమంత్రికి శిష్యుడగు పరశురామ వంశోద్భవ సీతారామ స్వాముల కత్యంత ప్రియశిష్యుండును. సుజన విధేయుండును, పరిపూర్ణజ్ఞుండును భాగవతుల నారాయణయోగి పుత్రుండును నైన భాగవతుల కృష్ణదాసాఖ్యునిచే రచియింపఁబడ్డదియు ఎఱుక అబద్ధమనియు, పరిపూర్ణ మొక్కటియే నిజమనియు దెల్పెడు.

శుద్ధనిర్గుణ తత్త్వ కందార్థము
సర్వం సంపూర్ణము.



